# నవనారసింహక్షేత్రం

# ఆహోబిలం



**NAVA NARASIMHA KSHETRAM - AHOBILAM**



*By*
**Dr. Nossam Narasimha Acharya**

*Editor-in-Chief*
**Prof. Ravva Sri Hari**

T.T.D. Religious Publication Series No.1138


*First Print:* 2014
*Copies:* 2000
*Price : 50/-*

*Published by*
**M.G. Gopal,** I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

*Printed at*
***Tirumala Tirupati Devasthanams Press,***
Tirupati.

# ముందుమాట

**పరిత్రాణాయ సాధూనాం**
**వినాశాయ చ దుష్కృతామ్**
**ధర్మసంస్థాపనార్థాయ**
**సంభవామి యుగే యుగే**

అని భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్ముడు పేర్కొన్న విధంగా సజ్జనులను రక్షిస్తూ, దుర్జనులను శిక్షిస్తూ ధర్మసంస్థాపన చేయడానికి భగవంతుడు యుగయుగాలలోను అవతరిస్తాడు.

లోకకల్యాణం కోసం శ్రీహరి ధరించిన దశావతారాలలో నాల్గవది నృసింహావతారం. లోకకంటకుడైన హిరణ్యకశిపుని సంహరించి ప్రహ్లాదుని రక్షించేందుకు, విధాత హిరణ్యకశిపునికి ఇచ్చిన వరాలను నిజం చేస్తూ శ్రీహరి నరమృగ శరీరంతో ధరించిన అవతారమే నృసింహావతారం.

శ్రీహరి నృసింహునిగా అవతరించి హిరణ్యకశిపు సంహారం చేసిన ప్రాంతమే అహోబలం. పావనభవనాశి నదీతీరాన భీకరమైన నల్లమల అటవీప్రాంతంలోని ఈ అహోబల క్షేత్రంలో స్వామివారు తొమ్మిది రూపాలలో, తొమ్మిది ప్రదేశాలలో వెలసి అహోబలాన్ని నవనారసింహక్షేత్రంగా అనుగ్రహించారు.

అహోబల నృసింహస్వామివారికి, తిరుమల వేంకటేశ్వర స్వామివారికి ఒక ప్రత్యేకమైన అనుబంధమున్నది. భవిష్య, బ్రహ్మాండాది పురాణాల ప్రకారం శ్రీనివాసుడు పద్మావతీ వివాహ సమయంలో అతిథులుగా వచ్చిన దేవతా సమూహానికి విందును ఏర్పాటుచేసి ఆ ఆహారాన్ని మొట్టమొదటగా అహోబల నృసింహస్వామికి

నివేదించాడని తెలుస్తున్నది. అలాగే వివాహానంతరం పద్మావతీసమేతంగా అహోబల నృసింహుని సందర్శించి దిగువ అహోబలంలో లక్ష్మీ నృసింహస్వామివారిని ప్రతిష్ఠించి, పూజించాడని కూడా ఐతిహ్యం. మరో విశేషమేమంటే తిరుపతిలో ఎగువ తిరుపతి, దిగువ తిరుపతి అని ఉండగా అహోబలంలో కూడా ఎగువ అహోబలం, దిగువ అహోబలం అనే పేర్లు ఉన్నాయి. పైగా శేషాచలపర్వత సానువుల్లో ఆదిశేషుని శిరస్సుపై శ్రీహరి తిరుమల శ్రీనివాసుని రూపంలోను, నడుము భాగంలో నరహరి అహోబల నృసింహస్వామి రూపంలోను కొలువైయున్నారు.

చతుర్యుగమూర్తి అయిన అహోబల నారసింహుని గూర్చి డా॥ నొస్సం నరసింహ ఆచార్యగారు వ్రాసిన "నవనారసింహక్షేత్రం–అహోబలం" అనే ఈ గ్రంథంలో నవనారసింహుల దర్శనం, స్వామివారి నిత్యకైంకర్యాలు, ఉత్సవాలతోపాటుగా నారసింహ స్తోత్రకదంబాన్ని కూడా చక్కగా క్రోడీకరించడం జరిగింది. ఇంత చక్కటి గ్రంథాన్ని అందించిన డా॥ నొస్సం నరసింహ ఆచార్య (ఉపసంపాదకులు, తి.తి.దేవస్థానములు, తిరుపతి) గారికి మా కృతజ్ఞతలు.

అహోబలక్షేత్రదర్శినిగాను, నిత్యపారాయణగ్రంథంగాను ఉపయోగపడే ఈ గ్రంథం భక్తమహాశయుల విశేషాదరణ పొందుతుందని ఆశిస్తూ...

సదా శ్రీవారి సేవలో....

(సంతకం)

**కార్యనిర్వహణాధికారి**

తిరుమల తిరుపతి దేవస్థానములు

తిరుపతి.

# అభినందన

బ్రహ్మదేవుని వరాలతో విర్రవీగుతూ లోకకంటకుడైన హిరణ్యకశిపుని సంహరించడంకోసం విష్ణుమూర్తి నృసింహావతారంగా అవతరించినాడు. ఈ అవతారం తక్కిన అవతారాలకంటే విశిష్టమైంది. నరుని రూపంలోనూ, మృగరూపంలోనూ ఉండడంతోపాటు ఈ అవతారం స్తంభంనుండి అవతరించడం విశేషం.

మన రాష్ట్రంలో వేదాద్రి, ధర్మపురి, యాదగిరి, సింహాచలం, అహోబిలం మొదలైన అనేకస్థలాలలో నృసింహక్షేత్రాలు ఉన్నాయి. వీటిలో అహోబిలంలోని నృసింహక్షేత్రానికి ఒక విశిష్టత ఉంది. నృసింహస్వామి ఒక్కరూపంలో కాకుండా భార్గవ, కారింజ, ఉగ్ర, క్రోడ, జ్వాలా, మాలోల, పావన, యోగానంద, ఛత్రవట అనే నవనారసింహరూపాల్లో నెలకొన్న మహాపవిత్రక్షేత్రం అహోబిలం.

ఇట్టి పవిత్ర క్షేత్ర చరిత్రను తి.తి.దే. ఎడిటర్–ఇన్–చీఫ్ కార్యాలయంలో ఉపసంపాదకులుగా ఆధ్యాత్మిక గ్రంథముద్రణ విషయంలో సేవలందిస్తున్న మిత్రులు డా॥ నొస్సం నరసింహ ఆచార్యులు ఎంతో శ్రమపడి ఈ గ్రంథంలో నిబంధించి మన కందించినారు.

ఇందులో క్షేత్రచరిత్రతోపాటు ఈ క్షేత్రంలో జరిగే వివిధ సేవల విశేషాలు, భక్తుల సౌకర్యంకోసం నృసింహస్వామి స్తోత్ర కదంబమూ చేర్చబడ్డాయి. ఈ గ్రంథాన్ని చదివి జిజ్ఞాసువులు అహోబిల క్షేత్రానికి సంబంధించిన ముఖ్యవిషయాల నన్నింటినీ తెలుసుకోగలరు.

జిజ్ఞాసువు, ఉత్సాహి, స్నేహశీలి, శ్రమశీలి, వర్ధిష్ణువు ఐన డా॥ నొస్సం నరసింహ ఆచార్యులు రచించిన ఈ గ్రంథాన్ని దేవస్థానం పక్షాన ప్రచురించడం ఆనందదాయకం. గ్రంథకర్తను మనసారా అభినందిస్తున్నాను.

భక్తులు, జిజ్ఞాసువులు ఈ గ్రంథాన్ని ఆదరిస్తారని ఆశిస్తున్నాను.

**రవ్వా శ్రీహరి**

**ఎడిటర్–ఇన్–చీఫ్**

# ప్రహర్షోక్తి

చ. కలుషహరంబు భక్తజన కల్పమహీరుహమైన అయ్యహో
బిల నవనారసింహుల పవిత్రచరిత్రము నొస్సమన్వయా
మల కలశాబ్ధి చందిరుఁడు మంజులవక్త, సుధీవరుండు, నె
చ్చెలి నరసింహనాముఁడు రచింపఁగఁగంటి; ప్రహర్ష మందితిన్.

క. నరసింహాచార్యుఁడు స
త్పురుషుఁడు, మేధావి, కార్యధూర్వహుఁడు, దయా
పరుఁడు, రసజ్ఞుఁడు, రచయిత,
సరసుఁడు వర్ధిల్లుఁగాక శారద కరుణన్.

స్వస్తి

**విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు**
**పుస్తక ప్రచురణ విభాగము**
**తి.తి.దేవస్థానములు, తిరుపతి.**

# కృతజ్ఞతలు



**"అహోవీరం అహోశూరమ్**
**అహోబాహు పరాక్రమమ్**
**నారసింహం పరందైవం**
**అహోబలం అహోబిలం"**

వేదాద్రి గరుడాద్రి పర్వతాల నడుమ అహోబిలంలో అవతరించిన శ్రీనరసింహస్వామివారు తొమ్మిది రూపాలలో, తొమ్మిది ప్రదేశాలలో అర్చామూర్తిగా వెలసి ఈ క్షేత్రాన్ని నవనారసింహక్షేత్రంగా ఖ్యాతి తెచ్చారు.

అహోబల నృసింహస్వామివారు చతుర్యుగమూర్తి. నవనారసింహ క్షేత్రాలను దర్శించాలంటే భగవదనుగ్రహం తప్పనిసరిగా వుండితీరవలసిందే. అయితే నవనారసింహక్షేత్ర దర్శనానికి వచ్చే భక్తులకు ఏ ఏ క్షేత్రాలను ఏ మార్గంలో వెళ్లి దర్శించాలో చాలా వరకు తెలియదు. భీకరమైన నల్లమల అటవీ ప్రాంతంలో ఈ క్షేత్రాలు వెలిశాయి కనుక, ఈ క్షేత్రాలను దర్శించాలంటే స్థానికంగా బాగా పరిచయమున్నవారు వెంట తప్పనిసరిగా వుండాలి.

నవనారసింహక్షేత్రాలకు మార్గాన్ని తెలుసుకోలేక ఇబ్బంది పడేవారికి మార్గనిర్దేశకత్వాన్ని చేస్తూ క్షేత్రము, క్షేత్ర విశేషాలను తెలియజేసే గ్రంథమే ఈ నవనారసింహక్షేత్రం అహోబిలం.

తిరుమల తిరుపతి దేవస్థానములు వారు ఈ గ్రంథాన్ని స్వీయ ముద్రణగా స్వీకరించడాన్ని శ్రీవేంకటనారసింహుని అనుగ్రహంగా భావిస్తున్నాను. ఈ గ్రంథానికి ముందుమాటను వ్రాసి ఆమోదం తెలిపిన తి.తి.దేవస్థానముల శ్రీకార్యనిర్వహణాధికారి శ్రీ ఎం.జి.గోపాల్ గారికి మరియు సంయుక్త కార్యనిర్వహణాధికారులు శ్రీ పోలా భాస్కర్ గారికి, శ్రీ కె.ఎస్. శ్రీనివాసరాజు గారికి నా కృతజ్ఞతలు. ఈ గ్రంథ ముద్రణలో తమ అమూల్యమైన సలహాలనందిస్తూ సహకరించిన ప్రచురణల విభాగం అధికారులు (ఎడిటర్-ఇన్-చీఫ్) ఆచార్య రవ్వా శ్రీహరి గారికి మరియు

కార్యాలయంలోని పండితులు, పెద్దలు శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యులు, శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం గార్లకు, ఎడిటర్–ఇన్–చీఫ్ కార్యాలయ విభాగం వారికి మరియు డిటిపి విభాగం వారికి నా హృదయ పూర్వక ధన్యవాదములను తెలియజేసుకుంటున్నాను.

గ్రంథముద్రణలో వచ్చిన సందేహాలను నివృత్తి చేసి పీఠిక రచనలో సహకరించిన తి.తి.దేవస్థానములు దాససాహిత్య ప్రాజెక్టు విశేషాధికారి పండిత శ్రీ పగిడాల ఆనందతీర్థాచార్యుల వారికి,

విషయసేకరణలో సహకరించిన శ్రీమదహోబిల లక్ష్మీనృసింహస్వామి ఆలయ కార్యనిర్వహణాధికారి శ్రీ వి.ఎల్.ఎన్.రామానుజన్ గారికి మరియు క్షేత్రవిశేషాలను తెలియజేయడంతో పాటు అన్నివిధాల సహాయ సహకారాలందించిన శ్రీమదహోబిల దేవస్థానం వంశపారంపర్య ప్రధాన అర్చకులు శ్రీమాన్ కిడాంబి వేణుగోపాలాచార్యులు గారికి మరియు ఆలయ అర్చకులందరికి, ఆలయ పరిచారకులు శ్రీ రామకృష్ణమాచార్యులకు, ఈ గ్రంథానికి చక్కటి వర్ణచిత్రాలనందించిన అహోబల నరసింహ స్వామి ఆలయ ఆస్థాన ఫోటోగ్రాఫర్ శ్రీ ఉప్పల ప్రసాద్ గారికి నా కృతజ్ఞతలు.

ఈ గ్రంథాన్ని సకాలంలో చక్కగా ముద్రించిన తి.తి.దేవస్థానముల ముద్రణాలయాధికారి శ్రీ టి.రవి గారికి మరియు ముద్రణాలయ సిబ్బందికి నా కృతజ్ఞతలు.

నవనారసింహక్షేత్రం అహోబిలం అనే గ్రంథరాజాన్ని నాచే వ్రాయించుకున్న మా కులదైవం శ్రీమదహోబిల నారసింహస్వామి మరియు ముద్రిత ప్రతిగా తీర్చిదిద్ది అనుగ్రహించిన తిరుమల శ్రీవేంకటేశ్వర స్వామివార్ల దివ్య చరణారవిందములకు నమస్కరిస్తూ ఈ గ్రంథసుమాన్ని అంకితంగా సమర్పించుకుంటున్నాను.

**రచయిత**
**డా॥ నొస్సం నరసింహ ఆచార్య**
**తిరుపతి.**

# పీఠిక

**"మత్స్యః కూర్మ వరాహాద్యాః సమావిష్ణురభేదతః"**

మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, భార్గవ, రామ, కృష్ణ, బుద్ధ, కల్కి రూపాలే కాక ఇంకా అనేక రూపాలు వున్నా మూలరూపి అయిన శ్రీమహావిష్ణువునకు అవన్నీ అభిన్నస్వరూపాలేనని వరాహపురాణం చెబుతుంది.

మత్స్యాది సకల అవతారాలు జ్ఞాన, బల, క్రియలయందు శ్రీమన్నారాయణునకు సరిసమానమని, మూలరూపాలని, అవతార రూపాలని, భేదం లేదని, అన్ని అవతారాలు జ్ఞానకార్యంను, బలకార్యంను, ధర్మసంస్థాపనను చేయగల సామర్థ్యం గలవని పురాణాలు శ్రుతి, స్మృతులు ఘంటాఘోషంగా చెబుతున్నాయి.

భగవంతుని ప్రతి అవతారం అధర్మాన్ని అణచి ధర్మానికి దారి చూపుతుంది. ఇలాంటి అవతారాలలో నృసింహావతారం ఒకటైనా దాని వైశిష్ట్యం అనిర్వచనీయం.

శ్రీమద్భాగవతం భగవంతుని ఇరవైఅయిదు అవతారాలను నిరూపించింది. వీటిలో కొన్ని జ్ఞానోపదేశార్థం, కొన్ని జ్ఞానబలకార్యాల ప్రదర్శన కోసం, కొన్ని దేవతాహితం కోసం, కొన్ని భక్తరక్షణ దుష్టనిగ్రహణ కోసం, కొన్ని తత్త్వోపదేశాలకోసంకాగా, మరికొన్ని కేవలం దుష్టనిగ్రహణ కోసమే ధరించిన అవతారాలు. ఇందులో నృసింహావతార వైశిష్ట్యం దేవతలకు కూడా అనూహ్యమైనది.

హిరణ్యకశిపుడు బ్రహ్మ వరప్రసాదంచే ప్రచండుడై సురాసురనరాత్మక మైన ఈ ప్రపంచానికి ఏకచ్ఛత్రాధిపతి కావాలని తలంచి గర్విష్ఠుడై సహజమైన తన ఆసురీశక్తిచే మదోన్మత్తుడై హింసాప్రవృత్తిచే జీవనయాత్ర

సాగిస్తున్నాడు. దేవతలు తమ తమ స్థానాలు కోల్పోయి అజ్ఞాతులై సంచరిస్తూ శ్రీమహావిష్ణువును శరణుజొచ్చారు. అంతట సర్వేశ్వరుడు

**"యదా వేదేషు దేవేషు గోషు విప్రేషు సాధుషు**
**ధర్మే మయీచ విద్వేషః సవ ఆశు వినశ్యతి"**

ఎప్పుడైతే వేదాలందు, దేవతలందు, గోవులందు, విప్రులందు, సాధుసంతులందు, ధర్మమునందు, నాయందు ద్వేషమధికమగునో అప్పుడు అతనికి ఎన్ని వరాలున్నా నేను సంహరిస్తాను అని అభయమిస్తాడు. ఆ కాలం ఆసన్నమైనది. ప్రహ్లాదుడు నిరంతర హరినామస్మరణ చేస్తూ, తోటివారితో చేయిస్తూ అలౌకికానందాన్ని అనుభవిస్తున్నాడు. అది చూచిన హిరణ్యకశిపుడు "క్వాసౌ మదన్యో జగదీశ్వరో హరిః" – నాకంటే వేరేజగత్పతి ఎవరున్నారు? నీ శ్రీహరి ఎక్కడ? అని మదోన్మత్తుడుకాగా ప్రహ్లాదుడు "శ్రీహరి అణురేణు తృణకాష్ట పర్యంతం సర్వత్రా వ్యాపించివున్నాడు" అని పలికాడు. వెంటనే దైత్యేశ్వరుడు సభామందిరంలో రోషకోపములచే ప్రజ్వలిస్తూ నీ శ్రీహరి ఎక్కడున్నాడు? "క్వాసౌ యది చ సర్వత్ర తస్మాత్ స్తంభేనదృశ్యతే" – హరి సర్వాంతర్యామి అయితే ఎదురుగా ఉన్న ఈ స్తంభంలో నీ శ్రీహరి ఉన్నాడా? ఉంటే అగుపించదే! అని గర్జిస్తూ బలంగా పిడికిళ్లతో స్తంభంపై ప్రహారం చేసాడు. అంతట ఆ స్తంభంనుండి ప్రళయకాల మార్తాండునివంటి తేజస్సుతో అద్భుతమైన శక్తి కలిగిన భీకరాకారంతో నరమృగశరీరంతో నరసింహస్వామి బయటకు వచ్చాడు. ఈ ఘట్టాన్ని శ్రీవ్యాసభగవానులవారు భాగవతంలో రమణీయంగా, హృదయంగమంగా వివరించారు. "నాయమ్ మృగో నా పి నరో విచిత్రమ్ అహో కిమేతత్ నృ మృగేంద్ర రూపమ్" – ఈ రూపం మృగం కాదు, నరరూపం కాదు. నరమృగాకారం... అహో... అని హిరణ్యకశిపుడు ఆశ్చర్యచకితుడయ్యాడు.

"ప్రతప్త చామీకర చండలోచనమ్" – పుటం వేసిన బంగారం వలె మెరిసే కళ్లు, వెదజల్లబడిన కేసరాల సమూహం, కరాళదంష్ట్రం, ఖడ్గపు



కొనవలె నాలుక, ముడివడిన కనుబొమలు... ఈ రూపాన్ని చూచిన ధైర్యవంతుడైన అసురేంద్రుడే ధైర్యాన్ని కోల్పోయాడు.

## నృసింహావిర్భావంలోని ఆంతర్యం

**"సత్యమ్ విధాతుం నిజభృత్య భాషితమ్**
**వ్యాప్తిం చ భూతేష్వఖిలేషు చాత్మనః**
**అదృశ్యతాత్యద్భుత రూపముద్వహన్**
**స్తంభే సభాయాం న మృగం న మానుషమ్"**

ఇక్కడ నిజభృత్యుడు ఎవరు? అని ప్రశ్నిస్తే అందరి దృష్టి ప్రహ్లాదుడి వైపే వెళుతుంది. అయితే కేవలం ప్రహ్లాదుడేగాక, అనేకమంది నిజభృత్యులు ఈ ఘట్టంతో సంబంధమున్నవారు మనకు దర్శనమిస్తారు.

"నిజ భృత్య భాషితమ్ సత్యమ్ విధాతుమ్" – నిజభృత్యుడు ఆడిన మాటలను సత్యపరుచుటకు సర్వాంతర్యామి, సర్వవ్యాపి అయిన శ్రీహరి సభామందిరంలో స్తంభం నుండి నృహరిగా వ్యక్తమయ్యాడు. ఇక్కడ నిజభృత్యుడు ఎవరు... అంటే చతుర్ముఖ బ్రహ్మ!

బ్రహ్మదేవుడు హిరణ్యకశిపునికి వరాల వర్షాన్ని కురిపించాడు. అందులో "నాచే సృష్టింపబడిన వాడితో నీకు మరణం కలుగదు" అని కూడా ఒక వరమున్నది. అందుచే శ్రీహరి బ్రహ్మసృష్టికి విరుద్ధంగా తనంతట తానే స్వయంగా స్తంభం నుండి ఆవిర్భవించాడు. ఈ తత్త్వాన్ని తెలుపుటకే వేదవ్యాసులవారు "సత్యమ్ విధాతుమ్ నిజభృత్య భాషితమ్" – ఇత్యాదిగా చెప్పారు.

ఇంకోవిధంగా పరిశీలిస్తే సనకాదులు నిజభృత్యులు. సనకాదులు ఒకప్పుడు వైకుంఠప్రవేశం చేయబోగా ద్వారపాలకులైన జయవిజయులు అడ్డగించారు. కోపగించిన సనకాదులు వారిని అసురులుగా జన్మించమని శపించారు. ఆ శాపాన్ని శ్రీహరి కూడా ఆమోదించాడు. అయితే సనకాదులు

జయవిజయులందు కరుణచే "హే నారాయణా! వీరు మూడు జన్మలల్లో మాత్రమే అసురులుగా పుట్టి నీచేత సంహరింపబడి మోక్షాన్ని పొందేలా వరాన్ని ప్రసాదించ" మని ప్రార్థించారు. ఇలా నిజభృత్యులైన సనకాదుల మాటలను సత్యపరుచుటకు శ్రీహరి నరసింహునిగా ఆవిర్భవించాడు.

మరోవిధంగా పరిశీలిస్తే నిజభృత్యులు వేదాలు. "శ్రుతి స్మృతీ హరేరాజ్ఞే" – శ్రుతి స్మృతులు శ్రీహరి ఆజ్ఞాస్వరూపాలు. వీటి ప్రకారం దేవదేవుడైన శ్రీహరికి మాత్రమే తల్లిదండ్రులు లేరు ప్రళయకాలంలో ఒక్క నారాయణుడు తప్ప ఇంకెవరూ ఉండరు "ఏకో నారాయణ ఆసీత్ న బ్రహ్మా న చ శంకరః" – అని చెబుతున్నాయి. కనుక వేదాలను సత్యపరుచుటకు శ్రీహరి ఏ తల్లిదండ్రులను ఆశ్రయించక స్తంభం నుండి ఆవిర్భవించాడు.

అలాగే ఇంద్రాది దేవతల బాధలను తొలగించుటకు వారికిచ్చిన మాటను నెరవేర్చుకొనుటకు శ్రీహరి స్తంభం నుండి ఆవిర్భవించాడు. ప్రస్తుతం స్తంభములో శ్రీహరి ఉన్నాడు అన్న ప్రహ్లాదుని మాటను సత్యం చేస్తూ శ్రీహరి స్తంభం నుండి నరమృగాకారంలో ఆవిర్భవించాడు.

ఈ విధంగా నృసింహావతార తత్త్వం నిగూఢమైనది. వీటిని నిత్యం శ్రవణ, మనన, ధ్యానం గావించినవారికి ఆపదలు, ఈతిబాధలు, విఘ్నాలు, దుష్టగ్రహ పీడలు, శత్రుపీడలు తొలగి శాశ్వత సుఖస్వరూపమైన మోక్షాన్ని ఆ పరాత్పరుడు అనుగ్రహిస్తాడు.

హిరణ్యకశిపుని సంహారం కొరకు శ్రీహరి అవతరించిన ప్రాంతమే అహోబలం. అహోబలంలో స్వామి తొమ్మిది రూపాల్లో, తొమ్మిది ప్రాంతాల్లో నవనారసింహునిగా దర్శనమిస్తాడు. ఆ నవనారసింహులను దర్శించి జన్మ చరితార్థం చేసుకుందాం....!

– రచయిత

# విషయసూచిక

**శ్రీ అహోబిల లక్ష్మీనృసింహాయనమః**

## నవనారసింహక్షేత్రం - అహోబిలం

**అహోబిలే గారుడశైల మధ్యే కృపావశాత్ కల్పిత సన్నిధానమ్।**
**లక్ష్మ్యా స్సమాలింగిత వామభాగం లక్ష్మీనృసింహం శరణం ప్రపద్యే॥**

**"కృతే నారసింహశ్చ త్రేతాయాం రఘునందనః**
**ద్వాపరే వాసుదేవశ్చ కలౌ వేంకటనాయకః"**

అని మన శ్రుతి, స్మృతి పురాణాలు చతుర్యుగ బంధాన్ని తెలియజేస్తున్నాయి. కృతయుగానికి నారసింహస్వామి, త్రేతాయుగానికి శ్రీరామచంద్రుడు, ద్వాపరయుగానికి శ్రీకృష్ణుడు, కలియుగానికి శ్రీవేంకటేశ్వరుడు అధినాయకులని అర్థం.

పంచమవేదమైన మహాభారతంలో శ్రీకృష్ణపరమాత్ముడు అర్జునునికి ఉపదేశించిన భగవద్గీతలో ధర్మానికి గ్లాని కలిగినపుడు తనను తాను సృజించుకుంటానని శ్రీహరి ప్రతిజ్ఞ చేశాడు.

**"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం**
**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే"**

దుష్టశిక్షణ శిష్టరక్షణకై అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుడైన శ్రీమహావిష్ణుమూర్తి ధరించిన అవతారాలే దశావతారాలు.

**"మత్స్యః కూర్మోవరాహ శ్చ నారసింహశ్చ వామనః**
**రామో రామశ్చ కృష్ణశ్చ బౌద్ధశ్చ కల్కిరేవ చ"**

ధర్మ సంస్థాపనకొరకు శ్రీమహావిష్ణుమూర్తి ధరించిన అవతారాలు వరుసగా మత్స్యావతారం, కూర్మావతారం, వరాహావతారం, నారసింహావతారం, వామనావతారం, పరశురామావతారం, రామావతారం, కృష్ణావతారం, బౌద్ధావతారం, కల్కిఅవతారం.

ఈ దశావతారాలను ఒక్కసారి మనం పరిశీలిస్తే మొదటి నాలుగవతారాలు. జల, భూ, జలచర, ఉభయచరాలకు సంబంధించిన అవతారాలు- ఐదు, ఆరు అవతారాలు వనచర జీవనాన్ని సాగించే తాపసులకు సంబంధించిన అవతారాలు. ఇక తక్కిన నాలుగవతారాలు మానవజాతికి సంబంధించిన అవతారాలు. అనేకజీవన రహస్యాలను, భూ, భౌగోళిక విశేషాలను గురించి సూచించేవి.

దశావతారాలను మరోదృష్టితో పరిశీలిస్తే మత్స్య, కూర్మ, వరాహావతారాలు పుణ్యభూమి కర్మభూమి అయిన భరతఖండానికి చుట్టు ఉన్న మూడు సముద్రాలను సూచిస్తాయి. న మృగం, న మానుషమైన నారసింహావతారం ఉత్తర, దక్షిణాంచలాలను సూచిస్తాయి. వామన, పరశురామావతారాలు ఆ సేతుహిమాచల పర్యంతం వ్యాపించియున్న వనాలు, అరణ్యాలు, నదీనదాలను సూచిస్తాయి. రామ,కృష్ణ, బుద్ధ కల్కి అవతారాలు నాలుగు సామాజిక జీవనవిధి-విధానాలకు, విశేషాలకు, మానసిక పరిపక్వతకు, మనస్తత్వానికి, ఆదర్శవంతమైన జీవనానికి, రాజకీయ, రాజ్యపాలన, సమరవిశేషాలకూ, ధర్మసూక్ష్మాలకు, వేదాంత తత్వాధిక విశేషాలకు సంకేతంగా నిలిచే అవతారాలుగా కనిపిస్తాయి.

కాగా మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, పరశురామ అవతారాలను తాత్కాలిక అవతారాలుగా కూడా కొందరు పెద్దలు పేర్కొంటారు. అంటే ఏర్పడిన సమస్యను పరిష్కరించేందుకు అప్పటికప్పుడు ధరించిన అవతారాలుగా పేర్కొనవచ్చును. దశావతారాలన్నిటిలోకి సంపూర్ణావతారాలుగా పేర్కొనదగ్గ అవతారాలు రెండేరెండు అవి 1. రామావతారం 2. కృష్ణావతారం. పరమాత్ముడు ఈ రెండు అవతారాలలో సాధారణ మానవుడు ఎలా జన్మించి జీవనాన్ని సాగించి కష్టసుఖాలను ఎదుర్కొంటూ లయిస్తున్నాడో అలాగే పరమాత్ముడుకూడా జన్మించి ఆడిపాడి సమస్త మానవకార్యాలను నిర్వర్తించి సాధారణ మానవునివలె



సుఖదుఃఖాలను అనుభవించి ఆప్యాయతాభిమానాలను పంచి ఆదర్శవంతం అయ్యారు. కనుకనే ఈ రెండు అవతారాలను సంపూర్ణావతారాలని పేర్కొన్నారు.

దశావతారాలన్నిటిలోకి ఒక ప్రత్యేకమైన, విలక్షణతను కూడుకున్న అవతారం నరసింహావతారం. ఇది దశావతారాలలో నాల్గవది. ఈ అవతారంలో ఉన్న విచిత్ర, అద్భుత, సృష్టి మరే అవతారానికి లేదన్నా అతిశయోక్తి కాదు. ధర్మానికి గ్లాని కలిగిస్తున్న దుష్టులను శిక్షించి శిష్టులను రక్షించేందుకు పరమాత్ముడు అనేకావతారాలను ధరించినా ఈ నరసింహ రూపంలో అవతరించటమే ఒక విశిష్టమైన ప్రకరణం.

నరసింహ అవతారాన్ని ఒక్కసారి పరిశీలిస్తే....శరీరమంతా నరుడు శిరస్సు మాత్రం సింహం శిరస్సు. సింహం నేలమీద నివసించడమే కాకుండా నీళ్ళలోకూడా ప్రయాణించగలదు. అరణ్యంలోని జంతుజాలాన్నంతటినీ తన బాహుబలంతో అదిమిపెట్టి మృగరాజుగా తానే ప్రకటించుకుంటుంది.

మనిషికి జంతుజాలం నుండి వేరుచేసేవి యుక్తాయుక్త విచక్షణాజ్ఞానం, ఈ జ్ఞానానికి శౌర్య పరాక్రమాలు తోడైతే విజయం. అదే నరసింహావతారం. జ్ఞానముండి, శౌర్యం లేకపోతే బలహీనుడౌతాడు. బలం ఉండిజ్ఞానం లేకపోతే రాక్షసుడౌతాడు. జ్ఞానశక్తి ద్వారా ధర్మసంరక్షణ చేసి శౌర్యపరాక్రమాలద్వారా అధర్మవర్తనులను అణచివేసేందుకు, శ్రీహరి ధరించిన అవతారంగా నరసింహావతారాన్ని పేర్కొనవచ్చును. ఈ అవతారం కోపోద్రిక్తతతో ఆవేశంతో కూడున్నదైనా భక్తజనపాలన, దుష్టజన శిక్షణ ప్రధాన ధ్యేయంగా కనిపిస్తుంది. నారసింహస్వామి మంత్ర జపంవల్ల ఎంతటి ఘోరపిశాచ, యీతిబాధలైనా నిర్మూలనం కాక తప్పదు. ఈ మంత్రోపాసన వల్ల జ్ఞానాన్ని, ధైర్యాన్ని పొందడమేకాకుండా డాకిని, శాకిని మొ။న దుష్ట శక్తులను కూడా హతమార్చవచ్చు. చేతబడి బాణామతి, శిల్లంకి మొదలైన క్షుద్రప్రయోగాలను కేవలం నారసింహ నామ మంత్రోపాసనతో ఎదుర్కొనవచ్చును. సకల

గ్రహబాధలు, సంసారబాధలు, అష్టకష్టాలు తొలగింపజేసుకొని సుఖశాంతులను, ఆరోగ్యాన్ని పొందవచ్చును. ఎంతటి క్లిష్టతరమైన కార్యమైనా, నరసింహ మంత్రోపాసనవల్ల సాధించవచ్చు. యమకింకరులను సైతం వెనుకకు పరిగెత్తించవచ్చు. దివ్యవైకుంఠాన్ని సైతం సులభంగా సాధించవచ్చును.

**నరసింహ! తే దివ్య నామ మంత్రేణైవ**
**దురిత జాలానీహ దూరయేచ్ఛ**
**నరసింహ! తే దివ్య నామమంత్రేణైవ**
**దీర్ఘరోగానపి నాశయేచ్ఛ**
**నరసింహ తే దివ్య నామమంత్రేణైవ**
**శత్రుసంఘానపి సంహరేచ్ఛ**
**నరసింహ తే దివ్య నామమంత్రేణైవ**
**యమకింకరానపి ధావయేచ్ఛ**

**"తవ తు నామ మంత్రబలేన భవతి దేవ!**
**దివ్య వైకుంఠపదమపి సులభమేవ"**

అందుకే సాక్షాత్తు పరమేశ్వరుడు, శనీశ్వరుడు, దేవేంద్రుడు మున్నగు దేవతలుసైతం నరసింహస్వామిని స్తుతించారు.

వైష్ణవ సంప్రదాయంలో శ్రీమహాలక్ష్మీసమేత నరసింహస్వామి ఉపాసన శ్రేష్ఠతరంగా భావిస్తారు. లక్ష్మీనృసింహుని ఉపాసించడంవల్ల సమస్త దుఃఖాలు తొలగి సకలైశ్వర్యాలు సిద్ధిస్తాయి. ఐహిక భోగాలు సిద్ధిస్తాయి. ధనధాన్యాదులు సమృద్ధమవుతాయి.

శ్రీ మహావిష్ణువు అపార కృపాసముద్రుడు, దయాసింధువు, దీనజనరక్షకుడు. తనను నమ్మి కొలిచిన భక్తులను ఎన్నడూ అలక్ష్యం చేయక భక్తులు ఏ రూపంలో ఎక్కడ, ఎప్పుడు, ఎలా స్మరిస్తే అప్పుడు అక్కడ,



ఆ రూపంలోనే ప్రత్యక్షమవుతాడు. అందుకు నిదర్శనమే శ్రీ నరసింహ అవతారం.

"సత్యం విధాతు నిజభృత్య భాషితం" అని భాగవతంలో పేర్కొన్నట్లు ప్రహ్లాదుని వాక్కులను అక్షర సత్యం చేయడానికి, చతుర్ముఖబ్రహ్మ హిరణ్యకశిపునికి ఒసగిన వరాలను నెరవేర్చడానికి శ్రీమహావిష్ణుమూర్తి సభాస్థలి మధ్యలోనున్న స్తంభంనుండి నరమృగశరీరంతో ఉద్భవించాడు. బ్రహ్మ ఒసగిన వరాలను ఋజువుచేస్తూ దుష్టశిక్షణ చేశాడు నారసింహునిగా ఆ శ్రీహరి. ఎవరైతే నరసింహోపాసన చేస్తారో వారికి ఎన్నటికీ అపజయం దరిచేరదు. ఉగ్రరూపంతో, మహావీరత్వంతో, పాపాలను జ్వలింపజేసే స్వభావంతో అవతరించిన నరసింహస్వామి మృత్యువుకే మృత్యువు వంటివాడు. అంటే మృత్యువును దరిచేరనీయడు. నరసింహస్వామి కొలువైయున్నచోటికి కాలయముడు కూడా దరిజేరేందుకు జంకుతాడు.

**"ఉగ్రం వీరం మహావిష్ణుం జ్వలంతం సర్వతోముఖం**
**నృసింహం భీషణం భద్రం మృత్యు మృత్యుం నమామ్యహం"**

అని దేవతలు స్తుతించారు.

**మాతా నృసింహ శ్చ పితానృసింహః**
**భ్రాతా నృసింహ శ్చ సఖానృసింహః**
**విద్యా నృసింహ శ్చ ద్రవిణం నృసింహః**
**స్వామీ నృసింహః సకలం నృసింహః**

అని స్వామివారినే సర్వస్వంగా భావించి మనస్ఫూర్తిగా ఎవరు ఉపాసిస్తారో, స్వామివారు వెన్నంటిఉండి సకల ఉపద్రవాలనుండి వారిని కాపాడుకుంటాడు. తల్లి, తండ్రి, భ్రాత, మిత్ర, అన్ని రూపాలలో తానే ఉండి సంరక్షిస్తాడు. సకలసుఖాలను ప్రసాదిస్తాడు. ఇందుకు నిదర్శనం ఒక ప్రహ్లాదుడు, ఒక ఆదిశంకరులు.

లోకకంటకుడైన హిరణ్యకశిపుని సంహరించి శిష్టరక్షణ చేసేందుకు శ్రీహరి నృసింహునిగా అవతరించిన క్షేత్రమే అహోబిలం. అహోబిలంలో స్వామి స్వయంవ్యక్తరూపంలో ఉంటూ ఎగువ అహోబిలాన్ని కేంద్రంగా చేసుకొని చుట్టూ గరుడాద్రి, వేదాద్రి పర్వతాలలో భీకరమైన నల్లమల అరణ్యంలో 9 రూపాలలో నవనారసింహునిగా కొలిచినవారికి కొంగుబంగారమై, కొలువైయున్నాడు దేవదేవుడు. అందుకే ఈ అహోబిలక్షేత్రం నవనారసింహ క్షేత్రంగా ఖ్యాతి గడించింది.

నిజానికి "ఈ భూగోళంపై ఆదిశేషుడు శేషాద్రిగా శ్రీహరికి సేవలందిస్తున్నాడు. ఆదిశేషుని శిరస్సున కలియుగ ప్రత్యక్షదైవమైన శ్రీనివాసుడు, నడుము భాగాన అహోబిల నవనారసింహుడు, తోకభాగాన శ్రీశైల మల్లికార్జునుడు కొలువైవుండి భక్తులను అనుగ్రహిస్తున్నారు" అని బ్రహ్మాండాది పురాణాలు చెబుతున్నాయి.



**ఆర్ట్ : శివప్రసాద్, టి.టి.డి**



## అహోబిలక్షేత్ర పరిచయం

అహోబిల క్షేత్రం రాయలసీమకు ముఖద్వారంగా, ఆధ్యాత్మిక క్షేత్రాలే సరిహద్దులుగా కలిగిన ప్రాంతంగా, ఎందరో మునులకు, యోగులకు, తపోనిధులకు, సిద్ధులకు నెలవైన ప్రాంతంగా భాసిల్లుతున్న కర్నూలు జిల్లాలో ఉంది. కర్నూలు కడపమార్గంలో కర్నూలు నుండి దాదాపు 120కి.మీ దూరంలో ఈ క్షేత్రంఉంది. నంద్యాలకు 65 కి.మీ, ఆళ్లగడ్డకు 24 కి.మీ దూరంలో దట్టమైన నల్లమల అటవీప్రాంతంలో ఈ క్షేత్రం నెలకొని ఉంది. ఈ క్షేత్రానికి కర్నూలు, నంద్యాల నుండి ఆళ్ళగడ్డకు బస్సులో చేరుకొని అక్కడి నుండి మరోబస్సులో చేరుకోవలసి వుంటుంది.

పచ్చటి చెట్లమధ్య జలపాతాలమధ్య వన్యమృగాలమధ్య ఎత్తైన కొండల మధ్య ఉన్న ఈ క్షేత్ర ప్రయాణం ఆహ్లాదాన్ని, ఆనందాన్ని, ఆధ్యాత్మిక జ్ఞానాన్ని ప్రసాదిస్తుంది. వేదాద్రి గరుడాద్రి నడుమప్రాంతం కనుక, ఈ క్షేత్రం దట్టమైన పచ్చని చెట్లతో అరణ్యంతో, ఎత్తైన కొండలతో గుట్టలతో, అక్కడక్కడా గుహలతో, పెద్ద పెద్ద బండరాళ్ళతో పర్వత పంక్తుల పైనుండి ప్రవహించే సెలయేర్ల సవ్వడులతో సింహశార్దూలాది వన్యమృగాలకు నివాస స్థానమయ్యింది. ఈ క్షేత్రానికి కాలినడకన వెళ్ళడం కొంతసాహసమే అవుతుంది.

## అహోబిలక్షేత్ర నామసార్థక్యం

అహోబిల క్షేత్రానికి సంబంధించిన ప్రస్తావన బ్రహ్మాండాది అనేక పురాణాలలో ఉన్నాయి. ఈ క్షేత్రానికి నవనరసింహ క్షేత్రమని, వేదాచలమని, గరుడాచలమని, వీరక్షేత్రమని ఇలా అనేక పేర్లు ఉన్నాయి. మహా బలపరాక్రమాలతో స్వామి బలంతో (గుహలో) దర్శనమిచ్చిన క్షేత్రం కనుక ఈ క్షేత్రానికి "అహోబిలం" అని, "అహోబలం" అని పేర్లొచ్చాయి. మహాలక్ష్మీదేవి తపస్సు ఫలితంగా నరసింహస్వామి ప్రసన్నుడయ్యాడు. కనుక

ఈ క్షేత్రానికి లక్ష్మీనృసింహక్షేత్రమనే పేరుగూడా ఉంది. వేదాలే మునులుగా మారి ఆ శ్రీహరిని నుతించిన ప్రాంతం కాబట్టే వేదాద్రి అనీ, గరుత్మంతుడు తపస్సుచేసి స్వామి అనుగ్రహానికి పాత్రుడైన క్షేత్రం కనుక గరుడాద్రి అని పేర్లు. అంతేకాక జానపదుల వ్యవహారంలో అహోబిలం, ఓబులం, ఓబులగిరి, దిగువ తిరుపతి, నిధి, నగరి, శేషాద్రి, నరసింహతీర్థం, ఇలా అనేక పేర్లున్నాయి.

ఈ క్షేత్రం శ్రీవైష్ణవులు భక్తియుక్తంగా, పరమ పవిత్రంగా భావించే 108 దివ్యదేశాలో ఒకటి కావడం మరోవిశేషం. శ్రీవైష్ణవభక్తులు, తమిళ భక్తులు ఈ క్షేత్రాన్ని "సింగవేల్ కుంద్రం, సింగవేల్ కున్నం " అని వ్యవహరిస్తారు. అయితే క్రీ.శ.1124 కు చెందిన ఒక శాసనం మాత్రం ఈ క్షేత్రాన్ని "అహోబిలం" అనే వ్యవహరిస్తోంది.

అహోబిలం నామాన్ని అనుసరించి క్షేత్రనామానికి సంబంధించిన రెండుకథలు ప్రాచుర్యంలో ఉన్నాయి. పూర్వం తన భక్తుడైన ప్రహ్లాదుని రక్షించి హిరణ్యకశిపుని సంహరించి దుష్టశిక్షణ చేసేనిమిత్తం శ్రీహరి ధరించిన నరసింహావతారం అతిభీకరావతారం. ఈ అవతారంలో స్వామి అత్యంత బలసంపన్నుడిగా ఉండి హిరణ్యకశిపుని సంహరించి వేదాచల, గరుడాచలాల నడుమన భవనాశితీర్థం ప్రక్కనే దేవతలందరికీ కనిపించాడట అప్పుడు దేవతలందరూ స్వామిని చూసి

**"అహోవీరం అహోశూరం, అహోబాహు పరాక్రమం**
**నారసింహం పరం దైవం అహోబలం అహోబలం"** అని

కీర్తించారట. నాటినుండి ఈ క్షేత్రానికి "అహోబలం" అని పేరువచ్చిందని ఒక ప్రచారం. మరోకథ ఏమిటంటే పూర్వం వైనతేయుడు తన తల్లి అయిన వినతకు దాస్యవిముక్తిని కల్పించి స్వామివారి గురించి ఈ ప్రాంతంలో ఒక పెద్ద కొండ గుహలో కఠోర తపస్సు చేశాడట. గరుత్మంతుని తపస్సుకు



మెచ్చి మహా బలసంపన్నుడైన నరసింహుడు గరుత్మంతుని అనుగ్రహించాడట. అందుకే ఈ క్షేత్రానికి "అహోబిలం" అని పేరు వచ్చిందంటారు.

ఇక అహోబిల గ్రామచరిత్రను కైఫియత్తును ఒకసారి పరిశీలిస్తే ఇక్కడ మరో విషయం తేటతెల్లమవుతుంది. పూర్వం వినతాసుతుడైన గరుత్మంతుడు హిరణ్యకశిపుని సంహరించిన ఉగ్రనారసింహుని దర్శింపదలచి నల్లమల అటవీ ప్రాంతంలోని కొండలలో శ్రీశైలానికి 96 మైళ్ళ దూరంలోని నిర్జనవనంలో అతికఠోరంగా తపమాచరించాడట. గరుత్మంతుని తపస్సుకు మెచ్చిన స్వామి గరుత్మంతుడు తపమాచరిస్తున్న తపోవనానికి ఈశాన్యంగా 25 మైళ్ళ దూరంలో భవనాశి నదీతీరంలోని ఒక కొండగుహలో దర్శనమిస్తానని అక్కడకు రమ్మని ఆదేశించినట్లుగా భావించి భవనాశీ నదీతీరంలోని కొండగుహలో జ్వాలా నరసింహమూర్తిని తనివితీరా దర్శించి పరిపరి విధాలుగా స్తుతించి ప్రసన్నం చేసుకున్నాడు! స్వామిని చూసి "అహోబిలం అహోబలం" అన్నాడట. అంటే స్వామీ నీ దర్శన భాగ్యం కొరకు కఠోరంగా తపమాచరించి బలహీనుడినైనాను. అయితే ఈ గుహలో వెలసిన నిన్ను దర్శించి నేను బలవంతుడనయ్యాను. ధన్యుడనైనాను అన్నాడట. అంటే అహోబిలేశుని దర్శించిన వారందరూ మహాబలాన్ని పొందుతారని, బలవంతులవుతారని అర్థం. కనుకనే ఈ క్షేత్రానికి అహోబిలం అని అహోబలం అని పేర్లువచ్చాయి. ఈ క్షేత్రంలో 6 కోనేర్లు, 13 తీర్థాలు, 12 ప్రాచీన మంటపాలు ఉన్నాయి. ప్రస్తుతం ఈ క్షేత్రంలో అనేక వసతి సముదాయాలు, నిత్యాన్నదాన సత్రాలు కూడా వెలిశాయి.

**అనిశము దలచరో అహోబలం**
**అనంత ఫలదం బహోబలం ॥**

**హరి నిజనిలయం బహోబలం**

హర విరించి నుత మహోబలం
అరుణమణిశిఖర మహోబలం
అరిదైత్యహరణ మహోబలం ॥

అతిశయ శుభదం బహోబలం
అతులమనోహర మహోబలం
హత దురితచయం బహోబలం
యతిమత సిద్ధం బహోబలం ॥

అగు శ్రీవేంకట మహోబలం
అగమ్యమసురుల కహోబలం
అగపడు పుణ్యుల కహోబలం
అగకులరాజం బహోబలం ॥







శ్రీశ్రీశ్రీ ఆదివణ్
శఠకోపయతీంద్రమహాదేశికన్



శ్రీ అహోబిల లక్ష్మీనృసింహస్వామివారి స్వాగతతోరణం, ఏకశిలా జయస్తంభం



## అహోబిలేశుని దివ్యమంగళదర్శనం

అహోబిల క్షేత్రంలో రెండుచోట్ల రెండురూపాల్లో శ్రీనరసింహ స్వామివారిని దర్శించవచ్చు.

1. శ్రీమహాలక్ష్మి సమాలింగితుడైన లక్ష్మీనృసింహస్వామి కొలువైవున్న దిగువ అహోబిలం. ఇక్కడి స్వామిని శ్రీ ప్రహ్లాదవరద నరసింహస్వామి అంటారు.

2. నవనారసింహులు చెంచులక్ష్మీదేవి కొలువైవున్న ఉగ్రనరసింహక్షేత్రం. అదే ఎగువ అహోబిలం.

ఎగువ అహోబిలానికి వెళ్ళేమార్గంలోనే మొట్టమొదట మనకు దర్శనమిస్తారు దిగువ అహోబిల ప్రహ్లాదవరద నరసింహస్వామివారు. మనం ముందుగా పరమపావనమూర్తి అయిన ఆ ప్రహ్లాదవరదనరసింహ స్వామిని దర్శించుకొని, తరువాత ఎగువ అహోబిలానికి పయనమవుదాం.

దట్టమైన నల్లమల అరణ్యం...చుట్టూ పచ్చటి చెట్లు, కొండరాళ్ళు అనేక కీటకాల కీచుమనే సవ్వళ్ల మధ్య...అక్కడక్కడా ప్రవహిస్తున్న, చిన్న చిన్న సెలయేళ్ల మధ్యగుండా మనం ఇప్పుడు ప్రయాణిస్తున్నాం. అదిగో "ఆ స్వామివారి సేవకే మేమూ మా సంతతి అంకితమయ్యాం" అన్నట్లుగా ఉన్న వానరాల గుంపులు. అదిగో క్షేత్రముఖద్వారంవద్ద నిర్మితమైన సమున్నత స్వాగత తోరణం. ఆ తోరణం పై నుండి శ్రీ లక్ష్మీనృసింహస్వామివారు తన సందర్శనకు వస్తున్న భక్తులకు శుభాశీస్సులను ప్రసాదిస్తున్నారు.

### దిగువ అహోబిలం

మనం ఇప్పుడు దిగువ అహోబిలంలో బస్సులు ఆపే స్థలం ప్రక్కనే ఉన్నాం. అదిగో అదే....ఆ కనిపిస్తున్నదే స్వామివారి దివ్యమంగళరథం. బ్రహ్మోత్సవాలవేళ స్వామివారు కళ్యాణోత్సవం అనంతరం శ్రీదేవి భూదేవితో

కూడుకొని దివ్యమంగళ రథాన్ని అధిరోహించి ఈ కనిపించే రథవీధిలో విహరిస్తారు. మనం ఈ క్షేత్రానికి చేరుకోగానే మొట్టమొదట స్వామివారి రథం మనకు దర్శనమిస్తుంది.

స్వామివారి రథం ప్రక్కనే కనిపిస్తున్న మండపమే రథవేదిక. ఈ రథవేదికను బట్టి స్వామివారి సేవకు వినియోగించే రథం ఎంత ఎత్తైనదో ఊహించుకోవచ్చు. స్వామివారి రథం తిరిగే వీధినే రథవీధి అని పిలుస్తారు. ఈ రథవీధిలోనే శ్రీదేవి భూదేవి సమేత ప్రహ్లాదవరద స్వామివారి రథోత్సవం జరుగుతుంది. ఈ రథవీధి మధ్యలో కనిపిస్తున్నదే...అదే బీగాల ఆంజనేయస్వామి మంటపం. ఈ రథవీధికి ఇరువైపులా మనకు అనేక పురాతన మంటపాలు దర్శనమిస్తాయి. ఇక్కడినుండి "మూడు మార్గాలు కనిపిస్తాయి. ఒకటి మనం ఆళ్ళగడ్డ నుండి వచ్చే మార్గం. రెండవది ఈ మార్గంలోనే ముందుకు సాగే ఎగువ అహోబిలమార్గం. ఇక ఈ రెండిటి కూడలినుండి పశ్చిమ ముఖంగా ఉండే లక్ష్మీనృసింహస్వామి ఆలయమార్గం.

మనం ఇప్పుడు దిగువఅహోబిలం ఆలయరాజగోపురం ఉన్న మార్గంలో స్వామి దర్శనానికి వెళ్తున్నాం. ఈ మార్గాన్నే ప్రధానవీధి లేదా "సన్నిధి వీధి" అంటారు. ఈ వీధి సువిశాలంగా బాటకు ఇరువైపులా వివిధ ప్రాచీన మంటపాలతో అలనాటి వైభవాన్ని తలపిస్తున్నట్లు ఉంటుంది. ప్రస్తుతం చాలావరకు ఈ మంటపాలు అంగళ్ళుగా మారిపోయాయి. వీధి మధ్యలో తొలుతగా కనిపిస్తున్నదే నాలుగుకాళ్ళ మండపం. దానినే "కొలువు మండపం" అంటారు. స్వామివారి బ్రహ్మోత్సవ సమయాలలో ఉత్సవం ఇక్కడిదాకా రాగా, స్వామివారిని ఇక్కడ కొలువుదీర్చి అర్చకులు కర్పూరహారతి కుంభహారతులను ఇస్తారు. ఈ మండపానికి మరో ప్రత్యేకత కూడా ఉంది. చర్మ వ్యాధులతో, దాటుడు కురుపులతో బాధపడేవారు ఈ మండపంముందు మూడు అర్క (జిల్లేడు) పత్రాలపై సున్నపుబొట్లుపెట్టి వాటిని దాటితే ఆ వ్యాధులన్ని తొలగిపోతాయట!



ఇక్కడి నుండి ముందుకు నడిస్తే కనిపించేదే స్వామివారి "డోలోత్సవ మంటపం" లేదా "ఊయల మండపం". పూర్వం విశేష ఉత్సవాల్లో భాగంగా ఇక్కడ స్వామివారికి డోలోత్సవాన్ని నిర్వహించేవారు. అయితే తరువాతి కాలంలో ఈ మండపాలను సత్రాలుగా, పాకశాలలుగా వినియోగించేవారు. అందుకు నిదర్శనం ఈ మండపాలలో నీరునిల్వ చేసుకోవడానికి ఏర్పాటుచేసిన పెద్ద రాతి తొట్టిలే అంటారు స్థానికులు. ఈ సన్నిధివీధి అలనాటి చారిత్రక వైభవాన్ని చాటి చెప్పే రాజమార్గం. ఈ రాజమార్గాలలో అహోబిలానికి, హంపీక్షేత్రానికి ఒక సామ్యత కనిపిస్తుంది. అదేమిటంటే ఈ రెండు క్షేత్రాల రాజమార్గాలు కాలవైపరిత్యాలను, మానవ ఉదాసీనతలను భరించి నిలిచినవే.

ఈ వీధిలో కనిపిస్తున్నదే అత్యంత ప్రాచీన చరిత్ర కలిగిన అహోబిలమఠం. ఇందులో అహోబిల మఠ పీఠాధిపతులు వాసం చేస్తారు. ఈ మఠం ప్రాచీన చరిత్రను మనం ప్రహ్లాదవరదుని దర్శనానంతరం తిరిగివచ్చే ముందు తెలుసుకుందాం. ప్రధానవీధి లేదా సన్నిధివీధికి పొడవునా స్వామివారి ఆలయం వరకు నిర్మించిన గోడలు కోటగోడలను తలపిస్తుంటాయి. పెద్దపెద్దరాళ్ళతో ఈ గోడలు నిర్మించడం మనం గమనించవచ్చు. ఇక్కడ చూడండి. పెద్దపెద్ద గండశిలలు బహుశా మంటప నిర్మాణం కొరకు దూలాలు మలచడానికి కావచ్చు వాటిని తెప్పించారు. ఇక్కడినుండి కొద్దిగా ముందు నడుద్దాం. ఇదే గొల్లమిట్ట ఆంజనేయస్వామివారి ఆలయం.

అదిగో అదే శ్రీ లక్ష్మీనరసింహుని క్షేత్ర వైశిష్ట్యాన్ని దశదిశలా చాటే, ఆకాశహర్మ్యాలను తాకుతున్నట్లుగా కనిపిస్తున్న స్వచ్ఛమైన శ్వేతవర్ణం కలిగిన భారీ రాజగోపురం. దాదాపు 25 అడుగుల వెడల్పుతో 5 అంతస్తులుగా వివిధ దేవతల విగ్రహాలతో నింపాదిగా కనిపిస్తుంది. ఆ మధ్యలోనే శ్రీలక్ష్మీ నృసింహస్వామి దర్శనమిస్తున్నాడు చూడండి. ఈ గోపురం పైకి పోయేకొద్ది

చిన్నదిగా కనిపిస్తూ తళతళలాడే స్వర్ణ కలశాలతో కూడిన అద్భుత కట్టడం. ఈ గోపురాన్ని విజయనగర ప్రభువులు కట్టించారు. ఈ రాజగోపురాన్ని బెల్లం, సున్నం, ఇసుకలతో కూడిన గారతో నిర్మించి గట్టిదనంకోసం రాతి దూలాలను ఏర్పాటుచేశారు. పూర్వం ఈ గోపురం పైఅంతస్తు వరకు చేరుకొనేందుకు మెట్లుఉండేవట. అయితే అవి శిథిలంకాగా తీసివేయబడ్డాయని అంటారు. ఇదిగో ఇక్కడ ఒక్కసారి గమనిస్తే రాజగోపురం క్రింద గణాధిపతి విగ్రహం మనకు కనిపిస్తుంది. శ్రీవైష్ణవ సంప్రదాయం ప్రకారం గణపతి ఆరాధనే విష్వక్సేన ఆరాధనగా కనిపిస్తుంది.

ఈ రాజగోపురాన్ని దర్శించుకొని వినాయకుని ఆశీస్సులను అందుకొని ముందుకు నడుద్దాం పదండి. ఈ మహాద్వారంలో ప్రవేశించగానే దక్షిణ దిశలో ఎత్తైన వేదికమీద మహోన్నతంగా నిర్మించిన ఏకశిలా జయస్తంభం కనిపిస్తుంది. ఇది శ్రీరంగరాయ ప్రభువులసైన్యం మహమ్మదీయుల దండయాత్రపై విజయం సాధించినందుకు చిహ్నంగా నిర్మించిన జయస్తంభం. దానికి సంబంధించిన శాసనం కూడా ఈ స్తంభంపై మనకు కనిపిస్తుంది. ఇక్కడే మనకు శ్రీ ఆదివణ్ శఠగోపజియ్యర్‌కు సంబంధించిన మరో దానశాసనం కూడా కనిపిస్తుంది. ఈ రెంటిని దర్శిస్తూ రాజగోపురం దాటి ముందుకు రాగానే దక్షిణ దిశలో విశాలంగా చల్లటి నీటితో స్వామివారి పుష్కరిణి దర్శనమిస్తుంది. ఈ పుష్కరిణి కూడా అత్యంత ప్రాచీనమైనది.

ఈ పుష్కరిణి చుట్టూ శిథిలావస్థలో ఉన్న మంటపాలు కనిపిస్తున్నాయే ఇవే అలనాటి వేదపాఠశాలలు. వేదాధ్యయనానికి నెలవులైన ఈ పవిత్ర మండపాలు నేడు గబ్బిలాలకు నెలవై శిథిలాలైపోతున్నాయి. కొండ పైనుండి ప్రవహించే సెలయేర్ల ఊటతో ఒకప్పుడు ఈ పుష్కరిణిలో నీరు నిండుగా ఉండేది. కానీ సెలయేర్లు తగ్గిపోవడంతో ఈ పుష్కరిణిలో నీటిఊట తగ్గిపోయింది. వర్షాలు బాగా పడినపుడు మాత్రమే ఈ పుష్కరిణి నిండుగా



జలకళతో తొణికిసలాడుతుంది. ఈ పుష్కరిణిలోని నీరు ప్రవాహం కానందువల్ల కొంత బురదగా కనిపిస్తుంది. ఈ పుష్కరిణి కొంతకాలం బాగోగులకు నోచుకోకుండా శిథిలావస్థలోనే ఉండేది. అయితే పూర్వపు అహోబిలమఠం పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ దేశికన్ స్వామివారు ప్రత్యేక శ్రద్ధతో నీటిని శుద్ధి చేసి జీర్ణోద్ధరణ కార్యక్రమాన్ని చేపట్టారు. ఏది ఏమైనా స్వామివారి విశేష ఉత్సవాల సందర్భంలో భక్తులు ఈ కోనేరులో స్నానాలు ఆచరించడం, జలప్రోక్షణలు చేసుకోవడం ఆనవాయితీ. మనం కూడా పవిత్ర పుష్కరిణి నీటిని సంప్రోక్షణం చేసుకొందాం. ఈ పుష్కరిణికి ఎదురుగా కనిపిస్తున్నదే భాష్యకారుల ఆలయం. ద్రవిడ శిల్పకళకు నిలువెత్తు సాక్ష్యం ఈ ఆలయం. ఇదొక అపురూప కళాఖండం. జీర్ణదశలో ఉన్న ఈ ఆలయాన్ని 19వ శతాబ్ద ఆరంభంలో పునర్నిర్మించారని కైఫియత్తు చెబుతూంది.

ఇప్పుడు మనం రెండవ ప్రాకారంలోనికి ప్రవేశిస్తున్నాం. ఈ ప్రాకారం గోపుర రహితమైన ప్రాకారం. ఈ ప్రాకారంలో మనకు రెండు మంటపాలు కనిపిస్తాయి. ఒకటి నవరాత్రి ఉత్సవాలలో భేరిమంటపంగాను, మరో మంటపాన్ని తళిగమంటపంగాను ఉపయోగించేవారు. తళిగమండపం నేడు పూర్తిగా శిథిలమైపోయింది.

ఇప్పుడు మనం దిగువ అహోబిల లక్ష్మీనరసింహస్వామివారి ఆలయం 3వ ప్రాకారంలో ప్రవేశిస్తున్నాం. దీనినే కంచుగుమ్మాల తోరణం అనికూడా పిలుస్తారు. అదిగో ఒక్కసారి ఆ ఎదురుగా చూడండి ఎత్తైన ఏకశిలా ధ్వజస్తంభం దాదాపు 25-30 అడుగుల పొడవైవుండి చూపరులను విశేషంగా ఆకర్షిస్తుంది. ఈ రాతిధ్వజస్తంభానికి ఇత్తడి రేకుల తాపడం చేయడంతో పచ్చటి బంగారు వర్ణంలో సూర్యకాంతికి రెండింతలుగా మెరిసిపోతూ దర్శనమిస్తూంది. ఈ ధ్వజస్తంభాన్ని బాగా పరిశీలిస్తే స్వామివారి ప్రధాన వాహనమైన గరుత్మంతులవారి విగ్రహం చెక్కిఉండడం మనం గమనించవచ్చు. ఆలయానికి విచ్చేసిన భక్తులు మొట్టమొదట ఈ

ధ్వజస్తంభాన్ని దర్శించి నమస్కరించుకుంటారు. బ్రహ్మోత్సవ సమయంలో ఈ ధ్వజస్తంభంపైనే గరుడధ్వజాన్ని ఎగురవేసి సకల దేవీ దేవతలను, బ్రహ్మోత్సవాలకు రావలసినదిగా వేదమంత్రాలతో ఆహ్వానం పలుకుతారు. ఈ ధ్వజస్తంభం ముందు ఉండేదే బలిపీఠం. ప్రతిరోజు స్వామివారికి నివేదనలు జరిగాక బలిహరణ కార్యక్రమాన్ని నిర్వహించడం సంప్రదాయం. ధ్వజస్తంభం మొదట్లో అదిగో మనకు కనిపిస్తున్నదే శ్రీస్వామివారి ప్రధానసేవకుడైన గరుడాళ్వార్ సన్నిధి. గరుడాళ్వారులను దర్శించుకొని మనం ఆలయ ప్రదక్షిణంగా ముందుకు సాగుదాం.

ఇది శ్రీవారి పోటు. పోటు అంటే ప్రసాదాలు తయారు చేసే వంటశాల. ఇక్కడే స్వామివారికి నిత్యం నివేదించే వివిధరకాల ప్రసాదాలు భక్తులకు విక్రయించే లడ్డు, వడ, పులిహోర మొదలైన పదార్థాలు తయారుచేస్తారు. పాంచరాత్ర ఆగమానుసారం స్వామివారికి ఇక్కడ క్షీరాన్నం, పొంగళ్ళు, పులిహోర, దధ్యోదనం, లడ్డూ, వడ, మున్నగు ప్రసాదాలను శ్రీవైష్ణవ స్వాములే స్వయంగా వండి నివేదిస్తారు.

## కల్యాణ వేంకటేశ్వర స్వామి ఆలయం

ఇక్కడినుండి కొద్దిగా ముందుకు వెళితే ఇదే ఆలయ ప్రాకారంలోని నైరుతి దిశలో వెలసిన కళ్యాణ వేంకటేశ్వరస్వామి ఆలయం. ఈ ప్రాచీన ఆలయంలో శ్రీదేవి, భూదేవి సమేతుడైన శ్రీవేంకటేశ్వర స్వామివారు కల్యాణవేంకటేశ్వరునిగా దర్శనమిస్తారు. ఈ ఆలయానికి ఒక చారిత్రక, పౌరాణిక నేపథ్యం ఉంది. వేంకటేశ్వరస్వామివారు ఆకాశరాజు కుమార్తె పద్మావతిని వివాహమాడి మొట్టమొదట అహోబిలానికి చేరుకొని ఈ దిగువ అహోబిలంలో లక్ష్మీనరసింహుని ప్రతిష్ఠించారట. ఆ ఘట్టానికి నిదర్శనంగా కల్యాణ వేంకటేశ్వరుడు ఉభయదేవేరులతో కలిసి ఇక్కడ వెలిశాడని భవిష్యపురాణం చెబుతుంది.



"శ్రీ వేంకటేశేనా వివాహకాలే సంపూజితం సర్వవిధోపచారైః" అన్నట్లు వేంకటేశ్వరస్వామి, లక్ష్మీనరసింహ స్వామిని ప్రతిష్ఠించి ప్రసాదాలను నివేదించి మంగళహారతులను చేసినట్లు వేంకటాచల మాహాత్మ్యం చెబుతోంది. ఇందుకు నిదర్శనంగా నేటికీ అహోబిలేశుని కల్యాణోత్సవం రోజున తిరుమల తిరుపతి దేవస్థానాలవారు స్వామివారికి అమ్మవారికి పట్టువస్త్రాలను సమర్పించడం ఆనవాయితీగా వస్తూంది.

ఇప్పుడు మనం నైరుతిదిశలో నెలకొన్న కల్యాణ వెంకన్న ఆలయ ప్రవేశం చేస్తున్నాం. అదిగో....నిత్యకల్యాణ చక్రవర్తి, కలియుగ ప్రత్యక్షదైవం, వేదవేద్యుడైన శ్రీనివాసుడు స్వర్ణాభరణ శోభితుడై శ్రీదేవి భూదేవి సమేతంగా దర్శనమిస్తున్నాడు. ఆహా! ఆ స్వామివారి సౌందర్యం వర్ణనాతీతం. ఆ స్వామిని ఒక్కసారి నోరారా స్తుతిద్దాం.

**"కల్యాణాద్భుత గాత్రాయ కామితార్థ ప్రదాయినే**
**శ్రీమద్వేంకటనాథాయ శ్రీనివాసాయ తే నమః"**

**ఏడుకొండల వాడా వేంకటరమణా గోవిందా...గోవిందా...గోవింద.** స్వామివారి మంగళహారతులను తీర్థాన్ని స్వీకరించి దక్షిణమార్గంగుండా బయటకు వస్తున్నాం.

ఇక్కడ శ్రీదేవి, భూదేవి, సమేత శ్రీనివాసునికి నిత్యపూజా కైంకర్యాలు జరుగుతుంటాయి. అంతేకాకుండా దిగువ అహోబిల లక్ష్మీనారసింహ స్వామివార్ల ఉత్సవర్లను ఇక్కడ వేంచేపు చేస్తారు.. ఈ స్వామివారికి కూడా నిత్యమూ పూజాకైంకర్యాలు జరుగుతూ ఉంటాయి.

కల్యాణ వేంకటేశ్వరుని ఆలయం నుండి బయటకురాగానే అదిగో కొద్దిఎత్తులో కనిపిస్తున్నది ఒక మండపం. ఇక్కడే నరసింహస్వామి అమృతవల్లీ తాయార్ల కల్యాణోత్సవాన్ని కమనీయంగా నిర్వహిస్తారు. పెళ్ళికావలసినవారు ఈ ఆలయంలోని కల్యాణ

వేంకటేశ్వరస్వామిని, లక్ష్మీనరసింహస్వామిని ఈ కల్యాణమండపంలో కాసేపు దర్శిస్తేచాలు. త్వరగా పెళ్ళిఅవుతుంది. ఇది అక్షర సత్యం.

ఇదిగో లక్ష్మీనరసింహుని బ్రహ్మోత్సవాలలో వాహనాలుగా మారి జన్మ ధన్యం చేసుకున్న వాహనాలు ఇవే. అహోబిల దేవాలయ ప్రాంగణం వాయువ్యదిశలో నెలకొన్న వాహనశాల ఇదే. గజ, గరుడ, హంస, హనుమంత, అశ్వ, సింహాది వాహనాలు ఇక్కడే కొలువుదీరి ఉన్నాయి. ఆ వాహనాలను దర్శించి స్వామివారు ఆ వాహనాలపై దర్శనమిచ్చిన అనుభూతితో ముందుకు సాగుదాం.

ఒక్కసారి స్వామివారి ఆలయం శిల్పసంపదను గమనించండి. అద్భుతమైన శిల్పాలు, స్వామివారి దశావతారాలను గుర్తుచేస్తున్న భంగిమలలోని శిల్పాలు మనం దర్శించవచ్చు. ఈ శిల్పాల అందాలను ఇంకా సాయంకాలం వేళల్లో, మరీ బ్రహ్మోత్సవాల సందర్భంలో చూస్తే ఆ దృశ్యం వర్ణనాతీతం. పురావస్తుశాఖవారు ఏర్పాటుచేసిన రంగురంగుల దీపపుకాంతులలో ముగ్ధమనోహరంగా కనిపిస్తాయి.

## స్వామి బావి

నరసింహస్వామివారి ఆలయానికి ఉత్తరదిక్కున కనిపిస్తున్నదే స్వామివారి నిత్యపూజాకైంకర్యాలకు ఉపయోగించే మంచినీటి బావి. ఈ బావిలో భవనాశినది పావనినదీ తీర్థాలు కలుస్తాయట. ఈ బావినే స్వామిబావి అంటారు. ఇది చాలా ప్రాచీనమైనది.

## విమానగోపురం

స్వామిబావి ఎదురుగా 10 అడుగుల దూరంలో నిలబడి ఆలయ పైభాగాన్ని దర్శిస్తే మనకు శ్వేతవర్ణంలో వెలుగొందుతున్న, బంగారు కలశంతో స్వామివారి గర్భాలయ విమానగోపురం కనిపిస్తుంది. అదిగో విమాన



గోపురం. బంగారు శిఖరం కనిపిస్తూంది. ఇది అత్యంత ప్రాచీనమైనా, అప్పుడప్పుడు తీర్చిదిద్దబడి శిల్పకళకుదీటుగా మలచబడింది. ఈ విమాన గోపురం మనకు రెండు దశలుగా కనిపిస్తుంది. మొదటి ప్రహారంలో కర్ణమకుటం, దేవతామూర్తి యుతమైన పంజరం, సాలభంజికలు, రెండవప్రహారంలో కర్ణమకుటం, సాలభంజికలు మాత్రమే కనిపిస్తాయి. వివిధ రకాలైన ఊహాశిల్పాలతో, పరివార, దేవి, దేవతలతో, ఈ గోపురం విరాజిల్లుతోంది. గోపుర శిఖరం నాలుగు దళాల తామర పుష్పంనుండి పైకి వస్తున్న కళాకృతిలో మనోజ్ఞంగా మలచబడింది. గోపురానికి నలువైపులా సర్వవ్యాపి అయిన లక్ష్మీనరసింహస్వామివారు మనకు కనిపిస్తున్నారు. ఒక్కసారి దర్శించండి.

**"లక్ష్మీ నరసింహ స్వామి గోవిందా...గోవింద..."**

అని స్మరిస్తూ ముందుకు పయనమవుదాం. ఇక్కడ మనకు సీతాలక్ష్మీ సమేత కోదండరామస్వామివారి ఆలయం కనిపిస్తుంది. సీతారాములను దర్శించి అహోబిల లక్ష్మీనరసింహ స్వామివారి ఆలయానికి ఒక మహా ప్రదక్షిణంచేసి ఇప్పుడు మనం స్వామివారు కొలువైన ప్రధానాలయంలోనికి ప్రవేశిస్తున్నాం.

## రంగమండపం

ఇదిగో స్వామివారి ప్రధానాలయం ముందు విశాలంగా శోభాయమానంగా కనిపిస్తున్న ఈ మండపమే "రంగమండపం". ఈ మండపంలో స్తంభాలు అద్భుత శిల్పకళతో ఎలా అలరారుతున్నాయో చూడండి. ఇవి అలనాటి శిల్పకళావైభవానికి నిలువుటద్దాలు.

10 వరుసలలో తీర్చిదిద్దబడిన 82 స్తంభాలతో, ప్రతి స్తంభంపైన చెక్కబడిన వివిధ పురాణ కథలకు చెందిన శిల్పాలతో, అత్యంత మనోహరంగా విజయనగర రాజుల విశిష్ట శిల్పకళ ఉట్టిపడేలా మలచబడ్డాయి.

ఆగమ శాస్త్ర ప్రకారం ఈ శిలాస్తంభాలు క్రిందభాగం చతురస్ర పీఠాకారంలోను, పైభాగం అంతా వర్తులాకారంతోను నిర్మితం కాగా, కొన్నిమాత్రం సమఘన పీఠాలతో అతిమనోహరంగా చెక్కబడి అనేక ముఖాలతో విరాజిల్లుతున్నాయి. మరికొన్ని కళావిన్యాస దృశ్యభరితాలై చూపరులను ఆశ్చర్యచకితులను చేస్తాయి. ప్రతి స్తంభం శిల్పిమేధోసంపత్తికి, కళానైపుణ్యానికి తార్కాణాలే. ప్రతి స్తంభం తనకుతానే దీటుగా నిలిచినట్లు కనబడుతాయి.

ఇప్పుడు మనం అమృతవల్లీతాయార్ (లక్ష్మీ)సమేత ప్రహ్లాదవరదస్వామి (నృసింహ స్వామి)వారు నెలకొని ఉన్న ప్రధానాలయ ప్రవేశం చేస్తున్నాం. గర్భాలయం ముందు నిలుచున్నాం.

## ప్రహ్లాద వరద స్వామి

గర్భాలయ ద్వారానికి ఇరువైపులా జయ విజయులు ద్వారపాలకులుగా తిరునామాలను ధరించి, శంఖ, చక్ర, గధ, పద్మాలను ధరించి మనకు దర్శనమిస్తారు. సనక సనందనాది మహామునులను స్వామిదర్శనానికి అడ్డగించి వారి కోపాగ్నికి గురై స్వామివారి కృపతో మూడు జన్మల్లో హరివైరులుగా, లోక కంటకులుగా జన్మించి తిరిగి శ్రీహరిచేత మోక్షాన్ని పొందిన మహాత్ములు. తొలుత వారి అనుమతితో స్వామివారిని దర్శించుకుందాం. గర్భాలయ ద్వారబంధంపై ఒక్కసారి చూడండి. గజలక్ష్మీ లలాటబింబం కనిపిస్తుంది. ద్వారబంధం లక్ష్మీ నివాసస్థానం. అందుకే ద్వారబంధం, గడపను ఎప్పుడూ త్రొక్కరాదు. ఇక్కడ స్వామివారు నెలకొన్న గుహాలయం, (గర్భగుడిని) కలుపుకొని అర్ధమంటపం నిర్మించడం మనం గమనించవచ్చు. 10.2"×10.4" కొలతలతో గర్భగుడిని నిర్మించారు. గర్భాలయ మధ్య భాగానికి రెండు అడుగుల వెనుకగా గర్భాలయ ద్వారానికి ఎదురుగా ప్రహ్లాదవరదస్వామివారు విరాజమానమైఉన్నారు. ఒక్కసారి స్వామివారిని ఆపాద మస్తకం తనివితీరా దర్శించండి.



**"అహోబిలే గారుడ శైల మధ్యే కృపావశాత్ కల్పిత సన్నిధానమ్**
**లక్ష్మ్యాత్ సమాలింగిత వామభాగం లక్ష్మీనృసింహ శరణం ప్రపద్యే"**

అంటూ స్వామివారిని స్తుతించండి. ప్రహ్లాదవరదుడు తన వామ పాదాన్ని మడచి, దక్షిణ పాదం పాదపీఠంపై వేళ్ళను మోపుతూ, సుఖాసీనుడై ఉన్నాడు. నాలుగు భుజాలను కలిగిన స్వామి. పై రెండు హస్తాలలో శంఖచక్రాలను ధరించిన స్వామి, వరద హస్తుడైన స్వామి. వామాంకంపై లక్ష్మీదేవి ఆసీనురాలై స్వామివారిని ఆలింగనం చేసుకోగా, స్వామివారు వామహస్తంతో లక్ష్మీదేవిని సమాలింగనం చేసుకుని ప్రసన్న వదనంతో దర్శనమిస్తారు. అంతేకాక సాలగ్రామ హారంతో వివిధ రకాల స్వర్ణాభరణాలను, వజ్రఖచిత మరకత మాణిక్యాలు పొదిగిన అద్భుతమైన కిరీటాన్ని ధరించిన స్వామివారు, హైమోర్ధ్వ పుండ్రాలతో, విశాల కర్ణకుండలాలతో విరాజిల్లుతూ దాదాపు 4 అడుగుల ఎత్తైన లక్ష్మీనృసింహ స్వామివారి మూర్తిని మనం దర్శించుకుంటున్నాం. స్వామివారి దర్శనం చేతనే సర్వపాపాలు దహించుకుపోతాయి. స్మరణం చేతనే సకల దుఃఖాలు దూరమవుతాయి. అభీష్టాలు నెరవేరుతాయి. విశాలమైన, ఎత్తైన రజత మకరతోరణం మధ్యలో విరాజమానమైన ఆ స్వామివారికి, అదిగో అర్చక స్వాములు దివ్య ఆనంద కర్పూర నీరాజనాలు సమర్పిస్తున్నారు. స్వామివారికి ఒక్కసారి గోవిందలిడుదాం.

**గరుడాద్రివాస గోవిందా...గోవింద**
**ప్రహ్లాదవరద గోవిందా...గోవింద**
**లక్ష్మీనృసింహ గోవిందా...గోవింద..**

స్వామివారిని గురించి అన్నమాచార్యులవారు కీర్తించిన కీర్తనతో స్వామివారిని స్తుతిద్దాం.

**వాడెవో ప్రహ్లాద వరదుడు**
**వాడెవో భక్తవత్సలుడు॥**

**కోరదవడలతోడ కోటి సూర్యతేజముతో**
**హార కేయూరాది భూషణాంబరాలతో**
**చేరి బ్రహ్మాదు లెల్లను సేవలు సేయుగాను**
**మేర మీరిన సిరుల మేడలో నున్నాడు॥**

**తెల్లనిమేనితోడ తీగెనవ్వుల తోడ**
**చల్లని గందముల వాసనలతోడ**
**పెల్లుగా నారదాదులు పేరుకొని నుతించగా**
**వెల్లవిరి కొలువై వేడుక నున్నాడు॥**

**సంకుచక్రములతోడ జంట పూదండలతోడ**
**పొంకపు నానావిధ భోగములతో**
**అంకపు శ్రీవేంకటాద్రి నహోబలమునందు**
**అంకెల నేపొద్దూ నెలవై తానున్నాడు॥**

సాక్షాత్తు కలియుగ ప్రత్యక్షదైవమైన శ్రీవేంకటరమణుడు పద్మావతీదేవిని పరిణయమాడి ఇక్కడ స్వామివారిని ప్రతిష్ఠించి పూజించాడట. అటువంటి పరమపావన మూర్తిని మనం దర్శిస్తున్నాం.

ఒకసారి స్వామివారి గర్భాలయ పైకప్పును వీక్షించండి. చతురస్ర విన్యాసాలతో మధ్యలో పద్మవృత్త విన్యాసంతో మనోహరంగా తీర్చిదిద్దబడింది. గర్భగుడి అర్ధమంటపం బయటిగోడలపై నృసింహపురాణ గాథను తెలియజేసే విధంగా అపూర్వ కళాఖండికలు కనిపిస్తాయి. ఒకసారి ఈ శిల్పకళా సౌందర్యాన్ని చూడండి. అద్భుతంగా నగిషీలుపెట్టబడి గోడలపై చాలా అందంగా కనబడుతున్నాయి.

## అమృతవల్లీ అమ్మవారు (మహాలక్ష్మీదేవి)

ఇప్పుడు మనం స్వామివారి అంతరాలయం నుండి బయటకు వచ్చి ప్రక్కనే ఉన్న శ్రీ నరసింహస్వామివారి దేవేరి అమృతవల్లీతాయార్ ఆలయాన్ని



సందర్శిస్తున్నాం. ఒక్కసారి అమ్మవారి పరమ పావనమైన రూపాన్ని దర్శించండి. అమ్మలగన్నయమ్మ ముగురమ్మల మూలపుటమ్మ, సురారులకమ్మ, కడుపారడిబుచ్చినయమ్మ, పెద్దమ్మ, బంగారుబొమ్మ, అమృతవల్లీతాయార్‌గా పిలువబడుతున్న మహాలక్ష్మీదేవి.నరసింహ స్వామివారి పట్టపురాణి చతుర్భుజాలతో వరదాభయ ముద్రాన్వితయై పద్మశోభితాలైన ఊర్ధ్వబాహువులతో, రత్నఖచిత వజ్ర, వైఢూర్య, గోమేధిక, పుష్యరాగాది రత్నాలను పొదిగిన వివిధ ఆభరణాలను దివ్యకిరీటాన్ని ధరించిన అమ్మ అమృతవల్లీ తాయార్ ఎంతమనోహరంగా దర్శనమిస్తుందో వీక్షించి ప్రార్థించి తరించండి.

**"పద్మప్రియే పద్మిని పద్మహస్తే పద్మాలయే పద్మదలాయతాక్షి ।**
**విశ్వప్రియే విష్ణుమనోనుకూలే త్వత్పాద పద్మం మయి సన్నిధత్స్వ ॥"**

అర్చకులు అమ్మవారికి అర్చన చేసిన కుంకుమ, మంగళహారతులను ఇస్తున్నారు. వాటిని స్వీకరించి రంగనాయకమంటపంగుండా బయటకు నడుద్దాం.

స్వామివారి తీర్థ ప్రసాదాలను స్వీకరించి కొంతసేపు ఆధ్యాత్మిక పరవశత్వానికి లోనవుదాం. స్వామివారిని "పునర్దర్శనాన్ని ప్రసాదించు స్వామీ" అని ప్రార్థించుకొని ఆలయం వెలుపలికి గాలి గోపురంవైపు నడుద్దాం. ఈ లక్ష్మీనృసింహస్వామివారి ఆలయానికి సంబంధించిన ఒక కథ ప్రాచుర్యంలో ఉంది.

పూర్వం ఓరుగల్లు రాజధానిగా పరిపాలన సాగించిన కాకతీయ ప్రభువులలో రాణి రుద్రమదేవి మనుమడైన కాకతీయ ప్రతాపరుద్రుడు రాజ్యపాలన సాగించేవాడు.

ప్రతాపరుద్ర మహారాజు శివభక్తుడే అయినా వైష్ణవాన్ని కూడా సమానంగా ఆదరించాడు. అహోబిల నరసింహుని అనేకమార్లు సందర్శించి

అనేక దానధర్మాలను చేశాడు. కట్టడాలనుకూడా నిర్మించాడు. ఈయన తొలుత దర్శించుకున్నదంతా కొండపై గుహలో వెలసిన ఉగ్రనారసింహస్వామినే. అప్పటికింకా దిగువ అహోబిలంలో లక్ష్మీనరసింహస్వామి దట్టమైన అడవులలో చెట్లపొదల్లోనే ఉండేవాడు.

ఎగువ అహోబిల నరసింహస్వామిని దర్శించుకొనేందుకు ప్రజలు చాలా కష్టాలు పడవలసి వస్తున్నదని, అడవి జంతువుల దాడికి బలౌతున్నారని భావించిన ప్రతాపరుద్రుడు ఎగువ అహోబిలంలోని ఉగ్రనారసింహమూర్తిని కొండదిగువన ఎక్కడైనా ప్రతిష్ఠించాలని సంకల్పించాడు. ఒక శుభముహూర్త నిర్ణయానికై పురోహితులను జోతిష్యశాస్త్ర విద్వాంసులను సంప్రదించాడు. వారు వద్దని, ఆ పని కూడదని ఎన్నోసార్లు వారించే ప్రయత్నంచేశారు. అయినా వినకుండా స్వామివారిని పెకిలించే ప్రయత్నం చేసేవాడు. కానీ ఆ ప్రయత్నం చేసిన ప్రతిసారి తన సైన్యానికి, విపత్తులు, నష్టాలు కలిగేవి ఆ నాటికి ఆ ప్రయత్నాన్ని విరమించేవాడు.

ఒకనాడు స్వామిని ప్రజా దర్శనార్థం దిగువన ప్రతిష్ఠించలేక పోతున్నానని మనోవ్యథతో ఆలోచిస్తూ పడుకోగా, ఆ రాత్రి కలలో నరసింహస్వామివారు ఆ మహారాజుకు "సాక్షాత్కరించి నన్ను ఇక్కడినుండి కదల్చడం ఎవ్వరికీ సాధ్యం కాదు. అయినా నీ సంకల్పం మంచిదే ప్రజలందరికి నన్ను దర్శింపజేయాలని సంకల్పించావు కనుక నీ కోరికను నెరవేరుస్తాను. పూర్వం పద్మావతీ పరిణయోత్సవవేళ శ్రీనివాసుడు ప్రతిష్ఠించి అర్చించిన నా విగ్రహం ఈ కొండ దిగువన పెద్ద మట్టిదిబ్బలో నిక్షిప్తమై ఉన్నది. ఆ ప్రదేశంలో నన్ను వెలికితీసి ప్రజా దర్శనంకోసం అర్చామూర్తిగా అలంకరించు అని చెప్పి అదృశ్యమైనాడట.

మహారాజు స్వప్నసాక్షాత్కార వృత్తాంతాన్ని కులగురువులకు విన్నవించి మరునాడే సకల మంత్రి పురోహిత పరివారంతో కలిసి స్వామివారు చెప్పినట్లు



దట్టమైన ఆ అడవిని నరికించి ఒక ఎత్తైన మట్టిదిబ్బను త్రవ్వించగా అందులోనుండి స్వామివారి దివ్యమంగళ విగ్రహం దర్శనమిచ్చింది. ఆ విగ్రహమే నేడు దిగువ అహోబిలం గర్భాలయంలో ఉండే లక్ష్మీనారసింహ స్వామివారి విగ్రహం. ప్రతాపరుద్రుడు సాంగోపాంగ పురాణకార్యక్రమాలను నిర్వర్తింపజేసి స్వామివారు వెలసినచోటే గర్భాలయాన్ని నిర్మింపజేశాడు ఎక్కడో శ్రీరంగంలో ఉండే శ్రీవైష్ణవ జీయరు స్వాములను రప్పించి శాశ్వత పుజాకార్యక్రమాలు జరిగేలా ఏర్పాట్లు చేశాడు.

## అహోబిల మఠం

ఇదే శ్రీవైష్ణవ జీయర్ స్వాములు ఉండే అహోబిలమఠం. ఈ అహోబిల మఠానికి దాదాపు 600 సంవత్సరాల అతిపురాతన చరిత్ర ఉంది. ఈ పీఠాధిపతులకు శఠగోప అనే నామాంకితం ఉంటుంది.

అహోబిల మఠానికి మొట్టమొదటి పీఠాధిపతి "శ్రీశ్రీశ్రీ ఆదివణ్ శఠకోపయతీంద్ర మహాదేశికన్ మహాస్వామివారు". వీరి అసలుపేరు "కిడాంబి శ్రీనివాసాచార్య" నిరంతర ధ్యానంతో శ్రీమన్నారాయణుని ఆరాధించేవారు. పాఠప్రవచనాలలో కాలం గడిపేవారు. వారు కాంచీపురంలో వేదాధ్యయనం చేసేవారు. ఒకనాటి రాత్రి లక్ష్మీనరసింహస్వామివారు స్వప్న సాక్షాత్కారం కలిగించి అహోబిల క్షేత్రానికి రమ్మని ఆహ్వానించారట. మరునాడు తమ గురువుగారికి ఈ స్వప్న వృత్తాంతాన్ని తెలిపి గురువుగారి అనుమతితో అహోబిలానికి బయలుదేరారు. కాంచీపురం నుండి కాలినడకన బయలుదేరిన శ్రీనివాసాచార్య అహోబిల క్షేత్రాన్ని చేరుకొని భవనాశి నదిలో భక్తితో స్నాన సంధ్యావందనాదులను ముగించుకొని నరసింహస్వామివారిని పూజించుకొని తదేకంగా స్వామివారినే చూస్తూ బాహ్యస్పృహ కోల్పోయి నిర్వికల్ప సమాధి స్థితిలోకి వెళ్ళిపోయారు. అప్పుడు సాక్షాత్తు నరసింహస్వామి వారే ఒక యతీంద్రుని వేషంలో వచ్చి శ్రీనివాసాచార్యులను తట్టిలేపి ప్రేషా

మంత్రోపదేశంచేసి, త్రిదండ, కమండలాలను ప్రసాదించి "శఠకోప జీయర్" గా నామకరణంచేసి సన్యాస దీక్షను ప్రసాదించారట. "నీ తర్వాత నీ ద్వారా పంచ సంస్కారాలను పొందిన వారిలో యోగ్యతను అనుసరించి సన్యాసాశ్రమ దీక్షను ప్రసాదించి ఈ దేవాలయ కైంకర్య నిర్వహణ బాధ్యతను అప్పగిస్తూ ఈ పీఠాన్ని కొనసాగించమని'' అజ్ఞాపించి వెంటనే నరసింహస్వామివారు "మా లోలనృసింహుని" (లక్ష్మీనృసింహునిగా) చిన్న దివ్య విగ్రహంగా మారి శఠకోపజియర్ చేతులలో ప్రత్యక్షమై తనను దేశం నలుమూలలా సంచరింపజేసి భక్తులకు దర్శనాన్ని కల్పించమని, ఆజ్ఞాపించారట. అప్పుడు శఠకోపజీయర్ స్వామి అహోబిల మఠాన్ని ప్రారంభించి స్వామివారి ఆజ్ఞానుసారం దేశసంచారం చేస్తూ స్వామివారిని భక్తులకు దర్శింపజేస్తూ పంచసంస్కారాలను ప్రసాదిస్తూ వచ్చారు. నరసింహస్వామివారిచేత సన్యాసాశ్రమ దీక్షతో అనుగ్రహాన్ని పడసిన మొట్టమొదటి అహోబిలమఠం పీఠాధిపతి "శ్రీశ్రీశ్రీ శఠకోపజీయర్ స్వామి". తదనంతర కాలంలో తామ్రపర్ణి నదిఒడ్డున వెలిసిన "ఆళ్వార్ తిరునగరి" క్షేత్రాధిపతి అయిన 'ఆదినాథ పెరుమాళ్' "**వన్**'' అనే వాక్యాన్ని, పన్నిద్దరాళ్వారులలో ఒకరైన నమ్మాళ్వారులు "**ఆది**" అనే నామాన్ని శఠకోపజీయర్ స్వామివారికి ప్రసాదించారు. నాటినుండి అహోబిల పీఠాధిపతి అయిన శఠకోపజీయర్ స్వామి "ఆదివణ్ శఠకోపజీయర్ స్వామి"గా "ఆదివణ్ శఠకోప యతీంద్రమహాదేశికన్"గా జగద్విఖ్యాతిని గాంచారు.

నందకాంశసంభూతునిగా జన్మించి, పదకవితాపితామహునిగా ఖ్యాతినిగొని, తిరుమల శ్రీనివాసుని సేవలో తరించిన తాళ్ళపాక అన్నమాచార్యులవారికి వైష్ణవ దీక్షను ప్రసాదించిన యతివరేణ్యులు ఈ "ఆదివణ్ శఠకోపయతీంద్ర మహాదేశికన్" స్వామివారే. తదనంతరం తాళ్ళపాక అన్నమాచార్యులు అహోబల నారసింహునికి తిరుమల



శ్రీనివాసునికి అభేదాన్ని పాటిస్తూ "వేంకటనారసింహ" అంకితనామంతో అనేక కీర్తనలను వ్రాశారు. అంతేకాక అహోబలనారసింహుని స్తుతిస్తూ అనేక కీర్తనలు రాశారు.

ఆనాడు ఆదివణ్ శఠకోప యతీంద్ర మహాదేశికన్ స్వామివారు ప్రారంభించిన దేశాటన కార్యక్రమం నేటికీ పరంపరాగతంగా 45మంది పీఠాధిపతులు నిర్వహిస్తూ వచ్చారు ఇటీవలే 45వ పీఠాధిపతులు ఆదివణ్ శ్రీ నారాయణ యతీంద్ర మహాదేశికన్ స్వామివారు శ్రీఅహోబిలేశుని చరణ సన్నిధానంలో ఐక్యమయ్యారు. ప్రస్తుతం అహోబిల మఠానికి 46వ పీఠాధిపతిగా ఆదివన్ శ్రీశ్రీశ్రీ శఠకోప రంగనాథ యతీంద్ర మహాదేశికన్ స్వామివారు దేశాటన కార్యక్రమాన్ని నిర్వహిస్తూ భక్తులకు పంచసంస్కారాలను ప్రసాదిస్తూ విశేష దినాలలో, బ్రహ్మోత్సవాలలో అహోబిలం చేరుకొని స్వామివారికి కైంకర్యాలను నిర్వహిస్తున్నారు.

కాకతీయ ప్రతాపరుద్రునికి అహోబిల మఠానికి సంబంధించిన మరో కథ కూడా ప్రచారంలో ఉంది. ప్రతాపరుద్ర మహారాజు మహా శివభక్తుడు. అతడు ప్రతిరోజు స్వయంగా ఒక బంగారు శివలింగాన్ని తయారు చేసి పూజించేవాడు. ఒకనాడు ప్రతాపరుద్ర మహారాజు అహోబిల నారసింహుని దర్శనానికి వస్తూ మార్గమధ్యంలో రుద్రవరంలో మజిలీ చేశాడట. అక్కడే స్నానాదికాలు ముగించి శివపూజ చేద్దామని రోజుమాదిరిగానే ఆ రోజుకూడా బంగారు శివలింగాన్ని చేసేందుకు ప్రయత్నించాడట. ఎన్నిసార్లు ప్రయత్నించినా శివలింగం ఆకృతి కాకుండా నరసింహస్వామి ఆకృతే వస్తూండటం గమనించి ఆశ్చర్యపోయాడట. తరువాత స్వయంగా స్వామి వారే "ప్రతాపా! ఇది నృసింహక్షేత్రం-ఇక్కడ నన్నే పూజించాలి. ఇదంతా నా మహిమవల్లే జరుగుతుంది. ఈ బంగారు విగ్రహాన్ని దిగువ అహోబిలమఠంలోని పీఠాధిపతి శఠకోపజీయర్ కు అందించు" అని

ఆజ్ఞాపించాడట. అలా స్వామి స్వప్నసాక్షాత్కార వృత్తాంతాన్ని విని ప్రతాప రుద్రుడు రాజలాంఛనాలతో "స్వర్ణ నృసింహస్వామి"వారి విగ్రహాన్ని ఊరేగింపుగా తీసుకెళ్ళి, శఠకోపజీయర్ స్వామివారికి సమర్పించుకున్నాడట. ఆ విగ్రహం నేటికీ అహోబిలమఠం పీఠాధిపతులు చేత పూజలను అందుకుంటున్నదని భక్తుల విశ్వసిస్తున్నారు.

ఈ విధంగా అనేకమంది రాజులు, దాతలు, సామంతులు, దండనాయకులు, మండలేశ్వరులు, పీఠాధిపతులు సమర్పించుకున్న కైంకర్యాలకు, అత్యంత విలువైన వస్తువులకు, నగలకు ఈ కీకారణ్య ప్రాంతం అనుకూలంగా ఉండేదికాదు. నిర్జనవన ప్రదేశంగా ఉండే అహోబిలంలో విలువైన ఆభరణాలు, ఉత్సవ విగ్రహాలకు చోరభయం పొంచి ఉండేది. కనుక అహోబిలక్షేత్ర నిర్వహణా బాధ్యతలను స్వీకరించిన శ్రీరంగం వైష్ణవపీఠాధిపతులు ఈ విలువైన విగ్రహాలు, ఆభరణాలను తమ అధీనంలోనే ఉంచుకొని విశేష ఉత్సవాలు, బ్రహ్మోత్సవాల వేళల్లో శ్రీరంగం నుండి మందిమార్బలంతో గుర్రాలపైన, డోలీలపైన, పల్లకీలలో తీసుకొని వచ్చేవారు. ఉత్సవాల అనంతరం వాటిని తిరిగి తీసుకెళ్ళి శ్రీరంగంలోనే పూజాదికాలను నిర్వహించేవారు.

అహోబిల మఠం ఏర్పడ్డాక గత శతాబ్ద కాలంగా ఆ ఇబ్బంది తొలగిపోయింది. ప్రస్తుతం ఉత్సవ విగ్రహాలు అన్ని అహోబిలంలోనే గర్భాలయంలో భద్రపరచబడ్డాయి. ఆభరణాలు ఆలయ కోశాగారంలో భద్రపరచబడి, అధికారి బాధ్యతల క్రింద ఉంటున్నాయి.

ప్రస్తుతం 46వ పీఠాధిపతి శ్రీశ్రీశ్రీ ఆదివణ్ శఠకోప శ్రీరంగనాథ యతీంద్ర మహాదేశికన్ స్వామివారు పీఠాధిపత్యాన్ని స్వీకరించి అహోబిలేశుని ఆజ్ఞానుసారం శ్రీమఠంలో పరంపరంగా వస్తున్న లక్ష్మీనారసింహుని ప్రతిమతో దేశాటనను నిర్వహిస్తూ భక్తులను అనుగ్రహిస్తున్నారు.





ఇప్పుడు మనం ప్రహ్లాదవరదుని అనుమతితో నవనారసింహులు కొలువైన ఎగువ అహోబిల ప్రాంతాన్ని, నవనారసింహమూర్తులను దర్శించేందుకు పయనమవుదాం.

**ప్రహ్లాద వరద గోవిందా....గోవింద**
**లక్ష్మీనృసింహ గోవిందా....గోవింద**
**అహోబిలేశ గోవిందా....గోవింద....**

## నవనారసింహ క్షేత్ర సందర్శనం

**"నవ" సంఖ్యా ప్రాధాన్యం**

తొమ్మిది సంఖ్యకు కర్నూలు జిల్లాకు-మన హిందూధర్మానికి అవినాభావ సంబంధం ఉంది.

ఖగోళశాస్త్రరీత్యా భూమండలాన్ని ఆవరించివున్న ఆవరణాలు-9. వీటిని నవావరణాలు అంటారు

జ్యోతిషశాస్త్ర రీత్యా జీవి దిశానిర్దేశం చేసే గ్రహాలసంఖ్య-9. వీటిని నవగ్రహాలు అంటారు

రత్నశాస్త్రరీత్యా అత్యంత విలువైన రత్నాల సంఖ్య-9. వీటిని నవరత్నాలంటారు

జీవి దేహంలోని ప్రధాన రంధ్రాల సంఖ్య-9. వీటిని నవరంధ్రాలు అంటారు

శాంతి కార్యక్రమాలలో ఉపయోగించే ధాన్యాలసంఖ్య-9. వీటినే నవధాన్యాలు అంటారు.

సంఖ్యాశాస్త్రరీత్యా భగవదారాధనలోని అష్టోత్తర నామాల సంఖ్య-108=1+0+8=9

భగవదారాధనలోని సహస్ర నామాల సంఖ్య-1008=1+0+0+8=9

మహాభారతపర్వాల సంఖ్య 18= అంటే1+8=9

భగవద్గీతలోని అధ్యాయాలు-18=1+8=9

## ఆధ్యాత్మికరంగంలో కర్నూలుజిల్లా

కర్నూలుజిల్లా వైష్ణవక్షేత్రాలకు ఎలాప్రసిద్ధో అలాగే శైవక్షేత్రాలకు కూడా ప్రసిద్ధి. ప్రహ్లాదుని మాటను సత్యం చేసేందుకు నరహరి అవతరించిన వైష్ణవక్షేత్రం అహోబిలం కర్నూలు జిల్లాలోనే ఉంది. అలాగే ప్రహ్లాదుని తృతీయ అవతారంగా భావించే శ్రీరాఘవేంద్రస్వామివారు భక్తులకు కల్పవృక్షం, కామధేనువు వంటివారు. వీరు నెలవైన మంత్రాలయం కర్నూలు జిల్లాలోనే ఉంది. అలాగే ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన ద్వాదశ జ్యోతిర్లింగాలలో ఒకటైన శ్రీ మల్లికార్జున జ్యోతిర్లింగం, అష్టాదశ శక్తిపీఠాలలో ఒకటైన శ్రీ భ్రమరాంబికా శక్తిపీఠం నెలకొన్న "శ్రీశైల మహాక్షేత్రం" కర్నూలు జిల్లాలోనే ఉంది. నందరాజులను అనుగ్రహించిన నవనందీశ్వర ఆలయాలతో కూడివున్న మహానంది క్షేత్రం కర్నూలు జిల్లాలోనే ఉంది.

వీటిలో అహోబిల క్షేత్రంలో నరసింహస్వామి తొమ్మిది రూపాలలో తొమ్మిది ప్రాంతాలలో ఉంటూ నవనారసింహక్షేత్రంగా ప్రసిద్ధి చెందింది. వీటికి ప్రక్కనే, మహానంది క్షేత్రానికి చుట్టూరా పరమశివుడు తొమ్మిది రూపాలలో తొమ్మిది ప్రాంతాలలో కొలువైవున్న నవనంది క్షేత్రంకూడా మహిమాన్వితంగా విరాజిల్లుతోంది. అంటే శివకేశవులు ఇరువురూ తొమ్మిది రూపాలలో విరాజిల్లుతూ కర్నూలుజిల్లాను నవనవోన్మేషంతోకూడిన భక్తిశ్రద్ధా కేంద్రంగా, ఆధ్యాత్మిక, ధార్మిక కేంద్రంగా తీర్చి అనుగ్రహిస్తున్నారు.

పూర్వం దిగువ అహోబిలం నుండి నవనారసింహులకు నెలవైన ఎగువ అహోబిలానికి వెళ్ళాలంటే కొండలు గుట్టలు, దట్టంగా చెట్లతో అల్లుకొని



క్రూరమృగాలతోకూడి సాహసోపేతంగా ఉండేది. ప్రస్తుతం దిగువ అహోబిలం నుండి ఎగువ అహోబిలానికి 11 కి.మీ చక్కటి రోడ్డుమార్గం వేశారు. ఆళ్ళగడ్డనుండి ఎగువ అహోబిలంవరకు రాష్ట్రరోడ్డు రవాణాసంస్థవారి బస్సులతోపాటు అనేక ఆటోలు, జీపులు వెళ్తుంటాయి.

మనం కూడా ఎగువ అహోబిలానికి పయనమవుదాం.... దట్టమైన అరణ్య ప్రాంతంలో చుట్టూ పచ్చటి చెట్లు, ఎత్తైన కొండలు, ప్రక్కనే లోయలు పక్షుల కిలకిలారావాలు-ఎగువ అహోబిల ప్రయాణం ఆహ్లాదకరంగా, అత్యంత భక్తి భరితంగా కొనసాగుతుంది. మార్గమధ్యలో మార్గానికి మరోవైపున నిర్మించిన చిన్నచిన్న మంటపాలు, పాడుబడిన బాలాలయాలు, అలనాటి మహారాజుల నృసింహభక్తికి తార్కాణాలుగా నిలుస్తున్నాయి.



**దిగువ అహోబిలంలో రంగ మండపం**

## నవనారసింహక్షేత్ర దర్శనం

**జ్వాలాహోబిల మాలోల వరాహ శ్చాపి కారంజః**
**భార్గవః పావన స్వామీ యోగానంద ఛత్రవటః**
**నవైతే నారసింహస్య క్షేత్రాఖ్యాతి ఇతిస్మృతిః"**

అని బ్రహ్మాండ పురాణంలో అహోబిలంలోని నవ నారసింహ క్షేత్రాలను వివరించారు వేదవ్యాసులవారు. ఈ శ్లోకాన్ని అనుసరించి

1. జ్వాలానరసింహక్షేత్రం
2. అహోబిల నరసింహక్షేత్రం
3. మాలోల నరసింహక్షేత్రం
4. వరాహ నరసింహక్షేత్రం
5. కారంజ నరసింహక్షేత్రం
6. భార్గవ నరసింహక్షేత్రం
7. పావన నరసింహక్షేత్రం
8. యోగానంద నరసింహక్షేత్రం
9. ఛత్రవట నరసింహక్షేత్రం.

అనే ఈ తొమ్మిది క్షేత్రాలు దిగువ, ఎగువ అహోబిల క్షేత్రాల చుట్టుప్రక్కల భీకర అరణ్య ప్రాంతంలో ఉన్నాయి. వాటిలో ఒకటిరెండు తప్ప తక్కిన క్షేత్రాలు అన్నిటికీ కొండలు, గుట్టలు, అరణ్యాలలో నడిచి పోవలసిందే. ఇదో సాహసోపేతమైన యాత్రే అవుతుంది.

దిగువ అహోబిలంనుండి ఎగువ అహోబిలానికి వెళ్ళే మార్గంలో ఉన్నక్షేత్రాలను మొదట మనం దర్శిస్తూ ముందుకు నడుద్దాం. వేదాద్రి, గరుడాద్రి పర్వతాల నడుమ నెలకొన్న నవనారసింహ క్షేత్రాలను దర్శిద్దాం.

**నవనారసింహా నమోనమో**
**భవనాశితీర యహోబిలనారసింహా**





**సతత ప్రతాప రౌద్రజ్వాలానారసింహా**
**వితత విదారణా వీరనరసింహా**
**అతిశయ కరుణ యోగానందనారసింహా**
**మతి శాంతపు కానుగుమానునరసింహా॥**

**మరలి బీభత్సపు మట్టెమళ్ళనరసింహా**
**నరహరి భార్గోటి నారసింహా**
**పరిపూర్ణ శృంగార ప్రహ్లాదనరసింహా**
**సిరుల నద్భుతపు లక్ష్మీనరసింహా॥**

**వదన భయానకపు వరాహ నరసింహా**
**చెదరని వైభవాల శ్రీనరసింహా**
**అదన శ్రీవేంకటేశ అందు నిందు నిరవైతి**
**పదివేల రూపముల బహునారసింహా ॥**

## 1. భార్గవ నరసింహక్షేత్రం

దిగువ అహోబిలానికి ఈశాన్య దిక్కున ఉన్న కొండపైన ఈ భార్గవ నరసింహుని ఆలయం వుంది. ఆలయం ప్రక్కనే ఒక తీర్థం కనిపిస్తుంది. ఈ తీర్థానికే భార్గవతీర్థం, అక్షయతీర్థమనే పేర్లు ఉన్నాయి. భార్గవరామునిగా పేరుగాంచిన పరశురాముడు ఈ తీర్థంలో ప్రతినిత్యం స్నానంచేస్తూ స్వామిని గూర్చి తపస్సు చేశాడట. అతన్ని అనుగ్రహించడానికై నరసింహస్వామి ఇక్కడ వెలిశాడని, భార్గవరామునిచే పూజలందుకున్న నారసింహస్వామి కనుక ఈ స్వామికి భార్గవనరసింహస్వామి అని ఈ క్షేత్రానికి భార్గవ నృసింహ క్షేత్రమనీ పేరు వచ్చినట్లు బ్రహ్మాండ పురాణం చెబుతోంది. ఈ క్షేత్రాన్నే "అక్షయ తీర్థమని","భర్గోటి" అనికూడా ప్రజలు వ్యవహరిస్తుండడం విశేషం.

మనం ఇప్పుడు దిగువ అహోబిలానికి ఈశాన్య దిగ్భాగంలో 2 కి.మీ దూరంలో కొండపై వెలసిన భార్గవ నరసింహక్షేత్రానికి వెళుతున్నాం.

చుట్టూ ఎత్తైన పచ్చటిచెట్లు, చెట్లమధ్య నడక మార్గం, పక్షుల కిలకిలారావాలు, కొంత దూరం వెళ్ళగానే ప్రశాంతమైనవాతావరణం చల్లటి గాలులు, మనసుకు ఆహ్లాదం కలిగిస్తూండగా, మరోవైపు ఎత్తైన కొండలు...స్వామివారిని ధ్యానిస్తూ ఇంత చక్కని వాతావరణంలో ముందుకు సాగుదాం. అదిగో ఆ కనిపిస్తున్నదే అక్షయ తీర్థపుష్కరిణి. ఇక్కడి నుండి కొద్దిదూరంలో అహోబిలమఠం జియర్ శ్రీవన్ శఠకోప జియ్యర్‌స్వామివారు ఆలయానికి నిర్మించిన సోపానాలు కనపడతాయి. ఈ సోపానాలు అధిరోహించి వెళ్ళగానే అదే....భార్గవ నారసింహమూర్తి ఆలయం. పరశురాముని తపస్సుకు మెచ్చి దర్శనమిచ్చిన 'హిరణ్యకశిప సంహారభంగిమ'లో భార్గవ నారసింహస్వామి. రండి స్వామిని దర్శించుకుందాం.

ఒక చిన్న పీఠంపైన చతుర్బాహువులతో, శంఖచక్రాలను ధరించిన ఊర్ధ్వబాహువులతోను, ఖడ్గహస్తుడైన హిరణ్యకశపుని ఉదరమును చీలుస్తూన్న మరోరెండు బాహువులతోను, స్వామి ఉగ్రరూపంలో ఉండగా ఆ ప్రక్కనే ప్రహ్లాద కుమారుడు ముకుళిత హస్తాలతో స్వామివారికి నమస్కరిస్తున్న భంగిమలో నిలుచుని ఉన్నాడు. ఇదిగో దుష్టశిక్షకుడైన స్వామివారిని మనం కనులారా దర్శిస్తున్నాం. మనసారా స్వామివారిని ప్రార్థిద్దాం.

**సాక్షాత్ స్వకాలే సంప్రాప్తం మృత్యుం శత్రుగణానపి**
**భక్తానాం నాశయేద్యస్తు మృత్యు మృత్యుం నమామ్యహం ।**

**భార్గవాఖ్య తపస్వినా భావనభావితాత్మనే**
**అక్షయతీర్థ తీరస్తు భార్గవాయాస్తు మంగళం ॥**

3 అడుగుల ఎత్తైన స్వామివారి విగ్రహం చుట్టుఉన్న ప్రభను ఒక్కసారి చూడండి. ఆ ప్రభావళి చుట్టు దశావతారమూర్తులు అద్భుతంగా దర్శనమిస్తున్నాయి. అంటే ఈ స్వామివారిని దర్శిస్తే శ్రీమహావిష్ణువుయొక్క దశావతారాలను దర్శించిన మహద్భాగ్యం మనకు సిద్ధిస్తుంది.



స్వామివారిని మరోసారి మనసారా ధ్యానిస్తూ, మంగళ హారతికాంతులలో వెలుగొందుతున్న స్వామివారి దివ్య విగ్రహాన్ని రెప్పవాల్చకుండా కనులారా వీక్షిద్దాం. హారతిని, తీర్థాన్ని స్వీకరించి ముందుకు నడుద్దాం.

ఇదిగో ఇదే క్రీ.శ. 15వ శతాబ్దంలో ఆనాటి అహోబిల పీఠాధిపతి శ్రీవణ్ శఠకోపజీయర్ స్వామి వేయించిన దానశాసనం. నరసయ్య అనే భక్తుడు అహోబిలేశుని కైంకర్యాలనిమిత్తం ఇచ్చిన భూవిరాళ వివరాలను తెలుపుతున్న దాన శాసనం ఇది. ఇందులోనే భార్గవ నరసింహాలయానికి జీయంగార్ నిర్మించిన సోపానాల ప్రస్తావన కూడా ఉంది. ఈ దానశాసనాన్ని, శ్రీ భార్గవ నరసింహస్వామి వారిని దర్శించుకుని ముందుకు పయనమవుదాం.

**"పరశురామ కరార్చిత భార్గవ నరసింహస్వామి వరద గోవిందా....గోవింద."**

**జయజయ నృసింహ సర్వేశ**
**భయహర వీర ప్రహ్లాదవరద ॥**

**మిహిర శశినయన మృగనరవేష**
**బహిరంతస్థల పరిపూర్ణ**
**అహినాయక సింహాసన రాజిత**
**బహుళ గుణగణ ప్రహ్లాదవరద ॥**

**చటుల పరాక్రమ సమఘనవిరహిత**
**నిటలనేత్ర మౌని ప్రణుత**
**కుటిలదైత్యతతి కుక్షి విదారణ**
**పటు వజ్రనఖ ప్రహ్లాదవరద ॥**

**శ్రీవనితా సంశ్రిత వామాంక**
**భావజకోటి ప్రతిమాన**
**శ్రీవేంకటగిరిశిఖరనివాస**
**పావనచరిత ప్రహ్లాదవరద ॥**

## 2. కారంజ నరసింహస్వామి

దిగువ అహోబిలంనుండి ఎగువ అహోబిలానికి వెళ్ళేమార్గంలో 7 కి.మీ.ల దూరంలో, రోడ్డు ప్రక్కనే కనిపిస్తుంది కారంజ నరసింహస్వామి ఆలయం చుట్టూ ప్రహరీ గోడలమధ్య కారంజవృక్షం నీడలో ఈ ఆలయం మనకు కనిపిస్తుంది. కారంజం అనగా కానుగ. కానుగవృక్షం క్రింద వెలసిన స్వామి కాబట్టి ఈ స్వామికి కారంజ నరసింహస్వామి అని పేరు.

ద్వాపర యుగంలో దూర్వాస మహర్షిచేత శపించబడిన గోబిలుడు అనే మహర్షి ఈ క్షేత్రానికి వచ్చి తపమాచరించి కారంజవృక్షం క్రింద స్వామి సాక్షాత్కారాన్ని పొందాడని ఒక కథనం ఉన్నది. మరో కథనం ప్రకారం శ్రీమహావిష్ణుమూర్తి శ్రీకృష్ణావతారందాల్చిన ద్వాపరయుగంలో హనుమంతుడు శ్రీరామచంద్రుని కానక వెదుకుతూ ఈ క్షేత్రానికి విచ్చేసి శ్రీరామచంద్రుని గురించి తపమాచరించాడట. అయితే శ్రీరాముడు నృసింహస్వామి రూపంలో కారంజవృక్షం క్రింద ప్రత్యక్షంకాగా హనుమంతుడు "స్వామి నేను నా ప్రభువైన కోదండరామునే దర్శింపదలచాను" అనగానే ఆ నృసింహస్వామి కోదండాన్ని ధరించి "శ్రీరాముడిని, నరసింహుడిని నేనే"నంటూ సాక్షాత్కరించాడట. హనుమంతుని కోరిక మేరకు నరసింహస్వామి ఈ క్షేత్రంలో కోదండపాణియై వెలసి దర్శనమిస్తున్నాడు. శ్రీహరి ధనుస్సుకు "శారఙ్గము" అనిపేరు. కనుకనే శార్ఙ్గనృసింహుడు, కారంజ నృసింహుడు అయినాడు.

అదిగో ఆ కారంజనృసింహుడు. కోదండధారి అయిన ఆ స్వామిని దర్శించండి....తరించండి.

ఫణి ఫణాన్వితమైన స్వామి ధ్యాననిమగ్నుడై పద్మాసనంలో కూర్చున్నాడు. దక్షిణ హస్తంలో సుదర్శనచక్రంను, వామ (ఎడమ) హస్తంలో శంఖానికి బదులుగా శార్ఙ్గం (ధనస్సు)ను, మరోరెండు చేతులతో ధ్యానముద్రను



ధరించి దర్శనమిస్తున్నాడు. ఇక్కడి స్వామికి మరో విశేషం ఏమిటంటే స్వామివారి ఫాలభాగంలో (నుదిటిపై) మూడవ నేత్రం ఉండడం. ఈ స్వామి త్రినేత్రుడు. ఈ స్వామివారినే అన్నమాచార్యులవారు సాళువ నృసింహరాయలు విధించిన శిక్షలను భరించలేక

**"ఫాలనేత్రానల ప్రబల విద్యుల్లత కేళీ విహారలక్ష్మీనారసింహ"**

అని ప్రార్థించి స్వామి అనుగ్రహాన్ని పొందారు.

మనంకూడా ప్రార్థనా పూర్వక శ్లోకంతో స్వామిని అనుగ్రహించమని వేడుకుందాం.

**కారంజపాదపచ్ఛాయా - హ్లాదినం నరకేసరిం**
**శార్ఙ్గధరం ఫణిచ్ఛత్ర - భూషితం ప్రణమామ్యహం**

**ఫాలనేత్రానల ప్రబల విద్యుల్లతా-**
**కేళీ విహార లక్ష్మీనారసింహా ॥**

**ప్రళయమారుత ఘోర భస్త్రికాపూత్కార**
**లలిత నిశ్వాస డోలా రచనయా**
**కులశైలకుంభినీ కుముదహిత రవిగగన**
**చలన విధి నిపుణ నిశ్చల నారసింహా ॥**

**వివరఘన వదన దుర్విధహసన నిష్యూత**
**లవదివ్యవరుష లాలా ఘటనయా**
**వివిధ జంతువ్రాత భువనమగ్నీకరణ**
**నవనవ ప్రియ గుణార్ణవ నారసింహా ॥**

**దారుణోజ్వల ధగద్ధగిత దంష్ట్రానల వి-**
**కారస్ఫులింగ సంగక్రీడయా**
**వైరిదానవ ఘోరవంశ భస్మీ కరణ**
**కారణ ప్రకట వేంకట నారసింహా ॥**

## 3. ఎగువ అహోబిలం (ఉగ్రనరసింహస్వామి)

దిగువ అహోబిలానికి 11కి.మీ.ల దూరంలో (కారంజ నృసింహక్షేత్రంనుండి 3 కి.మీ దూరంలో) వేదాద్రి గరుడాద్రి పర్వతాల మధ్యభాగంలో, భవనాశినినది తీరంలో వెలిసిన క్షేత్రం ఎగువ అహోబిలం. ఈ క్షేత్రంలో ప్రధానదైవం ఎగువఅహోబిలంలోని శ్రీ నరసింహస్వామివారు మాత్రమే. ఈ స్వామి హిరణ్యకశిప సంహారానంతరం ఇక్కడ సేదతీరాడు. స్వామి ఇక్కడ ఒక గుహలో ఉగ్రరూపంలో దర్శనమిస్తాడు.

మనం ఇప్పుడు ఎగువ అహోబిలానికి పయనిద్దాం. ఎత్తైన కొండలు, కొండలపై వివిధజాతుల వృక్షాలు, రోడ్డు ప్రక్కనే లోయలు, వర్షాకాలంలో అక్కడక్కడా జలజలా ప్రవహించే భవనాశినది మనకు దర్శనమిస్తాయి. ఇప్పుడు మనం పరమపావనమైన ఎగువ అహోబిలం చేరుకున్నాం. అదిగో జలపాతం హోరుకు కరిగిపోయి నీటి ప్రవాహానికి రెండుగా చీలి కాలువగామారిన, కొండపైనుండి జలజలాపారుతూ భవబంధాలను తుంచివేసే భవనాశినీ నది. కొండ పైనుండి భవనాశిని వేగానికి దాదాపు 20 అడుగుల దిగువకు నీరు జలపాతంగా పడుతుంది. ఇక్కడ యాత్రికులు ఆనందోత్సాహాలతో స్నానాలు ఆచరిస్తారు. చుట్టు ఎత్తైన కొండలు, పచ్చటిచెట్లు, లోయలు, లోయల్లో హొయలొలుకుతూ ప్రవహిస్తున్న భవనాశిని మనకు స్వాగతం పలుకుతున్నాయి. ఈ దిగువన అదిగో నీటిప్రవాహం ప్రక్కనే కనిపిస్తున్నవే పంచపాండవ మంటపాలు. కురుక్షేత్ర సంగ్రామం తర్వాత యుద్ధంలో గురువులను, బంధువులను, మిత్రులను సంహరించిన పాపప్రక్షాళన కొరకు పాండవులు ఈ మంటపాలలో హోమంచేసి తపోదీక్షతో నృసింహస్వామి అనుగ్రహాన్ని పొందారని పురాణ కథనం. ఇది శ్రీమదహోబిల లక్ష్మీనృసింహ ఆర్యవైశ్య నిత్యాన్నదాన సత్రం. ఇంకా ఇక్కడ ఇటీవలి కాలంలో వివిధ కులాలకు చెందిన నిత్యాన్నదాన సత్రాలు వెలిశాయి. ఆర్యవైశ్యసత్రం ప్రక్కనే స్వామివారి పుష్కరిణి సన్నిధి కోనేరు మనకు



కనిపిస్తుంది. (ప్రస్తుతం ఇందులో నీరులేదు బోరింగు వేశారు) విశాలమైన ఈ పుష్కరిణి ఎదురుగా రాతి మండపాలు కనిపిస్తున్నాయి. ఇక్కడే ఒకప్పుడు వేదాధ్యయనం చేసేవారు. ప్రస్తుతం ఇవికూడా సత్రాలుగా మారిపోయాయి.

గగన వీధులను తాకే కొండల నడుమ చల్లని ఆహ్లాదకరమైన వాతావరణంలో వెలిసిన స్వామివారి గుహాలయానికి వెళ్ళాలంటే పుష్కరిణి ప్రక్కనే ఉన్న మెట్ల మార్గంలో వెళ్ళాలి. దాదాపు 100 మెట్లు ఎక్కగానే విశాలమైన ప్రదేశంలో గరుడాద్రి వేదాద్రి కొండలను రెండుగా చీల్చినట్లున్న మధ్యభాగంలో ఎత్తైన విశాలమైన స్వామివారి ఆలయ రాజగోపురం కనిపిస్తుంది. 5 అంతస్తులు కలిగిన ఎత్తైన, విశాలమైన, గంభీరమైన రాజగోపురం భక్తులను విశేషంగా ఆకర్షిస్తుంది. ఈ గోపురాన్ని ఒక్కసారి పరిశీలిస్తే స్వామివారి దశావతారరూపాలు, దేవీ, దేవతల బొమ్మలు, అద్భుతమైన శిల్పకళతో చూపరులను విశేషంగా ఆకట్టుకోవడమేకాక ఆధ్యాత్మిక భావనను పెంపొందిస్తాయి. రాజగోపురం శిఖరంపైన ఐదుకలశాలు మనకు దర్శనమిస్తాయి. బ్రహ్మోత్సవాలు, విశేష ఉత్సవాల సందర్భంలో ఈ రాజగోపుర కలశాలకు కూడా పూజాకార్యక్రమాలను నిర్వహిస్తారు. ఇక ఉత్సవాల సందర్భంలో ఈ రాజగోపురాన్ని వివిధవర్ణాల విద్యుత్తుదీపాలతో అలంకరిస్తారు. వివిధ రకాల రంగులతో అలంకరించిన ఈ రాజగోపురం చాలా ప్రాచీనమైనది. రాజగోపురానికి ఎదురుగా, మెట్లమార్గానికి మరోవైపు కనిపిస్తున్న అద్భుత శిల్పాలతో శ్రీస్వామివారి కల్యాణమండపం. ప్రతి ఏడాది బ్రహ్మోత్సవాలలో తిరుకల్యాణోత్సవాన్ని ఈ మండపంలో నిర్వహించడం జరుగుతుంది. నాలుగు స్తంభాలతో కూడుకున్న ఈ మండపానికి 5 సోపానాలున్నాయి. మండపం మధ్యభాగంలో ఎత్తైన కల్యాణవేదిక ఉంది. రాతిదూలాలతో, స్తంభాలతో నిర్మితమైన ఈ కల్యాణ మండపానికి కొన్ని శతాబ్దాల చరిత్రేఉంది. ప్రహ్లాదవరదుని కల్యాణోత్సవ మండపం కల్యాణోత్సవ సమయంలో వివిధజాతుల సుగంధభరిత పుష్పాలతో సర్వాంగ సుందరంగా అలంకరింపబడుతుంది.

## భవనాశినది

మనం ముందుగా రాజగోపురం ప్రక్కనే ఉన్న మార్గంగుండా భవనాశినీ నదిపై లోయలో చెక్కలతో నిర్మించిన వంతెనపై వెళ్ళి పరమపావన భవనాశినీ తీర్థంలో స్నానం ఆచరిద్దాం. ఈ మార్గంలోనే స్వామివారికి తలనీలాలు సమర్పించుకునే కల్యాణకట్ట ఉంది. భక్తులు ఇక్కడ తలనీలాలను సమర్పించుకుంటారు. వేదాద్రి గరుడాద్రి పర్వతాలలో పారే నీటిఊటల నుండి ఈ నది ప్రవహిస్తుంది. బ్రహ్మాండపురాణంలోని అహోబిలక్షేత్ర మాహాత్మ్యంలో ఈ నది ప్రస్తావన ప్రధానంగా కనిపిస్తుంది. ఈ నదిలో స్నానమాచరించడంవల్ల సకలపాపాలు తొలగిపోతాయి. "భవం" అంటే పుట్టుక–"నాశిని" అంటే నశింపజేయునది. సృష్టిలోని 84 లక్షల జీవరాశులలో అత్యంత శ్రేష్ఠమైన జీవరాశి మనిషి "జంతూనాం నరజన్మ దుర్లభం" ఎన్నో జన్మల పుణ్యఫలితంగా మానవజన్మ లభిస్తుంది. మానవజన్మ పొందిన జీవి తిరిగి జననమరణ చక్రంలో పడకుండా మానవజన్మ సార్థకం చేసుకొని జన్మరాహిత్యాన్ని పొందాలి. అటువంటి జన్మరాహిత్యాన్ని ప్రసాదించేది, భవబంధాల నుండి విముక్తిని ప్రసాదించేది. వర్షాకాలంలో బహుళంగా ప్రవహించి, తక్కిన సమయంలో చిన్న సెలయేరుగా ప్రవహించే ఈ భవనాశినీనది పుట్టుకను గురించి లోకంలో అనేక కథలు ప్రచారంలో ఉన్నాయి.

హిరణ్యకశిప సంహారానంతరం కూడా ఉగ్రరూపంలో ఉండే స్వామిని శాంతింపజేసి శైత్యోపచారాలు చేయడానికి ఆకాశగంగ ఈ క్షేత్రానికి దిగిరాగా, ఉగ్రరూపి అయిన స్వామివారు హిరణ్యకశిపుని వధించి ఆ చేతులను ఈ నదిలో శుభ్రం చేసుకున్నాడని అందుకే ఈ నదికి "భవనాశిని" అని పేరు వచ్చిందని ఒక ఐతిహ్యం.

స్వామివారిని శాంతింపజేసేందుకు ఈ క్షేత్రానికి వచ్చిన గంగా ప్రవాహవేగానికి సకల జీవరాశులు కొట్టుకుపోవడాన్ని గమనించిన దేవతలు వేగాన్ని తగ్గించి అనుగ్రహించమని గంగాదేవిని ప్రార్థించినా ఫలితం లేకపోయింది. దాంతో భైరవుడు గంగను శాంతింపజేసేందుకు తన శిరస్సును ఖండించుకొని గంగలోవేశాడట. ఈ సంఘటనకు వెరచిన గంగ భైరవుని తలను పాతాళానికి తీసుకెళ్ళి కర్తవ్యోపదేశం చేయమని ఆదిశేషుని కోరగా ఆదిశేషుడు ఉగ్రరూపాన్ని తగ్గించి శాంతరూపంతో "అంతర్వాహినిగా" ఈ భవనాశిలో సెలయేరుగా ప్రవహించమని గంగకు కర్తవ్యోపదేశం చేశాడట. నాటినుండి గంగ భవనాశిలో అంతర్వాహినిగా, భైరవుని తపోస్థలమైన "చింతవనం గుహ" నుండి ప్రవహిస్తూందని నృసింహస్వామి పురాణం చెబుతూంది.

**"అహోబిలపథం గత్వా దృష్ట్వా వై భవనాశినం**
**జన్మ కొట్యార్జితాత్పాపాత్ ముచ్యతే నాత్ర సంశయః"** అని బ్రహ్మాండ పురాణం చెబుతూంది. జ్వాలా నృసింహస్వామి ఆలయంనుండి ఎగువ అహోబిలంవరకు భవనాశినది ఒక్కొక్కచోట ఒక్కో ప్రతేకతను, ఒక్కో పవిత్రతను సంతరించుకుంటూ వేరు వేరు పేర్లతో పిలవబడుతూందని వీటి వైశిష్ట్యాన్ని గూర్చి బ్రహ్మపురాణం తెలుపుతూంది. ఇలా అనేక కథనాలు ప్రచారంలో ఉన్నాయి. ఏది యేమైనా భవనాశిలో స్నానం ఆచరించి సకలభవబంధాల నుండి విముక్తులమవుదాం. స్వామి కృపకు పాత్రులమౌదాం. భవనాశినీ తీర్థంలో స్నానమాచరించి ఆ అహోబిలేశుని దర్శనానికి తిరిగి రాజగోపురంలో ప్రవేశిద్దాం.

## ఉగ్ర నరసింహస్వామి దర్శనం

రాజగోపురం గుండా మనం ఇప్పుడు స్వామివారి ఆలయ ప్రవేశం చేస్తున్నాం. స్వామివారి ఆలయం దీర్ఘచతురస్రాకారంలో నిర్మితమైంది. తూర్పుముఖంగా విరాజిల్లుతున్న ఈ ఆలయంలో స్వామివారు మాత్రం ప్రకృతి సిద్ధంగా ఏర్పడిన గుహలో ఉత్తరాభి ముఖంగా దర్శనమిస్తారు. ఆలయంలో ప్రవేశించగానే మహామంటపంలో కొలువైవున్న స్వామివారి వాహనాలు మనకు కనిపిస్తాయి. తూర్పుముఖంగా విరాజిల్లుతున్న

ఈ ఆలయంలో స్వామివారుమాత్రం ప్రకృతి సిద్ధంగా ఏర్పడిన గుహాలయంమాత్రం ఉత్తరాభిముఖంగా దర్శనమిస్తుంది.

గర్భాలయ ద్వారంముందు ప్రాక్పశ్చిమ ముఖంగా మహామంటపం, స్తంభయుతమైన ముఖమంటపం కనిపిస్తాయి. ముఖమంటపం ముందుభాగంలో దాదాపు 21 అడుగుల ఎత్తైన ధ్వజస్తంభం, దానిముందు బలిపీఠం దర్శనమిస్తాయి. జ్వాలా, మాలోల నరసింహక్షేత్రాలకు వెళ్ళే ఒక ద్వారం మనకు ఇక్కడ దర్శనమిస్తుంది. ఈ ద్వారానికి ప్రక్కన నిర్మితమైన శిలామంటపం ముందు నూతనంగా చెక్కతో నిర్మించిన ఒక వేదిక కనిపిస్తుంది. ఈ వేదికపైనే భక్తులకోరికపై స్వామివారి ఆర్జిత కల్యాణోత్సవం, నిర్వహింపబడుతూంటుంది. జ్వాలా, మాలోల మార్గద్వారానికి ఎడమప్రక్కన 7 సోపానాలు కలిగి ఉపరిభాగంలో స్వామివారికి ప్రసాదాలు తయారుచేసే పోటు కనిపిస్తుంది. ఇక్కడకూడా ఒక ప్రాచీన శిలామంటపం చక్కటి శిల్పాలతో దర్శనమిస్తుంది. పూర్వం మూలవర్లకు నివేదన పిమ్మట ఉత్సవవర్లను ఇక్కడికి వేంచేయింపుచేసి నివేదనలు చేసేవారని చెబుతుంటారు.

మనం ఇప్పుడు శ్రీ అహోబిలేశుని దర్శించుకోబోతున్నాం. స్వామివారి ముఖమంటపంలో ప్రవేశించేముందు ద్వాపాలకులైన జయవిజయులు దర్శనమిస్తారు. వీరిని దాటుకొని ముందుకు వెళ్ళగానే విశేష సన్నిధిలోనికి మనం ప్రవేశిస్తాం. గర్భగుడి ప్రక్కనే ముఖమండపంలో కుడివైపున ఒక చిన్న గుహలో పరమశివుడు జ్వాలానృసింహస్వామివారిని గూర్చి తపస్సు చేస్తున్న భంగిమలో శివలింగం, ఎదురుగా, జ్వాలానృసింహస్వామివారు కొలువైవున్నారు. పరమశివుని తపస్సుకు మెచ్చి స్వామి ప్రత్యక్షంకాగా "ఉగ్రంవీరం..." అనే 9 శ్లోకాలతో కూడిన "మంత్రరాజస్తవం"ను పఠిస్తూ స్తుతించాడట. అలాగే త్రేతాయుగంలో శ్రీరాముడు కూడా ఇక్కడే స్వామివారిని కీర్తిస్తూ అహోబల నృసింహ పంచామృత" స్తోత్రాన్ని చేశాడట. అందుకు నిదర్శనంగా శ్రీరాముని విగ్రహం కూడా ఈ గుహలో మనకు



కనిపిస్తుంది. ముఖమండపం మధ్యభాగంలో నాలుగు స్తంభాలతోకూడిన మరో మండపం కనిపిస్తుంది. ఇక్కడే పూర్వం రాజులు, చక్రవర్తులు ఆలయనిర్మాణ సమయంలో అశేషమైన నవనిధులు దాచిపెట్టారట. దానిని ఎవ్వరూ తీయకుండా మండపం మధ్యభాగంలో శ్రీచక్రాన్ని కూడా నిర్మించారట. నిధిని చూపుతున్న భంగిమలో నాలుగు స్తంభాలపై వేలెత్తి చూపుతున్నట్లు విగ్రహాలున్నాయి. అందుకే ఈ ప్రదేశంలో ఇత్తడి కడ్డీలతో బరికేడ్లు నిర్మించి పటిష్ఠమైన భద్రత కల్పించారు. ఈ నిధిని త్రవ్వేందుకు అనేకమంది ప్రయత్నించారని, అలా ప్రయత్నించినవారంతా చిత్రవిచిత్రంగా మరణించారని చరిత్ర చెబుతోంది. అందుకే కొంతకాలంగా ఈ ప్రాంతంలో రక్షణనుకూడా పెంచారు. ప్రస్తుతం నిధినిక్షేపాలుండే ఈ ప్రదేశాన్ని భక్తులు లక్ష్మీనివాసంగా భావిస్తారు.

"లక్ష్మీనివాస వరదగోవిందా...గోవిందా

విశేష సన్నిధికి ఎదురుగా కుడివైపున "గరుడాళ్వార్లు", రామానుజా చార్యులు, పన్నిద్దరాళ్వారుల విగ్రహాలు ప్రతిష్ఠించబడి ఉండడం మనం గమనించవచ్చును. క్రీ.శ. 8వ శతాబ్దంలో భగవద్రామానుజులవారు 108 దివ్యదేశాలను సందర్శిస్తూ, అహోబలక్షేత్రానికి కూడా వచ్చారని చరిత్ర చెబుతూంది. ఇప్పుడు మనం అహోబిల ఉగ్రనృసింహుడు కొలువైయున్న గుహాలయంలోనికి ప్రవేశిస్తున్నాం. ఇదే స్వామివారు కొలువైయున్న గుహాలయం. ఇక్కడే స్వామివారు ప్రహ్లాదుని అనుగ్రహించాడు.

అదిగో గుహాలయంలో ఎత్తైన వేదికపై సాలగ్రామ శిలారూపంలో స్వయంభువుగా వెలసిన అహోబిల నారసింహస్వామి దర్శనమిస్తున్నాడు. ఈయనే ప్రధానమైన క్షేత్రాధిదైవం! సుమారు 2 అడుగుల ఎత్తైన సాలగ్రామ శిలారూపంలో సుఖాసీనులై దక్షిణ పాదాన్ని మడిచి వామపాదాన్ని క్రిందకువదలి తొడలపై హిరణ్యకశిపుని పెట్టుకొని రెండుచేతులతో ఉదరంచీల్చి సంహరిస్తున్నట్లుగా ఉన్న స్వామివారి ప్రక్కనే ముకుళిత హస్తాలతో నిలబడిన ప్రహ్లాదునితో కూడిన దివ్యమంగళ విగ్రహం

దర్శనమిస్తున్నది. దక్షిణ వక్షంపై శ్రీవత్సాకృతిలో లక్ష్మీప్రతిమను కలిగివున్నట్లుగా గోచరించే స్వామివారి ఈ రూపం ఆగమశాస్త్రరీత్యా అత్యంత విశేష ప్రాముఖ్యతను సంతరించుకున్నది.

ఉన్నతమైన రజతకిరీటం, లలాటంపై తిరునామాలు, రజత కవచంను ధరించిన స్వామి, సాలగ్రామహార శోభితుడైన స్వామి, పట్టుపీతాంబర ధారియైన స్వామి మనకు దర్శనమిస్తున్నారు. ఈ స్వామివారికే ఉగ్రనారసింహుడని, వీరనారసింహుడని కూడా పేరు. ఇది వీరక్షేత్రం కూడా.

సాంజలి బద్ధులై స్వామివారి దివ్యమంగళ మనోహర మనోజ్ఞమూర్తిని దర్శిస్తూ స్వామి వారిని స్తుతిద్దాం.

**"గరుడాద్రి బిలే గేహే గజకుండ హరస్పటే**
**హిరణ్యస్థాన్ అహంకార హరిసింహాయ మంగళం"**

**"మహోగ్ర భీకరాకారం – పక్షీంద్రశైల సంస్థితం**
**వందే ఉగ్రనృసింహం తం – హిరణ్యకశిపాంతకం"**

హే హిరణ్యకశిపాంతకా, హే మహోగ్రభీకరాకారా, హే గరుడాచల నివాసా హే ఉగ్రనరసింహా వందేహం....వందేహం అంటూ ప్రార్థిద్దాం.

స్వామివారికి ఎదురుగా సాంజలిఘటిస్తూ సుఖాసీనుడైన ప్రహ్లాదుని కూడా మనం దర్శించవచ్చు. ప్రహ్లాదుని రక్షణకై అవతరించిన స్వామివారు మనందరికీ అభీష్టాలను నెరవేరుస్తూ కోరిన కోరికలు తీర్చే కొంగు బంగారం వెలుగొందుతున్నారు.

ఇంకో విశేషమేమిటంటే ఇక్కడ ఉన్న ఉగ్రనారసింహమూర్తి త్రిమూర్తి స్వరూపుడు.

**"ఆనాభేః బ్రహ్మణో రూపం, ఆగళాద్వైష్ణవం వపుః**
**ఆశీర్షాత్ రుద్రమీశానం, అగ్రతః పరతశ్శివం"**– అని శ్రీ లక్ష్మీనృసింహ సహస్రనామస్తోత్రం చెబుతున్నది. అంటే ఉగ్రనారసింహమూర్తి పాదాలనుండి



నాభివరకు బ్రహ్మరూపంలోనూ, నాభినుండి కంఠంవరకు విష్ణురూపంలోనూ, కంఠంనుండి శిరసువరకు రుద్రుని రూపంలోనూ, ఉంటూ అగ్రభాగం శివలింగాకృతిలోనూ ఉన్నదని అర్థం.

అర్చకస్వాములు స్వామివారికి సమర్పిస్తున్న ఆనంద కర్పూర నీరాజనాల కాంతిలో వెలుగొందుతున్న ఆ మహోగ్రమూర్తిని మరోసారి తనివితీరా దర్శించి ఆ నీరాజనాలను అందుకుని తీర్థప్రసాదాలను సేవిస్తూ

**ప్రహ్లాద వరద గోవిందా...గోవిందా...గోవింద.**
**గారూడశైలవాస గోవిందా...గోవిందా...గోవింద.**
**ఉగ్రనారసింహా...గోవిందా...గోవిందా...గోవింద.**

జయజయ నారసింహా....జయహోనారసింహా అంటూ గర్భాలయంనుండి వెలుపలికి నడుద్దాం. ఇక్కడే స్వామివారి హుండి ఉంటుంది. కానుకలు ఈ హుండీలో సమర్పిదాం. మనం ఇప్పుడు ఆ ఉగ్రనారసింహుని శాంతింపజేసిన చెంచులక్ష్మి అమ్మవారిని దర్శించుకోబోతున్నాం.

**వేదములే నీ నివాసమట విమలనారసింహ**
**నాదప్రియా సకలలోకపతి నమో నమో నరసింహా॥**

**ఘోరపాతక నిరుహరణ కుటిలదైత్యదమన**
**నారాయణ రమాధినాయక నగధర నరసింహా**
**నీ రూపము ఇంత అంతయని నిజము తెలియరాదు**
**ఈరీతి త్రివిక్రమాకృతి నేచితి నరసింహా॥**

**గోవింద గుణగుణరహిత కోటి సూర్య తేజ**
**శ్రీవల్లభ పురాణపురుష శిఖనఖ నరసింహ**
**దేవా మిము బ్రహ్మాదులకును తెలియనలవికాదు**
**భావించగ ప్రహ్లాదు నెదుట పరగితి నరసింహా॥**

**దాసపరికర సులభ తపన చంద్రనేత్ర**
**వాసవ సురముఖ మునిసేవిత వందిత నరసింహ**
**భాసురముగ శ్రీవేంకటగిరిని పాయనిదైవమ వటుగాన**
**ఓసరకిపుడు ఏగితివిట్ల అహోబల నరసింహ॥**

## చెంచులక్ష్మీదేవి ఆలయం

స్వామివారిగుహాలయం నుండి బయటకు రాగానే వెనుక భాగాన నాలుగుమెట్లు కనిపిస్తాయి. ఈ మెట్లెక్కగానే ఒక చిన్నగుహలో రాతిపై చెక్కబడిన శ్రీసుదర్శన మహాయంత్రం కనిపిస్తుంది. ఈ గుహాలయం ప్రక్కనే ఒక గది కనిపిస్తుంది. ఇక్కడే స్వామివారి ఉత్సవ విగ్రహాలను భద్రపరుస్తారు. ఈ గది ప్రక్కనే శ్రీ చెంచులక్ష్మి అమ్మవారు కొలువైవున్నారు.

హిరణ్యకశిపుని వధానంతరంకూడా కోపోద్రేకాన్ని వదలకుండా స్వామివారు అరణ్యాలవెంట తిరుగుతుండగా ఇంద్రాది దేవతల ప్రార్థనమేరకు శ్రీమహాలక్ష్మి చెంచుయువతిగా అవతారాన్ని ధరించి వచ్చి స్వామివారిని శాంతింపజేసి వివాహమాడిందట. ఆ సందర్భాన్ని పురస్కరించుకుని నేటికి కూడా కొండలలో నివసించే చెంచులు అమ్మవారిని తమ ఆడపడుచుగా భావించి కల్యాణోత్సవ సమయంలో చీరసారే సమర్పించడం ఆనవాయతిగా వస్తూంది.

మనం ఇప్పుడు చెంచులక్ష్మీ అమ్మవారి ఆలయంముందు నిలుచుని ఉన్నాం. ఒక్కసారి అమ్మవారిని దర్శించండి. చతుర్భుజాలతో అమ్మవారు రజత కిరీటధారియై, రెండు చేతులలో రెండు పద్మాలను ధరించి వరద, అభయ హస్తాలతో పద్మాసనాసీనురాలై స్వర్ణాభరణ భూషితురాలై విరాజిల్లుతున్న అమ్మవారి దివ్యమంగళ విగ్రహాన్ని మనం కనులారా చూస్తున్నాం.

**"పద్మప్రియే పద్మిని పద్మహస్తే....**
**పద్మాలయే పద్మదళాయతాక్షి**



**విశ్వప్రియే విష్ణుమనోనుకూలే**
**త్వత్పాదపద్మం మయి సన్నిధత్స్వ"**

"అమ్మా పద్మప్రియే! పద్మాలను చేతధరించి, పద్మాలపై ఆసీనురాలవై, పద్మదళాలవంటి కన్నులు కలిగిన ఓ తల్లీ! విష్ణుప్రియే, విష్ణుమనోనుకూలమైన నీ పాదపద్మాలు నిత్యం మా గృహంలో ఉండేలా అనుగ్రహించుతల్లీ (అంటే నిత్యము మాయింట వాసము చేయవమ్మ) అని అమ్మవారిని ప్రార్థిద్దాం. ఇక్కడ అమ్మవారికి అర్చకస్వాములు జరుపుతున్న విశేష కుంకుమార్చనలో పాల్గొందాం. అమ్మవారికి నివేదిస్తున్న కర్పూరనీరాజనాన్ని కళ్ళకు హత్తుకొని కుంకుమ తీర్థప్రసాదాలు స్వీకరించి ఆలయం వెలుపలికి నడుద్దాం.

**గరుడాద్రి వేదాద్రి కలిమి ఈపె**
**సిరులొసగీ చూడరో చింతామణి ఈపె ॥**

**పాలజలధి పుట్టిన పద్మాలయ ఈపె**
**లాలిత శ్రీ నారసింహు లక్ష్మి ఈపె**
**మేలిమి లోకమాతయై మించిన మగువ ఈపె**
**ఈ లీల లోకములేలే ఇందిర ఈపె ॥**

**ఘన సంపదలొసగు కమలాకాంత ఈపె**
**మనసిజుగనిన రమాపతి ఈపె**
**అనిశము బాయని మహా హరిప్రియ ఈపె**
**ధనధాన్యరూపపు శ్రీ తరుణి ఈపె ॥**

**రచ్చల వెలసినట్టి రమావనిత ఈపె**
**మచ్చిక గల అలమేల్మంగ ఈపె**
**ఇచ్చటి వేంకటాద్రి నీ అహోబలము నందు**
**నిచ్చలూ తావుకొనిన నిధానము ఈపె ॥**

ఎగువ అహోబిలక్షేత్రం కేంద్రంగా ఎత్తైన కొండల్లో క్రోధాకారనరసింహస్వామి, మాలోలనరసింహస్వామి, జ్వాలా

నరసింహస్వామి ఆలయాలతో పాటుగా, ప్రహ్లాదబడి, అచలమేరుపర్వత శిఖరాగ్రాన వెలసిన ఉక్కుస్తంభం ఉన్నాయి. ఈ ప్రదేశాలు పూర్తిగా కొండల్లో వుండడంవల్ల వీటిని దర్శించేందుకు కాలినడక తప్ప మరో మార్గం లేదు. ఎగువ అహోబిల ఆలయానికి ప్రక్కనే ఉన్నమార్గంలో భవనాశినదిపై నిర్మించిన చెక్కవంతెన నుండి ఉండే మార్గంలో ఈ క్షేత్రాల సందర్శనకు వెళ్ళాలి.

## 4. క్రోడ (వరాహ) నృసింహస్వామిక్షేత్రం

మనం ఇప్పుడు ఎత్తైన కొండల నడుమ ప్రవహిస్తున్న భవనాశి నదీతీరంవెంట కొండరాళ్ళపై వరాహనరసింహస్వామి దర్శించేందుకు కాలినడకన వెళ్తున్నాం.

చుట్టుకొండలు, అక్కడక్కడ వాటిమధ్య ఏపుగా పెరిగిన పచ్చని చెట్లు, చల్లటి భవనాశి నీళ్లతుంపరలు, కీచురాళ్ళచప్పుళ్ళు, ప్రకృతి సోయగాలు, ఆహ్లాదాన్ని కలిగిస్తున్నాయి. ఎగువ అహోబిలానికి 1 కి.మీ దూరంలో తూర్పుదిక్కున, భవనాశినది తీరాన నెలకొన్న వరాహనృసింహక్షేత్రాన్ని సమీపిస్తున్నాం. ఇక్కడ మనకు కొన్ని మంటపాలు కనిపిస్తాయి. వీటినే 'విశ్రాంతి మంటపాలు' లేదా 'కాలక్షేప మంటపాలు' అంటారు. వీటిని దాటి వెళ్తే అదిగో అదే శ్రీ వరాహనరసింహస్వామివారి సన్నిధి. ఈ స్వామివారినే క్రోడనరసింహస్వామి అనికూడా అంటారు. ఈ ఆలయం వేదాద్రి దిగువభాగాన నెలకొనిఉంది. ఇక్కడ మనకు వేదాచల గరుడాచలాలమధ్య ఇరుకైన లోయలో ప్రవహించే భవనాశినది తద్వారా ఏర్పడిన వరాహగుండం కనిపిస్తాయి.

క్రోడనరసింహాలయం కూడా గుహాలయమే. ఇక్కడ స్వామివారు లక్ష్మీనారసింహునిగాను, భూ వరాహనారసింహుని రూపంలోనూ దర్శనమిస్తారు. హిరణ్యకశిపుని సోదరుడైన హిరణ్యాక్షుడు సమస్త భూమండలాన్ని చాపలాచుట్టి అపహరించబోగా శ్రీమహావిష్ణుమూర్తి



వరాహావతారాన్ని ధరించి, భూదేవిని తన "ముట్టె"పై నిలిపి హిరణ్యాక్షుని సంహరించాడు. ఆ సందర్భంలో భూదేవి వరాహావతారి అయిన స్వామివారి "ముట్టె"ను కౌగిలించుకున్నట్లుఉండే భంగిమలో ఇక్కడ వరాహ నృసింహస్వామివారు దర్శనమిస్తారు. పాదాల చెంతన హిరణ్యాక్షుడు కనిపిస్తాడు. ఇక్కడ స్వామివారికి ఎలాంటి అలంకారాలు ఉండకపోవడం గమనార్హం.

భూవరాహ నృసింహుని మంగళ స్వరూపాన్ని ఒక్కసారి గమనించండి. స్వామివారు త్రిభంగి భంగిమలో ఉంటూ, ముఖం మాత్రం వరాహముఖం శరీరం మానవశరీరం కలిగి సింహలాంగూలంవంటి వాలంతో ముట్టెపై భూదేవిని కలిగి రెండు చేతులను నడుముపై నిలిపినవారై విచిత్ర భంగిమలో దర్శనమివ్వడం శ్రీకోడనరసింహస్వామివారి ప్రత్యేకత. ఈ స్వామివారి ప్రక్కనే లక్ష్మీదేవిని తొడపై కూర్చోపెట్టుకున్న భంగిమలో ఉండే శంఖచక్ర వరదహస్తాలతో ఉన్న లక్ష్మీనరసింహస్వామికూడా దర్శనమిస్తారు.

ఈ క్షేత్రంలో స్వామివారిని ఆరుమాసాలపాటు ప్రతిరోజు ప్రాతః కాలమున సేవిస్తే ఇష్టసిద్ధులు కలుగుతాయి.

**పరిపూర్ణ గరుడాద్రి పంచాననం**
**పరమం సేవే పంచాననం ॥**

**క్రూరదంష్ట్రాగ్నికణ ఘోర పంచాననం**
**పారీణ చక్రధర పంచాననం**
**వీరపంచాననం విజయపంచాననం**
**భార భూభారహర పంచాననం ॥**

**దివిజపంచాననం తీవ్రనఖకాననం**
**భవనాశినీతీర పంచాననం**
**కువలయాకాశసంఘోష పంచాననం**
**పవిశబ్ద దంతరవ పంచాననం ॥**

**శ్రీవేంకటాఖ్య ఘనశిఖరి పంచాననం**
**పావనం పంచముఖ పంచాననం**
**సేవితప్రహ్లాదసిద్ధిపంచాననం**
**భావితం శ్రీయుక్త పంచాననం ॥**

అర్చకులు సమర్పిస్తున్న కర్పూరహారతి కాంతి వెలుగులో నిజరూపదర్శన భాగ్యాన్ని ప్రసాదిస్తున్న స్వామివారిని దర్శించండి.

**వరాహతీర్థ సుక్షేత్రే - సుప్రతిష్ఠిత స్వామినం**
**శ్రీ వరాహనృసింహాఖ్యం - వందే కంటకనాశనం"**

అంటూ స్వామివారిని ప్రార్థిస్తూ, తీర్థ, శఠారిలను స్వీకరించి ముందుకు నడుద్దాం.

## 5. జ్వాలా నృసింహక్షేత్రం

మనం ఇప్పుడు జ్వాలా నృసింహస్వామి క్షేత్రానికి పయనిస్తున్నాం. ఈ క్షేత్రం ఎగువ అహోబిలం నుండి తూర్పుదిక్కున 3 కి.మీ, వరాహ నరసింహ క్షేత్రంనుండి 2 కి.మీల దూరంలో, కొండలలో దట్టమైన అడవులలోని గుహాలయంలో గరుడాద్రి-వేదాద్రి మధ్యనున్న మేరుపర్వతాగ్ర భాగాన నెలకొనివుంది. ఈ ప్రాంతాన్నే "అచలచ్ఛాయ పర్వతం" అంటారు. చుట్టు పచ్చగా దట్టంగా ఉన్న వృక్షాలు, పెద్దపెద్ద కొండరాళ్ళ నడుమనుండి ప్రవహిస్తున్న భవనాశిని చల్లని జలాలు, శుకపికాలాపాలతో ప్రకృతి రమణీయంగా స్వామివారి దర్శనానికి నడిచి వస్తున్న భక్తుల అలసటను తీర్చేవిధంగా ఆహ్లాదంగా ఉంటుంది.

ఈ ఆలయాన్ని చేరుకోవడం క్లిష్టతతో, మిక్కిలి శ్రమతో కూడుకున్న విషయమే. ఇరుకుగా, ఎగుడుదిగుడుగా గండుశిలలను తొలచి ఏర్పరచిన కొండ అంచుననడకదారి కలిగిన మార్గం ఇది. ఒకవైపు ఎత్తైన కొండ మరోవైపు చూస్తూనే కళ్ళుతిరిగేంత లోతైన లోయ. బండరాళ్ళపై నడక. కొంత జాగ్రత్తపడకపోతే సరాసరి అగాధంలోనికే.....ఇక్కడ



నరసింహస్వామివారు ఉగ్రస్వరూపుడై, కోపోద్రిక్తుడై భీకరంగా హిరణ్యకశిపుని సంహరిస్తున్నట్లుగా కనిపిస్తారు. నిజానికి జ్వాలా నృసింహస్వామివారు కొలువైన ఈ ప్రాంతం హిరణ్యకశిపుని సువిశాల రాజప్రాసాద ప్రవేశద్వారపు "గడప"గా చెప్పుకుంటారు.

శ్రీ హరినామసుధారసపానం చేసిన పరమ భాగవతోత్తముడైన ప్రహ్లాదుని హరిభక్తిని మాన్పింప శక్యంకాని హిరణ్యకశిపుడు "మాయావి అయిన నీ శ్రీహరి ఎక్కడున్నాడ"ని ప్రశ్నించగా ప్రహ్లాదుడు "విష్ణువు విశ్వవ్యాపి" అంటూ

**"ఇందుఁగలఁ డందు లేఁడని,**
**సందేహము వలదు; చక్రి సర్వోపగతుం;**
**డెందెందు వెదకి చూచిన,**
**నందందే గలఁడు దానవాగ్రణి! వింటే!"**

అని పలుకగా తన రాజప్రసాదం మధ్యభాగంలో ఉండే ఉక్కుస్తంభం (ఈ అచలచ్ఛాయమేరు)లో చూపమంటూ స్తంభాన్ని బ్రద్దలగొట్టాడు. స్తంభం రెండుగా చీలి ఉగ్రస్వరూపుడైన కోపజ్వాలలు ఎగిసిపడుతున్న జ్వాలా నృసింహమూర్తి "సత్యం విధాతు నిజభృత్యభాషితం" అన్నట్లుగా ఉద్భవించి దుష్టుడైన హిరణ్యకశిపుని ఇక్కడే సంహరించాడట. కోపోద్రిక్తుడైన స్వామివారిని శాంతింపజేయుటకు ఇంద్రాది దేవతలు ఆకాశగంగను రప్పించి అభిషేకించారట. ఆ నీరే భవనాశిని తీర్థమని పురాణాలు చెబుతున్నాయి.

ఈ వృత్తాంతానికి సాక్షీభూతం అంటున్నట్లుగా స్వామివారి విగ్రహానికి ఇరువైపులా నిటారుగా ఒకటి, కొంత వాలినట్లుగా ఒకటి చీలినట్లున్న అచలచ్ఛాయ మేరుపర్వతం కనిపిస్తుంది.

స్వామివారు కొలువైవున్న గుహాలయం ముందు ఒక నీటి కుంట వుంది. ఈ నీరు ఎప్పుడు ఎర్రగా ఉంటాయి. హిరణ్యకశిపుని ఉదరాన్ని

చీల్చి సంహరించిన రక్తపుచేతులను స్వామివారు ఈ కుంటలో శుభ్రపరచుకున్నారని అందుకే ఇక్కడినీళ్ళు ఎర్రగా ఉంటాయని అంటారు. ఒకసారి అలా ప్రక్కనచూస్తే పర్వతాగ్రంనుండి ధారలుగా ప్రవహిస్తూ చూపరులను ఆసక్తిగొలిపే జలపాతం (వర్షాకాలంలో) అద్భుతం, మనోహరం. ఆ జలపాతం క్రింద స్నానమాచరించి స్వామివారిని దర్శించుకుందాం రండి.

మనం ఇప్పుడు జ్వాలా నృసింహస్వామివారు కొలువైయున్న గుహాలయం ముందున్నాం. ఈ గుహ అతిసహజత్వాన్ని తలపిస్తుండడం ఒక విశేషంకాగా ఇక్కడ స్వామివారు ముమ్మూర్తులుగా దర్శనమివ్వడం మరోవిశేషం 1. అష్టభుజనారసింహమూర్తి 2. చతుర్భుజ నారసింహమూర్తి 3. దైత్యాంతకోద్యుక్తమూర్తి.

అదిగో అతిభీకరాకారంతో అష్టభుజాలతో విలసిల్లుతున్న జ్వాలానరసింహస్వామి. గుహమధ్యభాగంలో గరుడపీఠంపై ఆసీనుడైన స్వామి. అమేయశక్తి సంపన్నుడు, అప్రతిహత బలసంపన్నుడు అయిన జ్వాలానృసింహస్వామి. స్వామివారి ఊరువులపై పడిన హిరణ్యకశిపుని తలను, కిరీటాన్ని ఒకచేతితో, చేతికత్తిని, చేతుల్ని మరోచేతితో ఒడిసి పట్టుకున్నాడు. ఇంకో రెండు చేతులతో హిరణ్యకశిపుని ఉదరాన్ని చీలుస్తున్నాడు. ఇంకో జతచేతులలో శంఖచక్రాలను ధరించియున్నాడు. గమనించండి స్వామివారి భీకరమైన, ఉగ్రరూపాన్ని చూస్తేనే ఒళ్ళు జలదరిస్తుంది కదూ! స్వామివారి పాదాలచెంతన ముకుళిత హస్తాలతో భక్తితో వినమ్రుడైన ప్రహ్లాదుడు ఈ స్వామివారి వెనుక ఏకశిలానిర్మితమైన కీర్తిముఖంతో విలసిల్లుతున్న మకరతోరణాన్ని ఇక్కడ మనం గమనించవచ్చును.

ఇక ఈ స్వామివారి ప్రక్కనే ఉన్నమూర్తి స్తంభోద్భవ నారసింహమూర్తి. ఈ స్వామి ప్రహ్లాదుని మాటను సత్యం చేసేందుకు స్తంభాన్ని చీల్చుకొనివచ్చి నిలబడిన భంగిమలో ఉన్నాడు. ఇది అతిప్రాచీన అసాధారణ కేవల



నారసింహరూపం. శంఖచక్రధారియై మరోరెండు చేతులతో హిరణ్యకశిపుని సంహరించేందుకు సిద్ధమవుతున్నట్లు కనిపిస్తున్నాడు. స్వామివారికి కుడివైపున లక్ష్మీదేవి ఆసీనురాలై యుండగా, ఎడమవైపు ప్రహ్లాదుడు సాంజలి బద్ధుడై కనిపిస్తున్నాడు. స్వామివారు కరండ మకుటధారియై కనిపిస్తూ భక్తులను విశేషంగా అనుగ్రహిస్తున్నాడు.

ఇక దైత్యాంతకోద్యుక్తమూర్తి, అంటే దైత్యుడైన హిరణ్యకశిపుని సంహరించేందుకు ఉద్యుక్తుడైన మూర్తి. అమితబల పరాక్రమ సంపన్నుడై, ముల్లోకాలను జయించానన్న గర్వంతో విర్రవీగుతున్న హిరణ్యకశిపుడు నరమృగ శరీరంతో అవతరించిన స్వామివారిపైనే కత్తివిసిరాడు. స్వామివారు వాని గర్వాన్ని అణచేందుకు తన కుడిచేతి పంజా ఎత్తినట్లు కనిపిస్తున్నారు.

ఏది ఏమైనా ముమ్మూర్తులు కూడా దుష్టశిక్షణ చేసేందుకు అవతరించిన స్వామివారి గాధను జ్ఞప్తికి చేస్తున్నాయి. హిరణ్యకశిప సంహారానికి స్తంభం నుండి అవతరించినట్లుగా చతుర్భుజాలతో ఒకమూర్తి, హిరణ్యకశిపుని అష్టభుజుడై సంహరిస్తున్నట్లుగా భీకరంగా ఒకమూర్తి తన భక్తులకు అభయాన్ని ప్రసాదిస్తూ మరోమూర్తి విశేషంగా అనుగ్రహిస్తున్నారు.

**ఘోర విదారణ నారసింహ నీ**
**వీ రూపముతో ఎట్లుండితివో ॥**

**ఉడికెడి కోపపుటూర్పుల కొండలు**
**పొడిపొడియై నభమున కెగయ**
**బెడిదపు రవమున పిడుగులు దొరుగగ**
**ఎడనెడ నీవపుడెట్లుండితివో ॥**

**కాలానలములు గక్కుచు నయన -**
**జ్వాలల నిప్పులు చల్లుచును**
**భాలాక్షముతో బ్రహ్మాండకోట్ల -**
**కేలికవై నీ వెట్లుండితివో ॥**

**గుటగుట రవములు కుత్తిక గులుకుచు**
**గిటగిట పండ్లు గీటుచును**
**తటతట పెదవులు దవడలు వణకగ**
**ఇటువలె నీ వపు డెట్లుండితివో ॥**

**గోళ్ళ మెరుగుల కొంకుల పెదపెద**
**వేళ్ళ దిక్కులు వెదకుచును**
**నీళ్ళ తీగెలు నిగుడగ నోర సు -**
**చ్ఛిళ్ళు గమ్మగ నెట్లుండితివో ॥**

**హిరణ్య కశిపుని ఏపడచి భయం**
**కరరూపముతో కడుమెరసి**
**తిరువేంకటగిరి దేవుడ నీవిక**
**ఇరవుకొన్నవా డెట్లుండితివో॥**

అర్చక స్వాములు జ్వాలానృసింహమూర్తికి, ముమ్మూర్తులకు కర్పూరహారతులు సమర్పిస్తుండగా ఆ కాంతిలో జాజ్వల్యమానంగా వెలుగొందుతున్న స్వామివారిని మనసారా స్మరిద్దాం.

**"వందే సాష్టభుజాకారం - చతుర్భుజసమన్వితం**
**జ్వాలానృసింహ విఖ్యాతం - ఘననీలాచలస్థితం**
**హిరణ్యస్తంభ సంభూతి ప్రఖ్యాత పరమాత్మనే**
**ప్రహ్లాదార్తి ముఖ, జ్వాలానారసింహాయ తే నమః"**

కర్పూరహారతిని కళ్ళకు హత్తుకొని తీర్థాన్ని స్వీకరించి ఇక్కడికి 2 కి.మీల దూరంలో అచలచ్ఛాయ మేరుపర్వత శిఖరాగ్రాన ఉన్న ఉక్కుస్తంభం దర్శనానికివెళ్దాం. ఈ ప్రాంతం పూర్తిగా నిటారుగా ఉన్న పెద్దపెద్ద బండరాళ్ళు, మట్టితో కూడుకున్న ప్రాంతం. ఈ ఉక్కుస్తంభ దర్శనానికి వయసుమళ్ళినవారు, హృద్రోగం ఉన్నవారు, ఆయాసం



ఉన్నావారు, వెళ్ళలేరు, వెళ్ళరాదు. ప్రత్యేకించి వర్షాకాలంలో యువకులు కూడా వెళ్ళేందుకు సాహసించరాదు. వర్షంవల్ల తడిసిన మట్టిపైనుండి బండరాళ్ళు దొర్లేప్రమాదం ఉంది. కనుక వర్షాకాలం మరియు సంధ్యాసమయం శ్రేయస్కరం కాదు.

## ఉగ్రస్తంభం/ఉక్కుస్తంభం

ఉక్కుస్తంభానికి వెళ్ళేందుకు ఎటువంటి మెట్లుఉండవు. దట్టమై అడవిలో చెట్లను, కొండరాళ్ళను పట్టుకొని ఎగబ్రాకాల్సిందే. ఏమాత్రం పట్టు తప్పినా అధఃపాతాళాన్ని తలపించే లోయలో పడిపోవలసిందే. అత్యంత శ్రమకోర్చి మనం ఇప్పుడు అచలచ్ఛాయా మేరుపర్వత శిఖరాగ్రాన ఉన్న ఉక్కుస్తంబం ప్రాంతానికి చేరుకున్నాం. జ్వాలా నృసింహుని చెంత రెండుగా చీలిన కొండలలో ఒకటి ఈ శిఖరాగ్రప్రాంతం. ఇక ఇక్కడి నుండి పైకి చూసినా ప్రక్కలకు చూసిన ఆకాశము, అడవి దట్టమైనలోయలు కనిపించి భయకంపితులను చేస్తాయి. స్వామివారు ఉక్కుస్తంభంనుండి ఉద్భవించినందుకు నిదర్శనంగా ఇక్కడ 3 ఉక్కుస్తంభాలు స్థాపించ బడినాయి. ఇది చెంచుల నివాస ప్రాంతం. ఈ ఉక్కుస్తంభాలకు మూడు ప్రదక్షిణలుచేస్తే అన్నికోరికలు నెరవేరుతాయట. అయితే ఆ ప్రదక్షిణలు చేయడం చాలాకష్టం. కారణమేమంటే పెద్ద బండరాతి మధ్యనున్న చిన్నమార్గంగుండా ప్రదక్షిణానికి వెళ్ళాలి. ప్రదక్షిణ మార్గం చుట్టూ ఎటువంటి రక్షణకూడా లేదు. చిన్న రాతిపలకమీద నడవాలి. ఏ మాత్రం అజాగ్రత్తగా ఉన్నా, ఏ మాత్రం కాలుజారినా శరీరభాగాలుకూడా కనిపించకుండా పోయేంత లోతైనలోయ. అంతేసంగతులు కనుక ఇప్పుడే మనం మనసుదిట్టంగా చేసుకొని నిరంతర హరినామస్మరణచేస్తూ అత్యంత జాగ్రత్తగా ప్రదక్షిణలు చేయాలి. ఆ ఉక్కుస్తంభాన్ని నమస్కరించుకొని తిరిగి క్రిందకు ప్రయాణమవుదాం.

**స్తంభోద్భవ నారసింహా! వరద గోవిందా.....గోవింద**

మనం ఇప్పుడు తిరిగి జ్వాలా నారసింహక్షేత్రానికి కాకుండా ఇక్కడి నుండి దిగువగా 3 కి.మీల దూరంలో ఉన్న "ప్రహ్లాదబడికి" వెళ్తున్నాం. అక్కడనుండి మాలోలనరసింహస్వామివారిని దర్శించి, క్రోడనరసింహస్వామి క్షేత్రం మీదుగా ఎగువ అహోబిలాన్ని చేరుకుంటాం.

రండి. ఇప్పుడు మనం ప్రహ్లాదబడికి పయనమవుదాం. భవనాశితీర అహోబిలక్షేత్రం అత్యంత పవిత్రమైనది, పరమ పావనమైనది ఇక్కడి ప్రతికొండ, ప్రతిచెట్టు, ప్రతిపుట్ట అన్నీ తపోదీక్షలో ఉన్న మహర్షులకు ప్రతిరూపాలే. ఎందరెందరో మహాత్ములకు కోరినది తడువుగా మోక్షాన్ని ప్రసాదించిన మోక్షధామ క్షేత్రం ఇది.

వైదిక సిద్ధాంత ప్రతిష్ఠాపన చేసిన త్రిమతాచార్యులలో ప్రథములు, అద్వైత సిద్ధాంత స్థాపకులు ఆదిశంకరాచార్యులు. వీరిని హైందవ ధర్మరక్షణకై అవతరించిన పరమేశ్వరుని అంశగా భావిస్తారు హిందువులు.

శ్రీ శంకరభగవత్పాదులవారు అహోబిల నృసింహస్వామివారికి విశేష భక్తులు. అతి చిన్న వయసులోనే సన్యాసాశ్రమాన్ని స్వీకరించిన శంకరాచార్యులు దేశాటనలో భాగంగా భారతీయ హైందవ ధర్మాన్ని ప్రచారం చేస్తూ ధర్మప్రతిష్ఠాపనకై సంచరించే రోజుల్లో శాస్త్రాలలో మహాపాండిత్యం కలవాడు, శంకరుల కంటే 30 సం॥ పెద్దవాడు అయిన మండనమిశ్రునితో శాస్త్రవాదనకు పూనుకున్నారు.

ఆ ఇరువురి అపారశాస్త్ర పరిజ్ఞానాన్ని, మహాపాండిత్యాన్ని నోళ్ళుతెరచి చూస్తూ ఆశ్చర్య చకితులైన న్యాయనిర్ణేతలకు ఎవరిది విజయమో నిర్ణయించేందుకు అసలు సాధ్యం కాలేదు.

మండన మిశ్రునిభార్య "ఉభయభారతి". ఆమె శంకరులతో వాదప్రతివాదానికి దిగాలనుకుంది. నిజానికి మండనమిశ్రుడు, ఉభయభారతి ఎవరోకాదు. ఇరువురూ బ్రహ్మ శారదలే. మరి శంకరాచార్యులు పరమేశ్వరుని అంశ. ఉభయభారతి శంకరాచార్య-మండనమిశ్రుల వాదప్రతివాదంలో



శంకరులదే విజయమని, అయితే అది సంపూర్ణవిజయం కాదనిచెబుతూ మండన మిశ్రునిలో సగభాగమైన తనను కూడా జయిస్తే అప్పుడే శంకరులకు సంపూర్ణవిజయం సిద్ధిస్తుందని పలికింది. శంకరులు ఆమెతో వాదానికి సిద్ధమైనారు. సకలశాస్త్రవాదప్రతివాదాలు అయిపోవడంతో ఉభయభారతి "దాంపత్యజీవనశాస్త్రాన్ని" వాదన అంశంగా ఎంచుకుంది. కానీ బాలసన్యాసి అయిన శంకరులకు ఆ శాస్త్రం అపరిచితం కనుక ఒక మాసం సమయం కోరి తర్వాత వచ్చి వాదప్రతివాదాలు జరుపుతామని అనుమతిని తీసుకొన్నారు. వ్రతభంగం కాకుండ శాస్త్రాధ్యయనం చేస్తానని చెప్పి తూర్పుదిశగా బయల్దేరాడు.

శంకరులు వంగదేశాన్ని చేరగానే ఊరిబయట ఒకదృశ్యాన్ని గమనించాడు. మరణించిన "అమరకుడు" అనే మహారాజుకు చితిపై నిప్పుపెట్టబోతుండగా అందమైన అతని భార్య రోదిస్తుండడం గమనించాడు. మహారాజు తన అందమైన భార్యతో శృంగారాలలో తేలియాడుతూ వుంటాడని విని, దగ్గరలోఉన్న ఒక గుహలోకి వెళ్ళి శిష్యులతో తాను ధ్యానముద్రలో వెళుతున్నానని శరీరాన్ని జాగ్రత్తగా కాపాడమని ఆదేశించి పరకాయ ప్రవేశం చేశారు. అంటే తన శరీరం నుండి ఆత్మతో మహారాజు శరీరంలో ప్రవేశించి చితిపైనుండి లేచి కూర్చున్నాడు.

మహారాణి ఆనందం పట్టలేక అమరకునికి మంగళస్నానం చేయించి తిరిగి అంతఃపురానికి తీసుకొచ్చింది. ఆ రాత్రి శయ్యను చక్కగా అలంకరించి రాజుతో శృంగార క్రీడల్లో తేలియాడాలనుకున్నది మహారాణి. కానీ అమరకుని శరీరంలో ఉన్న శంకరులు వ్రతభంగం కానివ్వక వారి స్పర్శకు కూడా దూరంగా ఉంటూ రాత్రంతా శృంగార రహస్యాలు, దాంపత్య రహస్యాలు సమస్తం తెలుసుకున్నారు.

శరీరం మాత్రమే అమరకునిది ఆత్మ శంకరులది. అంతకు మునుపెన్నడూ లేని తేజస్సు అమరకుని శరీరానికి ప్రాప్తించింది. అమరకుని

నడకలోను, నడతలోనూ కొంత మార్పురావడం రాణి గమనించింది. ఇక ప్రతిరోజు రాణి స్పర్శకు దూరముంటూ దాంపత్య రహస్యాలను తెలుసుకుంటున్నారు అమరకుని శరీరంలో ఉన్న శంకరులు. దాదాపు నెలయినా ఇదే తంతుకావడంతో రాణులు మంత్రికి విషయం తెలియజేశారు.

వెంటనే మంత్రి వేగులను పిలిచి చుట్టుప్రక్కలున్న రహస్యస్థావరాలలో ఎవరైనా మహాత్ములు నిశ్చల సమాధిలో ఉన్నారా? ఉంటే వారి శరీరంలో ప్రాణశక్తి ఉందా?లేదా? గమనించమని ఆదేశించారు. వేగులు శంకరుల శరీరమున్న ప్రాంతానికివచ్చి శిష్యుని ద్వారా విషయం తెలుసుకొని మంత్రికి తెలియజేశారు. మంత్రి ఆజ్ఞమేరకు సైన్యం ఎవరికీ తెలీకుండా శంకరుల శరీరాన్ని రాజ్యానికి దూరంగా దక్షిణ ప్రాంతంలోని అహోబిల ప్రాంతానికి తీసుకొచ్చి చితిపేర్చి దహనంచేశారు.

ఈ విషయం అమరకుని చెవిన పడడంతో అమరకుని శరీరంలోని శంకరులు ఆత్మశక్తితో తక్షణమే తమ శరీరాన్ని దహనంచేస్తున్న అహోబిల ప్రాంతాన్ని చేరుకున్నారు. కానీ అప్పటికే కాళ్ళు చేతులు కాలిపోయాయి. వెంటనే శరీరంలోనికి ప్రవేశించి క్రిందకు దొర్లారు.

వెంటనే ఆ క్షేత్రంలో వెలిసిన అహోబిల నారసింహస్వామిని గూర్చి దీనంగా భక్తిరసస్ఫోరకంగా స్తుతించడం ప్రారంభించారు. నరసింహ స్వామివారు అనుగ్రహించి శంకరులవారికి తిరిగి కాళ్ళుచేతులు ప్రసాదించారు.

శంకరులు కాశి చేరుకొని ఉభయభారతితో వాదోపవాదాలు జరిపి విజయాన్ని సాధించారు.

ఇలా ఆదిశంకరులు అహోబిల నారసింహస్వామిని గురించి చేసిన స్తోత్రమే "శ్రీ లక్ష్మీనృసింహ కరావలంబనస్తోత్రం". (ఆ స్తోత్రాన్ని కూడా నవనారసింహ స్తోత్ర కదంబంలో ముద్రించడమైనది) మనం ఇప్పుడు 'ప్రహ్లాదబడి' చెంతన ఉన్నాం.





## ప్రహ్లాద బడి

ఇక్కడ కనిపిస్తున్న చిన్న గుహనే "ప్రహ్లాదబడి" లేదా "ప్రహ్లాదబండ" లేదా "ప్రహ్లాదమెట్టు" అంటారు. హిరణ్యకశిపుని కుమారుడైన ప్రహ్లాదునికి రాక్షస కులగురువు శుక్రాచార్యుని పుత్రులైన చండామార్కులు ఇక్కడే విద్యాభ్యాసం చేయించారని ప్రతీతి. ఈ విషయాన్ని ఋజువు చేస్తూ ఇదిగో ఇక్కడున్న (రాళ్ళచప్టాలా) ఈ సహజ సిద్ధమైన బండమీద అక్షరాలతో పోలిన గీతలు కనిపిస్తాయి. వీటిలో కొన్ని కొన్ని అక్షరాలకు సామ్యత కనిపిస్తుంది. ఇక్కడే నరసింహస్వామి శాంతచిత్తుడై ప్రహ్లాదునికి సాక్షాత్కరించాడని పేర్కొంటారు.

ఇక్కడ కనిపిస్తున్నది ప్రహ్లాదబడి గుహాలయం. ఈ గుహాలయంలో శ్రీనరసింహస్వామివారిని ప్రహ్లాద సమేతంగా మనం దర్శిస్తున్నాం. ఈ గుహలోనికి ఒకసారికి 5 మంది మాత్రమే ప్రవేశించవచ్చు. ఈ గుహాలయం ఎదురుగా భవనాశినది చిన్న జలపాతం రూపంలో కొండలపైనుండి పడుతూ చూపరులను విశేషంగా ఆకర్షిస్తుంటుంది.

ఇప్పుడు మనం ప్రహ్లాదబడి నుండి 1/2 కి.మీ దూరంలో ఉన్న మాలోల నరసింహస్వామి ఆలయానికి పయనమవుదాం.

## 6. మాలోల నరసింహక్షేత్రం

ప్రహ్లాదబడి నుండి 1/2 కి.మీ ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదిస్తూ ప్రయాణం సాగిద్దాం. మాలోల నరసింహస్వామి క్షేత్రాన్ని మనం చేరుకున్నాం. అదిగో ఆలయ ఉపరిభాగంలో లక్ష్మీనరసింహస్వామివారు మనకు దర్శనమిస్తున్నారు. ఈ స్వామివారు వేదాద్రిపై వేంచేసియున్నారు. ఈ స్వామి సౌమ్యమూర్తి. ప్రశాంతచిత్తుడై సుందరవదనుడై శ్రీమహాలక్ష్మి అమ్మవారిని తమతొడపై కూర్చుకుపెట్టుకుని ఉన్నారు. 'మా' అనగా లక్ష్మి. లోల అంటే

అమిత ప్రియత్వం లేదా అమితమైనప్రేమ. అంటే శ్రీమహాలక్ష్మీదేవిపై అమితమైన ప్రేమను కలిగినస్వామి. అందుకే "మాలోలన్" అని కూడా ఈ స్వామిని పిలుస్తారు. ఈ క్షేత్రానికి "మార్కొండ లక్ష్మీ క్షేత్రమని" కూడా పేరు. బహుశా మార్కొండ -మారుకొండ- మరోకొండ అనే పదంనుండి వచ్చి ఉండవచ్చు. అహోబిలక్షేత్రం గరుడాచలం, వేదాచలం మధ్యభాగంలో వెలసిన క్షేత్రం. ఒక కొండ గరుడాద్రి కాగా మరోకొండ లేదా మరుకొండ వేదాద్రి. వేదాద్రిపైనే మాలోలనరసింహస్వామి ఆలయం ఉంది. అందుకేనేమో 'మార్కొండ లక్ష్మీనరసింహక్షేత్ర మని' ఈ క్షేత్రానికి పేరు వచ్చింది.

మనం ఇప్పుడు మాలోల నరసింహస్వామి ఆలయ ప్రాకారాన్ని దాటి ఆలయ ప్రవేశం చేస్తున్నాం. అదిగో గర్భాలయంలో కొలువుదీరివున్న మాలోల నరసింహస్వామివారు. ఆ లక్ష్మీనారసింహుని ఒక్కసారి దర్శించండి.

స్వామివారు ప్రసన్న వదనులై పై రెండు చేతులలో శంఖచక్రాలను ధరించివున్నారు. వామపాదాన్ని మడచి, దక్షిణ పాదాన్ని వంచి క్రిందకు వదలి సుఖాసీనులై వున్నారు. స్వామివారి ఎడమ తొడపై చెంచులక్ష్మీదేవి కూర్చుని అభయ వరద ముద్రలతో ఉండగా స్వామివారు ఎడమ చేతిని అమ్మవారి నడుము చుట్టుచుట్టి ఆలింగనం చేసుకున్నట్లుగా ఉంచి కుడిచేతిని అభయ ముద్రలో ఉంచి దర్శనమిస్తున్నారు. అదిగో లక్ష్మీదేవి పాదాలు భూమిలోనుండి పైకి మొలచివచ్చిన తామరపుష్పాన్ని ఆని వున్నాయి. స్వామివారి విగ్రహం వెనుకభాగాన మకరతోరణం కీర్తిముఖాన్ని కలిగిఉంది. ఒక్కసారి దర్శించండి. శ్రీవైష్ణవ సంప్రదాయం ప్రకారం లక్ష్మీదేవితో కూడుకున్న నరసింహస్వామికే ప్రాధాన్యమెక్కువ. అందుకే విశేషదినాలలో అహోబిలమఠం పీఠాధిపతులే స్వయంగా ఇక్కడకు వచ్చి స్వామివారికి పూజాదికాలు నిర్వహిస్తుంటారు.



**నమో నమో లక్ష్మీనరసింహా**
**నమో నమో సుగ్రీవనరసింహా ॥**

**వరద సులభ భక్తవత్సల నరసింహా**
**నరమృగవేష శ్రీ నరసింహా**
**పరమపురుష సర్వ పరిపూర్ణ నరసింహా**
**గిరిగుహావాస సుగ్రీవనరసింహా ॥**

**భయహర ప్రహ్లాదపాలన నరసింహా**
**నయనత్రయారవింద నరసింహా**
**జయ జయ సురమునిసంస్తుత నరసింహా**
**క్రియా కలాప సుగ్రీవనరసింహా ॥**

**అతి కృపానిలయ మోహనరూప నరసింహా**
**నత పితామహ ముఖ్య నరసింహా**
**సతత శ్రీ వేంకటేశ్వర దివ్యనరసింహా**
**కితవారిభంజన సుగ్రీవనరసింహా ॥**

అర్చకులు సమర్పిస్తున్న కర్పూర నీరాజనాల కాంతిలో దేదీప్యమానంగా వెలుగొందుతున్న శ్రీ లక్ష్మీనారసింహులను ఒక్కసారి స్మరించండి.

**"ప్రణమామి రమాచిత్త - సరసీరుహబంభరం**
**మాలోల నరసింహాఖ్యం - వేదాద్రి కందరస్థితం"**

**-మాలోల నృసింహా! భక్తవరద గోవిందా.....గోవింద.**

స్వామివారి హారతి తీర్థప్రసాదాలను సేవించి ఆలయంనుండి బయటకు నడుద్దాం. ఈ క్షేత్రాన్ని "లక్ష్మీవనం" అని పిలుస్తారట. కవిత్రయంలో చివరివాడైన ఎఱ్ఱన నృసింహపురాణంలో ఈ అంశాన్ని ప్రస్తావించాడు. స్వామివారు తమతొడపై చెంచులక్ష్మీదేవికి స్థానం ఇవ్వడం గమనించిన

ఇక్కడున్న వనంలో తపస్సు చేసిందట. అందుకే ఈ క్షేత్రానికి లక్ష్మీవనం అని పేరువచ్చింది.

ఇదొక ప్రశాంతమైన, సుందరమైన, ఆహ్లాదకరమైన స్థలం. ధ్యానం, యాగం, తపస్సు చేసుకొనేవారికి అనువైనప్రాంతం.

ఇక్కడినుండి వరాహనృసింహ క్షేత్రం. 1/2 కి.మీ. అక్కడి నుండి ఎగువ అహోబిలం 1 కి.మీ. మనం ఇప్పుడు వరాహనృసింహ క్షేత్రం గుండా తిరిగి ఎగువ అహోబిలానికి చేరుకుందాం.

## 7. పావన నరసింహ క్షేత్రం

మనం ఇప్పుడు ఎగువ అహోబిలానికి దక్షిణంగా దాదాపు 6 కి.మీ దూరంలో వెలసిన పరమపావనక్షేత్రం పావననృసింహ లేదా పాములేటయ్య క్షేత్రానికి పయనమవుదాం. ఈ ఆలయాన్ని చేరుకొనేందుకు దట్టమైన అడవిలో, కొండదారిలో నడవాల్సి వుంటుంది. పరమ పావనమూర్తి అయిన ఆ పావన నృసింహుని మనసారా ధ్యానిస్తూ ముందుకు నడుద్దాం.

ఇదే "పావని" నది. ఈ పావని నదీతీరాన వెలసిన నరసింహస్వామి కనుకనే పావన నరసింహస్వామి అయినాడు. పావనినది ఈ ప్రాంతంలో ఒక పాము మెలికలాగా మెలితిరిగి ప్రవహిస్తూంది. ఒక్కసారి గమనించండి.అందుకే ఈ స్వామికి పాములేటి స్వామి అనికూడాపేరు. పూర్వం భరద్వాజ మహర్షి ఈ క్షేత్రంలో తపస్సుచేసి స్వామి సాక్షాత్కారాన్ని పొంది పరమ పావనుడైనాడట.

అదిగో ఆలయం ముందు మనకు కనిపిస్తున్నది సమున్నతమైన ధ్వజస్తంభం. ధ్వజస్తంభం ఉందంటే ఇక్కడ నిత్యోత్సవ వారోత్సవ వార్షికోత్సవ విశేష ఉత్సవాలు జరుగుతాయని తెలుస్తోంది. ధ్వజస్తంభంపైనున్న గరుడాళ్వార్ వారిని నమస్కరించుకొని ఆలయప్రవేశం చేద్దాం రండి.





అదిగో ఆలయంలో కొలువుదీరివున్న పావన నరసింహస్వామి. ప్రక్కనే గోపాలకృష్ణుడు, నవనీతకృష్ణుడు, వరదరాజస్వామి, ఆంజనేయస్వామివారిని పావన నరసింహమూర్తిని ఒక్కసారి గమనించండి.

స్వామివారు ఆదిశేషునిపై సుఖాసీనులై ఉన్నారు. ఏడుతలల ఆదిశేషుడు స్వామివారికి ఛత్రం పట్టినట్లుగా ఉన్నాడు. స్వామివారు కుడికాలు కొంచం వంచి ఎడమకాలిని దానిపై వేసుకొనివున్నారు. ఎడమ తొడపై మహాలక్ష్మిఅమ్మవారు కుడిచేతితో స్వామివారిని పట్టుకొని ఎడమ చేతితో అభయాన్ని ప్రసాదిస్తూండగా స్వామివారు పైరెండు చేతులలో శంఖచక్రాలను ధరించి మరోరెండు చేతులలో ఎడమ చేతిని అమ్మవారి కటిచుట్టూ తిప్పి, కుడిచేతిని అభయముద్రలో వుంచి దర్శనమిస్తున్నారు.

**నమిత దేవం భజే నారసింహం**
**సుముఖ కరుణేక్షణం సులభ నరసింహం ॥**

**విజయనరసింహం వీరనరసింహం**
**భుజబలపరాక్రమ స్ఫుట నృసింహం**
**రజనీచర విదళన విరాజిత నృసింహం**
**సుజనరక్షక మహాశూర నరసింహం ॥**

**దారుణ నృసింహం ప్రతాప నరసింహం**
**చారుకల్యాణ నిశ్చల నృసింహం**
**ధీరచిత్తావాస దివ్య నరసింహం**
**సారయోగానంద చతుర నరసింహం ॥**

**విమల నరసింహం విక్రమ నృసింహం**
**కమనీయ గుణగణాకర నృసింహం**
**అమిత సు శ్రీవేంకటాద్రి నరసింహం**
**రమణీయ భూషాభిరామ నరసింహం ॥**

తనివితీరా స్వామివారిని దర్శిస్తూ స్తుతిద్దాం.

**"పావనీతట సౌందర్య - వాసినం భయనాశనం**
**శ్రీపావన నృసింహాఖ్యం - స్వామినం ప్రణమామ్యహం॥**

**పావన నృసింహ వరద గోవిందా.....గోవింద....**

తీర్థ ప్రసాదాలను స్వీకరించి ఆలయం బయటకు నడుద్దాం. స్వామివారి ఆలయం ఎదురుగా శివాలయం కూడా మనకు కనిపిస్తుంది. ఒక్కసారి దర్శించండి.

శ్రీ పావననృసింహస్వామివారికి బ్రహ్మోత్సవాలు మొదలు నృసింహజయంతి వరకు ప్రతిశనివారం ఉత్సవాలు జరుగుతాయి.

ఇక్కడికి కొద్ది దూరంలోనే చెంచుల నివాసస్థానం ఉంది. వారు ఈ నాటికి తమ భాషలో చెంచులక్ష్మీ నరసింహుల కల్యాణగాథను చక్కటి శైలిలో పాడుతారు.

మనం ఇప్పుడు తిరిగి కాలినడకన వచ్చిన దారిలోనే ఎగువ అహోబిలం చేరుకొని అక్కడినుండి దిగువ అహోబిలం చేరుకుందాం. అక్కడ మనం చూడవలసిన మరో రెండు క్షేత్రాలున్నాయి సుమా!

## 8. యోగానంద నరసింహక్షేత్రం

దిగువ అహోబిలానికి ఆగ్నేయదిశగా 2 కి.మీల దూరంలోని అరణ్య ప్రాంతంలో యోగానంద నారసింహస్వామివారు కొలువైవున్నారు. హిరణ్యకశిప సంహారానంతరం నరసింహస్వామివారు ఈ క్షేత్రంలో ప్రహ్లాదునికి యోగవిద్యను ప్రసాదించారట. యోగం అనగా తపస్సు. యోగానందంలో మునిగివున్నందువల్ల ఈ స్వామివారికి యోగ నారసింహస్వామి అని పేరు. మరోకథనం ప్రకారం మనోచాంచల్యం పొందిన బ్రహ్మదేవుడు ఈ క్షేత్రంలో స్వామివారిని ఆశ్రయించి తపస్సుచేసి మనఃస్థిరత్వాన్ని సాధించాడట. అంతేకాదు ఈ క్షేత్రం ఎందరో యోగులకు



దేవతలకు, మునులకు నిలయం. ఆలయ ప్రవేశమార్గంలోనే యోగాసనరీతిలో కొలువైనస్వామివారి విగ్రహంతో కూడిన స్వాగత తోరణం మనకు కనిపిస్తుంది. ఈ ఆలయ మార్గం మట్టిరోడ్డుతో కూడికొని వాహనాల రాకపోకలకు కొంత అనుకూలంగానే ఉంటుంది. మనం ఇప్పుడు యోగనరసింహస్వామివారి ఆలయ ప్రవేశం చేస్తున్నాం. గర్భాలయంలో యోగముద్రలో కొలువైయున్న చతుర్భుజుడైన స్వామివారిని ఒక్కసారి చూడండి.

దాదాపు 2 అడుగుల ఎత్తైన గరుడ వాహనంపై యోగాసనస్థితిలో యోగపట్టాన్ని ధరించి రెండు చేతులను రెండు మోకాళ్ళపై ఉంచి, మరోరెండు చేతులలో శంఖచక్రాలను ధరించి ప్రశాంత చిత్తంలో వెలుగొందే ఆ స్వామి వారి దివ్యమంగళ మనోజ్ఞమూర్తిని ఒక్కసారి వీక్షించండి.

**"యోగాసన ముద్రాయాం చ దర్శనం దీయతే సదా**
**యోగానందనృసింహాఖ్యం - తం నమామి నృకేసరిం ॥"**

తీర్థ ప్రసాదాలను స్వీకరించి, ఆ యోగనృసింహుని మదిలో నిలుపుకొని బయటకు నడుద్దాం.

ఇక ఇప్పుడు చిట్ట చివరగా ఛత్రవట నారసింహస్వామివారిని మనం దర్శించుకుందాం. రండి.

## 9. ఛత్రవట నృసింహక్షేత్రం

యోగానంద నారసింహాలయానికి మరో రెండు కి.మీల దూరంలో కొలువై ఉన్నారు ఛత్రవట నారసింహస్వామివారు. అయితే రహదారి పైనుండి ఒక ఫర్లాంగు కొండదారిన నడిచి వెళ్ళి స్వామిని దర్శించాల్సిందే. వట - అంటే మఱ్ఱి, ఛత్రం అంటే గొడుగు. మఱ్ఱిచెట్టుకొమ్మలనే గొడుగు నీడన విలసిల్లిన స్వామి ఈ ఛత్రవట నారసింహస్వామి. అహోబల క్షేత్రంలో కొలువైన అన్ని నరసింహస్వామిఆలయాల్లోని విగ్రహాలకంటే ఈ ఆలయంలోని స్వామివారి విగ్రహం విలక్షణంగా కనిపిస్తుంది.

ఛత్రవట నారసింహస్వామివారి ఆలయంలోనికి మనం ఇప్పుడు ప్రవేశిస్తున్నాం. స్వామివారి గర్భాలయానికి ముందు ఆరు స్తంభాలతో కూడుకున్న ముఖమండపాన్ని మనం ఇక్కడ చూడవచ్చు. అడుగున దీర్ఘచతురస్రాకారంలో ఉండి పైకి వెళ్ళేకొద్దీ స్తంభాకృతిలో కనిపించడం ఈ ఆరుస్తంభాల ప్రత్యేకత. వీటిపై మనం నరసింహస్వామివారి శిల్పాలను, ఆంజనేయస్వామివారి శిల్పాలను దర్శించవచ్చు.

ఇదే స్వామివారు కొలువైవున్న గర్భాలయం. గర్భాలయం మధ్య భాగంలో కొలువైయున్న స్వామివారిని ఒక్కసారి గమనించండి. పద్మపీఠంపై పద్మాసనం వేసుకొని కూర్చున్నారు స్వామివారు. చతుర్భుజుడైన స్వామి పైరెండు చేతులలో శంఖ చక్రాలను ధరించివున్నారు. కుడిచేతిని అభయముద్రలో వుంచి ఎడమచేతిని సంగీతాన్ని వింటూ తాళంవేస్తున్న చందంగా వుంచారు. స్వామివారికిరీటం, కంఠాభరణం, భుజకీర్తులు, యజ్ఞోపవీతం స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఎంతటి మనోహరమైన స్వరూపంతో స్వామివారు అలరారుతున్నారో వీక్షిస్తూ...

**ఛత్రాకార వటచ్ఛాయా - శోభితం నరకేసరిం**

**నమామి పద్మపీఠస్థం - యజ్ఞోపవీత ధారిణం"** అంటూ ప్రార్థిద్దాం. పూర్వం మేరుపర్వత వాసులైన హాహా - హూహూ అనే గంధర్వ రాజులిరువురు ఈ స్వామివారిని తమ మధురగానంతో కీర్తించారట. వారి గాన మాధుర్యానికి సంతసించిన స్వామివారు "మీరిరువురు ముల్లోకాలలోను నిరుపమానమైన గాయకులై వెలుగొందుదురు గాక" అని వరాన్ని ప్రసాదించాడట. అటువంటి గానలోలుడైన స్వామివారిని మనం కూడా మనకు తోచిన కీర్తనను గానంచేసి స్వామివారి అనుగ్రహానికి పాత్రుల మవుదాం. అన్నమాచార్యులువారు కీర్తించిన నారసింహవైభవాన్ని మనమూ నోరారా ఆలపిద్దాం.



**జయము జయము ఇక జనులాల**
**భయములు వాసెను బ్రదికితి మిపుడు ॥**

**ఘన నరసింహుడు కంభమున వెడలె**
**దనుజులు సమసిరి ధర వెలసె**
**పొనిగె నధర్మము భూభారమడగె**
**మునుల తపము లిమ్ముల నీడేరె ॥**

**గరిమతో విష్ణుడు గద్దెపై నిలిచె**
**హిరణ్యకశిపుని నే పడచె**
**అరసి ప్రహ్లాదుని అన్నిటా మన్నించె**
**హరుడును బ్రహ్మాయు అదె కొలిచేరు ॥**

**అహోబలేశుడు సిరినంకమున ధరించె**
**బహుగతి శుభములు పాటిల్లె**
**ఇహపరము లొసగె నిందును నందును**
**విహరించెను శ్రీ వేంకటగిరిని ॥**

సంకీర్తనాలాపనతో స్వామివారి అనుగ్రహానికి మనం పాత్రుల మయ్యాం. ఇక్కడికి మన అహోబిల నవనారసింహ క్షేత్రదర్శనం పూర్తయ్యింది. ఇక్కడినుండి తిరిగి దిగువ అహోబిలాన వెలసిన లక్ష్మీనారసింహుని మరొక్కమారు సందర్శించి స్వామి నీ అనుగ్రహంవల్ల నవనారసింహ క్షేత్రాలను దర్శించగలిగాను పునర్దర్శన భాగ్యాన్ని నాకు ప్రసాదించమని ప్రార్థిద్దాం.

**నవనారసింహ గోవిందా.....గోవింద**
**లక్ష్మీనారసింహ గోవిందా....గోవింద**
**అహోబిల నారసింహ గోవిందా....గోవింద.**

* * *



శ్రీదేవి భూదేవి అమృతవల్లి నాయికా సమేత
ప్రహ్లాదవరద స్వామివారు



శ్రీ, భూ, చెంచులక్ష్మీనాయికా సమేత జ్వాలా నరసింహస్వామివారు,
45వ పీఠాధిపతి శ్రీశ్రీ నారాయణ యతీంద్ర మహాదేశికన్ స్వామి మరియు
ప్రస్తుత పీఠాధిపతి శ్రీశ్రీ రంగనాథ యతీంద్ర మహాదేశికన్ స్వామివారు



దిగువ అహోబిల ఆలయ విహంగవీక్షణం



వేదాద్రి గరుడాద్రి పర్వతాలమధ్య నెలకొనివున్న
ఎగువ అహోబిలేశుని ఆలయ గాలిగోపురం

## నవనారసింహక్షేత్ర పరిసరసందర్శిని

అహోబిల నవనారసింహక్షేత్రం అనాదిగా ప్రాచుర్యాన్ని పొందింది. ఎందరో రాజులు, ఎందరో చక్రవర్తులు, ఇంకెందరో భక్తవరేణ్యులు, మరెందరో సంకీర్తనాచార్యులు, కవులు, పండితులు, ఈ క్షేత్రాన్ని దర్శించి స్వామివారికి అనేక కైంకర్యాలను సమర్పించుకున్నారు. అనేక మంటపాలు, నిర్మించారు. కీకారణ్యం కారణంగా స్వామివారిని దర్శించేందుకు విచ్చేసే భక్తులకు సకలసౌకర్యాలు కల్పించారు. వాటిలో ప్రధానమైనవాటిని దర్శించేందుకు క్షేత్ర పరిచయం ఉన్నవారిని, అవగాహన ఉన్నవారిని, వెంట ఒక గైడుగా తీసుకు వెళ్ళడం శ్రేయస్కరం. లేదంటే కీకారణ్యంలో తప్పిపోయే ప్రమాదం ఉంది.

రుద్రవరం మరియు అహోబిలం గ్రామ చరిత్రలను (కైఫియత్తులను) పరిశీలిస్తే ఎగువ దిగువ అహోబిలాల్లో ద్వాదశ మండపాలు, ద్వాదశ తీర్థాలు, అష్టపుష్కరిణులతో, పాటుగా 10 సత్రాలున్నట్లు ఆధారాలు లభిస్తున్నాయి. వీటిని గురించి సంక్షిప్తంగా తెలుసుకుందాం.

### ద్వాదశ మంటపాలు

**1. వసంత మండపం–** దిగువ అహోబిలానికి ఒకఫర్లాంగు దూరంలో ఈ మండపం ఉంది. క్రీ.శ. 1548 దాన శాసనం ప్రకారం మహా మండలేశ్వరుడు గొబ్బూరి ఓబయ్యగారి సతీమణి నరసమ్మగారు దిగువ తిరుపతి (అహోబిలం)కి ఉత్తరదిక్కున ఈ వసంతమంటపాన్ని నిర్మించినట్లు తెలుస్తున్నది. దానితో పాటుగా 120 వరహాల మూలధనాన్ని సమర్పించి ఆ ధనంపై వచ్చే వడ్డీని స్వామివారి విశేష ఉత్సవాలలో ఈ మంటపానికి విచ్చేసే ఉభయదేవేరీ సహిత ప్రహ్లాద వరద స్వామివారి నైవేద్య కైంకర్యాలకు వినియోగించాలని ఈ శాసనం ద్వారా తెలుస్తుంది.



**2. ఊయల మండపం/ఊంజల్ మండపం–** ఈ మండపం సన్నిధి వీధిలోని రాజగోపురానికి ఎదురుగా ఉంది. ఈ మండపం విజయనగర శిల్పకళా శైలిలో కనిపిస్తుంది. ఈ మండపంలో స్వామివారికి అమ్మవారికి అరుదుగా ఊంజల్‌సేవ/డోలోత్సవాన్ని నిర్వహిస్తుంటారు. 4 స్తంభాలు కలిగిన ఈ మండపం చతురస్రాకార పీఠంతో స్తూపాకారంగా, పద్మబంధాన్విత ఉపరిభాగాన్ని కలిగివుంది.

**3. కొలువు మండపం–** బస్సులు ఆగే స్థలం ప్రక్కనే ఈ కొలువు మండపం దర్శనమిస్తుంది. విజయనగర రాజుల శిల్పశైలిలో రమణీయంగా మలచబడిన ఈ మండపానికి పండుగ సందర్భాలలో స్వామివారిని ఊరేగింపుగా తెచ్చి ఇక్కడ కొలువు దీరుస్తారు.

**4. విష్వక్సేన మండపం–** అహోబిలం నుండి ఆళ్ళగడ్డవైపు రోడ్డు మార్గానికి మరోప్రక్కన చతురస్రాకారంలో నిర్మితమైన ఈ మండపం స్తంభాల శిల్పకళను బట్టి చూస్తే ఇది విజయనగర శిల్పకళగా తెలుస్తుంది. 5అడుగుల ఎత్తైన అధిష్టానం చుట్టూ నృత్యభంగిమలతోకూడిన శిల్పకళతో సర్వాంగ సుందరంగా మలచబడింది. విశేషఉత్సవాల సందర్భంగా సర్వసైన్యాధిపతియైన విష్వక్సేనులవారిని ఉత్సవంగా తీసుకువచ్చి ఈ మండపంలో పూజాకార్యక్రమాలను నిర్వర్తిస్తారు.

**5. మృత్సంగ్రహణ మండపం–** విష్వక్సేన మండపానికి దగ్గరలోనే ఈ మృత్సంగ్రహణ మంటపం నిర్మించబడింది. బ్రహ్మోత్సవాల సందర్భంగా జరిగే అంకురార్పణ కార్యక్రమానికి కావలసిన మృత్తికను ఈ మండపం వద్దనుండి తీసుకెళుతారు. ఆలయ అర్చకులు మేళతాళాలతో విచ్చేసి ఇక్కడి మట్టిని వెండిపళ్ళెంలో సంగ్రహించుకొని తీసుకెళ్ళి అంకురార్పణ కార్యక్రమాన్ని నిర్వర్తిస్తారు.

**6. బీగాల ఆంజనేయస్వామి మండపం-** రథవీధిలో చతురస్రాకార నిర్మిత ఈ మండపాన్ని ఇటీవలి కాలంలో జీర్ణోద్ధరణ చేశారు. ఈ మండప మధ్యభాగంలో దాదాపు 6అడుగుల ఆంజనేయస్వామివారి విగ్రహం ప్రతిష్ఠించబడివుంది. ఇక్కడే ఆంజనేయస్వామివారి ఉత్సవ విగ్రహంకూడా కనిపిస్తుంది. అహోబిల నృసింహస్వామివారికి రాత్రి ఏకాంతసేవ అనంతరం ఆలయ బీగాలు (తాళాలు) ఈ ఆంజనేయస్వామివారి పాదాలచెంత ఉంచుతారు. తిరిగి మర్నాడు ఉదయం ఆలయ ప్రధానార్చకులు వీటిని తీసుకెళ్ళి ద్వారాలు తెరచి శుద్ధి, సుప్రభాతసేవలు నిర్వహించడం అనాదిగా వస్తున్న సంప్రదాయం. స్వామివారి ఆలయబీగాలు క్షేత్రపాలకుడైన ఆంజనేయస్వామివారి ముందు భద్రపరుస్తారు. కనుకనే ఈ ఆంజనేయస్వామివారిని బీగాల ఆంజనేయస్వామి అంటారు.

**7. దూరుడు మండపం-** క్రీ.శ. 1553లో శ్రీశ్రీశ్రీ కురిచేటి వేంకటాద్రిదేవ మహారాజలవారిచే అహోబిలక్షేత్రానికి అరణ్యమార్గంలో నడిచి వచ్చే యాత్రికుల కోసం నిర్మితమైనది ఈ దూరుడు మండపం. ఈ మండపానికి ఇరువైపులా ఎనిమిదేసి స్తంభాలు మొత్తం 16 స్తంభాలతో ఈ మండపాన్ని నిర్మించారు. ఈ మండపానికి ఇరువైపులా ఏపుగా పెరిగిన వివిధరకాల వృక్షాలు కాలినడకన వచ్చే యాత్రికులకు కొంత విశ్రాంతిని కల్పిస్తాయి. సేదతీరుస్తాయి. బ్రహ్మోత్సవాల సందర్భంగా కానుకలను భద్రపరిచినందుకు కట్టడిగా యిరవై వరహాలు సోలిపుట్టుగా చెల్లించేవారని ఇక్కడ శ్రీశ్రీశ్రీ కురిచేటి వేంకటాద్రి దేవమహారాజులవారు వేయించిన శాసనాన్నిబట్టి తెలుస్తున్నది. పూర్వం బ్రహ్మోత్సవాల సమయంలో కాంచీపురంనుండి విచ్చేసే స్వామివారి ఉత్సవమూర్తులు ఇక్కడ కాసేపు ఆగేవనికూడా ఈ శాసనం ద్వారా అర్థమవుతుంది.



**8. రఘుపతి మండపం-** క్రీ.శ.1558లో ఈ రఘుపతి మండపాన్ని మహామండలేశ్వరులు శ్రీశ్రీశ్రీ కురిచేటి తమ్మరాజప్రభువులంగారు నిర్మించారు. చతురస్రాకార రీతిలో నిర్మించిన ఈ మండప స్తంభాలపై మలచిన శిల్పాలను బట్టి చూస్తే ఇది విజయనగర శైలిలో ద్రవిడ సంప్రదాయ రీతిలో మలచబడి అద్భుతంగా నగిషీలు దిద్దినట్లు కనిపిస్తాయి. ఈ మండపం మధ్యలో దాదాపు 4 అడుగుల ఎత్తైన ఆంజనేయస్వామివారి విగ్రహం ప్రతిష్ఠించబడింది. ఈ మండపం వద్దనున్న దానశాసనాన్ని అనుసరించి శ్రీశ్రీశ్రీ శఠగోపజీయ్యర్‌గారు కొంత భూమిని స్వామివారి కైంకర్యాల నిమిత్తం విరాళంగా సమర్పించినట్లు విశదమవుతూంది.

**9. భైరవ మండపం-** మాలోల నృసింహస్వామి ఆలయానికి అరణ్యంగుండా వెళ్ళే నడక దారిలో మెట్లమార్గానికి పశ్చిమదిక్కున భైరవ గుండానికి ఎదురుగా 16 స్తంభాలతో కూడిన భైరవమండపం కనిపిస్తుంది. ఈ మండప మధ్యభాగంలో మరో 4 స్తంభాలతోకూడిన మండపం, అందులో ధ్యానముద్రలో కూర్చొనిఉన్న శ్రీవన్‌శఠగోపజీయర్‌గారి విగ్రహం ప్రతిష్ఠించబడింది.

**10. ఉద్యోగ మండపం-** ఎగువ అహోబిల క్షేత్రపర్వతపంక్తులతో చుట్టబడిన సమతల ప్రదేశానికి పశ్చిమభాగాన నిర్మించిన ఈ మండపం బహుశా విజయనగర ప్రభువులు అవసానదశలో నిర్మించబడివుండవచ్చు.

**11. కాలక్షేప మండపం-** ఈ మండపం ఎగుఅహోబిలంనుండి అరకిలోమీటరు దూరంలో వరాహనృసింహాలయానికి వెళ్ళేమార్గంలో నిర్మించబడినది. దాదాపు 116 స్తంభాలు కలిగిన ఈ మండపానికి పశ్చిమంవైపు మాత్రం రాతిగోడ నిర్మితమైవుంది. ఈ మండపం 11వ శతాబ్దం నుండి 15వ శతాబ్దాల మధ్యకాలంలో నిర్మింపబడి ఉండవచ్చునని భావిస్తున్నారు.

**12. వరాహ మండపం-** కాలక్షేప మండపానికి కొంతదూరంలో వరాహనృసింహస్వామి ఆలయం ప్రక్కనే ఈ మండపం కనిపిస్తుంది. 16 స్తంభాలతో కూడిన ఈ మండపంలోని శిల్పకళను బట్టి ఇది 16-17 శతాబ్దాలలో నిర్మితమై వుండవచ్చు. ఈ మండపం ప్రస్తుతం జీర్ణావస్థకు చేరుకుంది.

## ద్వాదశ తీర్థాలు

నవనారసింహ క్షేత్రంలో అత్యంత ప్రసిద్ధిచెందిన 12 తీర్థరాజములు విరాజమానమై భక్తుల పాపాలను పరిహరిస్తున్నాయి. అవి.

1. భైరవ తీర్థం 2. నరసింహతీర్థం 3. వరాహతీర్థం 4. చూతతీర్థం
5. సుదర్శనతీర్థం 6. వినాయకతీర్థం 7. ధారాతీర్థం 8. శంఖుతీర్థం
9. గజేంద్రతీర్థం 10. రామలక్ష్మణతీర్థం 11. భీమతీర్థం 12. రక్తతీర్థం.

ఈ తీర్థరాజాలలో కొన్నింటిని మాత్రమే మనం దర్శించగలం. తక్కినవన్నీ దర్శించడం అత్యంత క్లిష్టతతో కూడుకున్నపని. కారణం కొన్ని భీకరమైన నల్లమల అడవిలో వుండడం, మరికొన్ని వర్షాకాలంలో మాత్రమే కనిపించడం. ఏది ఏమైనా మనకు అనువుగావున్న భైరవతీర్థం వంటివాటిలోనే తక్కిన తీర్థరాజాలు ఉన్నట్లు అనుసంధానం చేసుకొని స్నానమాచరించడం ద్వారా ద్వాదశతీర్థ స్నానఫలం లభిస్తుందని పెద్దలు చెబుతారు.

## అష్ట పుష్కరిణులు

యాత్రికుల సర్వఉపయోగాల కొరకు కొందరు భక్తులు నవనారసింహ క్షేత్రాలలో అక్కడక్కడ 8 చిన్న పుష్కరిణిలు లేదా కొనేర్లను నిర్మించారు. వీటిలో 4 కోనేర్లు దిగువ అహోబిలంలోను, 3 కోనేర్లు ఎగువ అహోబిలంలోనూ, 1. మాలోల నృసింహ క్షేత్రంలోనూ దర్శనమిస్తాయి.



### దిగువ అహోబిలంలోని పుష్కరిణులు

**1. సన్నిధి పుష్కరిణి/కోనేరు :** దిగువ అహోబిలం ప్రహ్లాద వరద లక్ష్మీనృసింహుని ఆలయానికి వెళ్ళే మార్గంలో దక్షిణదిశలో కనిపించే కోనేరే సన్నిధిపుష్కరిణి. ఈ సన్నిధి పుష్కరిణి చుట్టూ ఉన్న రాతి మంటపాలలో పూర్వం వేదపాఠశాలను నిర్వహించేవారు. నిత్యం వేదాధ్యయనంతో పునీతమైన ఈ పుష్కరిణి నేడు జీర్ణావస్థకు చేరుకున్నది. నీటిప్రవాహం లేకపోవడంతో దుర్గంధభరితంగా ఉండేది. ప్రస్తుత అహోబిలమఠాధీశులకు ముందున్న పీఠాధిపతి శ్రీశ్రీశ్రీ అదివన్ నారాయణయతీంద్ర మహాదేశికన్ స్వామివారికాలంలో ఈ పుష్కరిణిలో నీటినంతటినీ తొలగించి శుభ్రం చేయించి పునర్నిర్మించడం జరిగింది.

**2) ఆళ్వార్ పుష్కరిణి :** దిగువ అహోబిల ఆలయానికి పశ్చిమదిశలో దాదాపు 2 కి.మీల దూరంలో ఈ ఆళ్వార్ కోనేరు ఉన్నది. విశాలంగా ఉండే ఈ పుష్కరిణి నిర్మాణం శ్రీకృష్ణదేవరాయల కాలంలో ప్రారంభించబడి, సదాశివరాయల కాలంలో పూర్తయ్యింటుందని చరిత్రకారులు చెబుతారు. బ్రహ్మోత్సవ సందర్భాలలో ఈ పుష్కరిణి విశేష సేవలందిస్తూంది. చుట్టూ మెట్లను కలిగిఉన్న ఈ పుష్కరిణిలోనికి వర్షపునీటిని కోనేటిచుట్టూ ఉన్న ఆళ్వార్ కట్ట శుద్ధిచేసి పంపుతుంది. ఈ పుష్కరిణిచుట్టూ పశుపక్ష్యాదుల కొరకు నీటితొట్టిలు నిర్మితమై ఉన్నాయి.

**3) లంజ కోనేరు :** దిగువ అహోబిలఆలయానికి ఈశాన్యదిశలో కొద్దిదూరంలో ఈ కోనేరు కనిపిస్తుంది. స్వామివారి భక్తురాలైన ఒక దేవదాసి ఈ కోనేటిని నిర్మించిన కారణంగా జానపదులు ఈ కోనేటిని 'లంజ కోనేరు'గా వ్యవహరిస్తారు.

**4) భార్గవ పుష్కరిణి :** దిగువ అహోబిలంలోని కోనేర్లన్నిటిలోనికి సహజసిద్ధమైన నీటిబుగ్గ ఉన్న కోనేరు ఇది. ఇందులో నీరు ఎప్పుడూ

స్వచ్ఛంగా ప్రవహిస్తుంటాయి. దిగువ అహోబిల ఆలయానికి 3 కి.మీల దూరంలో ఉన్న భార్గవనృసింహస్వామి ఆలయపరిసరాలలో దట్టమైన అరణ్యంలో ఈ భార్గవ పుష్కరిణి నెలవైయుంది. దిగువ అహోబిలంలోని 4 పుష్కరిణిల్లో ఈ భార్గవ పుష్కరిణి చిన్నది. ఈ పుష్కరిణిని శ్రీశ్రీశ్రీ ఆదివన్ పరాంకుశ శఠకోపయతీంద్ర మహాదేశికన్‌వారు నిర్మించారు.

**ఎగువ అహోబిలంలోని పుష్కరిణులు**

**5) ఆకుల పాపయ్య పుష్కరిణి :** ఆకుల పాపయ్య అనే భక్తుడు ఎగువ అహోబిలం మార్గంప్రక్కనే ఈ కోనేరును త్రవ్వించాడు. ప్రస్తుతం ఈ కోనేరు నిర్జలమయమైపోయింది.

**6) ఉత్తమడుగు కోనేరు :** దిగువ అహోబిలం నుండి ఎగువ అహోబిలానికి వెళ్ళేమార్గంలో 5 కి.మీల దూరంలో రోడ్డు మార్గానికి ప్రక్కనే ఈ కోనేరు కనిపిస్తుంది.

**7) సన్నిధి పుష్కరిణి :** ఎగువ అహోబిలం ఆలయానికి వెళ్ళే మెట్లమార్గం ప్రక్కనే మూడువైపులా మెట్లతో ఈ సన్నిధి పుష్కరిణి నిర్మితమైవుంది. ఈ పుష్కరిణికి ఎదురుగా కొండక్రింద 16 స్తంభాలతో కూడిన మంటపం ఉంది. ఈ రెండుకూడా కొండను ఆధారం చేసుకొని నిర్మితం కావడం విశేషం.

**8) చిన్న కోనేరు :** ఈ కోనేరు మాలోలనృసింహస్వామి ఆలయానికి ప్రక్కన ఎగువ అహోబిలానికి 2 కి.మీల దూరంలో నిర్మించబడింది.

## ధర్మసత్రాలు

పూర్వం అహోబిలక్షేత్రంలో జరిగే ధనుర్మాస ఉత్సవాలు, సంక్రాంతి ఉత్సవాలు, పారువేట ఉత్సవాలు, బ్రహ్మోత్సవాలు మొదలైన ఉత్సవాల సందర్భంలో విచ్చేసే భక్తుల భోజన, వసతి, సౌకర్యాల నిమిత్తం కొందరు



ధర్మసత్రాలు నడిపేవారు. అహోబిల గ్రామ చరిత్ర, శాసనాల ఆధారంగా పూర్వం 10 సత్రాలుండేవని తెలుస్తున్నది. అవి :

| | |
|---|---|
| 1) పాపాలమ్మ సత్రం | 2) కొండారెడ్డి సత్రం |
| 3) గ్రంధిగురువయ్య సత్రం | 4) కోటపాడు సత్రం |
| 5) ఓబులంపల్లి సత్రం | 6) సుద్దపల్లి లక్ష్మమ్మ సత్రం |
| 7) పెద్ద పసువుల సత్రం | 8) చెంచయ్య సత్రం |
| 9) కమ్మరి సత్రం | 10) గుండుపాపాల సత్రం |

ప్రస్తుతం సన్నిధి వీధిలో ఉన్న ఈ సత్రాలలో కొన్ని శిథిలావస్థకు చేరుకోగా కొన్ని అంగళ్ళుగా మారిపోయాయి.

నవనారసింహ క్షేత్రాలను కలిగిన ఈ అహోబిలం అనేక ఉపాలయాలతో అనేక మంటపాలతో, అనేక పుష్కరిణులతో, తీర్థాలతో, ధర్మసత్రాలతో విరాజిల్లుతూ శ్రీ వైష్ణవ సంప్రదాయానికి కేంద్రబిందువుగా, ద్రవిడ వేదాధ్యయన కేంద్రంగా 101 దివ్యదేశాలలో ప్రధానమైనదిగా, విరాజిల్లుతూ ఆధ్యాత్మిక, ధార్మిక, సాంస్కృతిక, శిల్పకళా సంప్రదాయాలకు ఆలవాలమై కొలిచినవారికి కొంగుబంగారమై విరాజిల్లుతూంది అహోబిల క్షేత్రం. ఈ క్షేత్ర సందర్శనం సకల పాపహరణం, సర్వైశ్వర్యప్రదాయకం, ఈ క్షేత్రసందర్శనం చేసినవారు జనన మరణ చక్రంనుండి బయటపడి శ్రీ వైకుంఠపథాన్ని పొందుతారని బ్రహ్మాండపురాణం చెబుతూంది.

* * *

## ఉత్సవాలదేవుడు అహోబిలనారసింహుడు

అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడైన శ్రీమదహోబిలనారసింహుడు ఉత్సవాలదేవుడు ఆ మిషతోనే భక్తులను పిలిపించుకుంటాడు, సేవలు చేయించుకుంటాడు. స్వామివారి సేవలు చేసినా, చూసినా కోరిన కోరికలు నెరవేరుతాయి. స్వామివారికి ఏడాదిపొడగునా ఉత్సవాలే. ప్రతిరోజూ పండుగే. ప్రతిపూటా పరమాన్నాలే. పాయసాలే.

సాధారణంగా వైష్ణవ ఆలయాలలో వైఖానస ఆగమోక్తంగానో లేదా పాంచరాత్ర ఆగమోక్తంగానో పూజలు నిర్వహింపబడుతూంటాయి. చరిత్రను అనుసరించి అహోబిల ఆలయంలో లభిస్తున్న 15,16,17 శతాబ్దాలకు చెందిన శాసనాలను అనుసరించి అహోబిలక్షేత్రంలో పాంచరాత్ర ఆగమప్రకారం పూజలు నిర్వహింపబడుతున్నాయి. క్రీ.శ. 1410కి చెందిన శాసనానుసారం స్వామివారి నిత్యనైమిత్తిక పూజాదికాలు, నివేదనలకుగాను కొన్ని భూములు, నిధులు సమర్పించినట్లు తెలుస్తున్నది.

క్రీ.శ.1529లో అపరాంధ్రభోజుడు, సాహితీ సమరాంగణ సార్వభౌముడు అయిన శ్రీకృష్ణదేవరాయలవారు అహోబిలాన్ని సందర్శించి దిగువ అహోబిలంలో స్వామివారికి రంగమండపాన్ని నిర్మింపజేశాడు. అంతేకాక స్వామివారి నిత్యోత్సవాల నిమిత్తం ధూపదీప నైవేద్యాల నిమిత్తం కొంతనిధిని, భూమిని పీఠాధిపతులకు సమర్పించుకున్నట్లు ఇక్కడున్న శాసనాలు తెలియజేస్తున్నాయి.

శ్రీమదహోబిల లక్ష్మీనృసింహస్వామివారికి, ఉగ్రనరసింహస్వామివారికి జరిగే ఉత్సవాలను 4 విధాలుగా పేర్కొనవచ్చును. అవి

**1. నిత్యోత్సవాలు:** స్వామివారికి ప్రతిరోజు జరిగే ఉత్సవాలు నిత్యోత్సవాలు. సుప్రభాతం మొదలు శయనోత్సవం వరకు జరిపే ఉత్సవాలను నిత్యోత్సవాలు అంటారు.



**2. వారోత్సవాలు:** వారంలో స్వామివారికి ప్రత్యేకించి జరిపే ఉత్సవాలు వారోత్సవాలు అంటారు

**3. పక్షోత్సవాలు:** పదిహేను రోజులకు ఒకసారి జరిపే ఉత్సవాలు. పక్షోత్సవాలు అంటారు.

**4. మాసోత్సవాలు:** ప్రతిమాసంలోనూ ప్రత్యేకించి జరిపే ఉత్సవాలను మాసోత్సవాలు అంటారు.

**5. వార్షికోత్సవాలు/సంవత్సరోత్సవాలు:** అంటే ఏడాదికి ఒకసారి జరిపే ఉత్సవాలు బ్రహ్మోత్సవాలు మొదలైనవి.

## పంచబేరాలు

శ్రీ వైష్ణవ సంప్రదాయాన్ని అనుసరించి పాంచరాత్ర ఆగమ సిద్ధాంతానుసారం ఆలయంలో శ్రీవారు పంచబేరాల రూపంలో కొలువైయున్నారు. బేరం అనగా మూర్తి, లేదా విగ్రహం.

1. ధ్రువబేరం: మూలమూర్తి
2. కౌతుకబేరం: నిత్యోత్సవ మూర్తి
3. యాగబేరం: యాగమూర్తి
4. సబర బేరం: శ్రీ భూసమేత ప్రహ్లాదవరదస్వామివారు/కల్యాణమూర్తి
5. బలిబేరం: చక్రత్తాళ్వార్

## నిత్య పూజలు

అహోబిల క్షేత్రంలోని స్వామివారికి ప్రతిరోజు ఉదయంనుండి రాత్రివరకు జరిపే పూజలను నిత్యోత్సవాలులేదా నిత్యపూజలుగా వ్యవహరిస్తారు. ఈ క్షేత్రంలో పాంచరాత్ర ఆగమ విహితంగా, శ్రీమద్రామానుజుల వైష్ణవ సిద్ధాంతానుసారం ప్రతిరోజు షట్కాలపూజలను నిర్వహిస్తారు. అవి

1. విశ్వరూపసేవ 2. అభిగమనం (బాలభోగం) 3. నిత్యారాధన 4. పానకారాధన 5. నిత్యపూజ (సావ్యరక్ష) 6. శయనోత్సవం.

## నిత్యపూజలివిగో

**సుప్రభాతం:** ఉ॥ 6.30ని॥లకు స్వామివారికి "కౌసల్యా సుప్రజారామ" అంటూ ఆలయం తలుపులను తెరచి అర్చకస్వాములు ఆలయప్రవేశం చేస్తారు. ప్రధానార్చక స్వామివారు గర్భాలయ ప్రవేశంచేసి స్వామివారిని మేల్కొలుపుతారు. గర్భాలయం శుద్ధిచేస్తారు. తదనంతరం సకలదేవతలకు నెలవయిన గోమాతను గోవత్సం సహితంగా ఆలయానికి రప్పించి రంగమంటపంలో

**"సర్వకామధుగే దేవి సర్వతీర్థాభిషేచిని**
**పావని సురభిశ్రేష్ఠి దేవి తుభ్యం నమోస్తుతే॥** అంటూ గోపూజను నిర్వహించి తండులములను నివేదిస్తారు. ఈ సందర్భంగా నృసింహస్వామివారికి గోక్షీరాన్ని నివేదిస్తారు. మంగళవాద్యాలను వాయిస్తారు.

**విశ్వరూపదర్శనం:** ఉ॥ 6.45 ని.లకు భక్తాదులకు స్వామివారి దర్శన భాగ్యాన్ని కల్పిస్తారు. ఈ దర్శనాన్నే "విశ్వరూపదర్శనం" అంటారు. ఈ దర్శనానికి విచ్చేసిన భక్తులకు స్వామివారికి నివేదనచేసిన గోక్షీరాన్ని తీర్థంగా ప్రసాదిస్తారు.

**సర్వదర్శనం:** ఉ॥6.50 ని॥నుండి సర్వదర్శనానికి అనుమతిస్తారు.

8.30 గం॥ నుండి 9.30 ని॥ల వరకు నిత్యకాలార్చన.

ఈ అర్చననే నిత్యపూజ, అభిగమన ఆరాధన లేదా బాలభోగము అంటారు. ఈ సమయంలో "నిత్యోత్సవమూర్తికి" ఏకకలశ స్నపన తిరుమంజనం జరుగుతుంది. ధ్రువబేరమైన శ్రీలక్ష్మీనరసింహస్వామివారికి అష్టోత్తర శతనామపూజ, తిరుప్పావై-శాత్తుమొరై, గోష్ఠి నిర్వహిస్తారు.





తదనంతరం పంచబేరమునందు నిత్యపంచభూతాది బలిదేవతలకు, ఆ దేవాలయ ఆవరణంలోని దేవతలకు, బీగాల ఆంజనేయస్వామివారికి దధ్యోదనం, శుద్ధాన్నం నివేదన ఆరగింపజేస్తారు. ఈ సందర్భంలో ఆలయ ప్రాకారంలో ఘంటానాదం చేస్తారు. తదుపరి అర్చకునివెంట మరో స్వామివారు ఘంటానాదం చేస్తూరాగా బలిహరణ కార్యక్రమాన్ని నిర్వహిస్తారు. తదనంతరం మంగళవాయిద్యాల నడుమ స్వామివారికి మంగళహారతులను సమర్పిస్తారు.

తదనంతరం భక్తులకు దర్శనభాగ్యాన్ని కల్పించి శఠారి తీర్థం, ప్రసాదాలను అందిస్తారు.

9.30 గం॥ల నుండి 12.00 వరకు సర్వదర్శనం

12.00 గం॥ల నుండి 12.30 గం॥ల వరకు ఉచ్చకాల పూజను నిర్వహించి అలంకార తళిగను నిర్వహిస్తారు. అనంతరం స్వామివారికి శుద్ధాన్నం, సాంబారు, రసం, తాళింపు, అపూపం, పెరుగన్నంతో కూడిన ఆహారాన్ని నివేదిస్తారు.

12.30ని॥లనుండి 1గం॥ల వరకు సర్వదర్శనం

1గం॥ నుండి 3గం॥ల వరకు విశ్రాంతి.

మ. 3గం॥లకు: సర్వదర్శనం

సా॥ 6.30ని॥లకు ప్రదోష దీపారాధన, తోమాల సేవలను నిర్వహించి పానకాన్ని నివేదిస్తారు.

సా॥7గం॥లకు తిరిగి నిత్యకాలార్చన నిర్వహించి అష్టోత్తర శతనామార్చన, తిరుప్పావై శాత్తుమొరై గోష్ఠి నిర్వహిస్తారు. తదనంతరం భక్తులకు శఠారి, తీర్థం పానక ప్రసాదాలు ఇస్తారు.

రాత్రి 8గం॥లకు: శయనోత్సవం. దీనినే ఏకాంతసేవ అంటారు. నిత్యోత్సవ మూర్తికి ఏకాంత సేవను నిర్వహించి ఉత్సవమూర్తికి పాలు, క్షీరాన్నం ఆరగింపుజేసి భక్తులకు క్షీరాన్నం, పాలు ప్రసాదంగా ఇస్తారు.

తదనంతరం స్వామివారి చెంత ఒక బంగారు పాత్రలో శుద్ధజలాన్ని ఉంచుతారు. ప్రతిరోజు రాత్రి బ్రహ్మదేవుడు స్వయంగా విచ్చేసి రాత్రి స్వామివారిని సేవిస్తారని పురాణాలు చెబుతున్నాయి. బ్రహ్మదేవుని పూజకై ఉంచిన శుద్ధజలాన్ని తిరిగి విశ్వరూపదర్శన సమయంలో భక్తులకు బ్రహ్మతీర్థంగా గోక్షీరతీర్థంతోపాటు ఇస్తారు. శయనోత్సవంతో స్వామివారికి జరిపే నిత్యపూజలు సంపూర్తి అవుతాయి.

## వారోత్సవాలు

ప్రతి శనివారం ఎగువ అహోబిలంలోని లక్ష్మీనరసింహస్వామి, భూ, నీళాసమేత జ్వాలా నరసింహస్వామివారి ఉత్సవమూర్తులకు; దిగువ అహోబిలంలోని శ్రీదేవి, భూదేవి అమృతవల్లీతాయార్ సమేత ప్రహ్లాదవరద స్వామివారికి విశేషంగా తిరుమంజనం నిర్వహిస్తారు. ప్రతి శనివారం నిర్వహించే తిరుమంజనోత్సవంలో పాల్గొనే భక్తులు ఒకరోజు ముందుగా ఆర్జిత సేవాటికెట్‌ను స్వీకరించి పాల్గొనవచ్చు. ఈ సందర్భంలో స్వామివారికి నవకలశస్నపన తిరుమంజనంతోపాటుగా పంచామృతాభిశేకాన్ని కూడా నిర్వహిస్తారు. ఈ ఉత్సవాన్ని వారోత్సవంగా వ్యవహరిస్తారు.

## పక్షోత్సవాలు

ప్రతి ద్వాదశి త్రయోదశి (తిథిద్వయం) కలిసి వచ్చిన సంధ్యాకాలంలో ప్రదోషపూజలు నిర్వహిస్తారు. ఈ సందర్భంగా స్వామివార్లకు విశేషంగా అలంకార తలిగల ఆరగింపు నిర్వహిస్తారు. స్వామివారికి మహామంగళహారతి-నక్షత్రహారతి, కుంభహారతి, కర్పూర నీరాజనాలను సమర్పిస్తారు. భక్తులకు తీర్థ, శఠారి, ప్రసాదాలను అందిస్తారు. ఈ ఉత్సవాలనే పక్షోత్సవాలంటారు.



## మాసోత్సవాలు

అహోబిల క్షేత్రంలో ప్రతిమాసంలోనూ రెండు ఏకాదశిలు, పూర్ణిమ, అమావాస్య, నరసింహస్వామివారి జన్మ నక్షత్రమైన "స్వాతి" నక్షత్రంనాడు ఈ ఐదురోజులు మూలవర్లకు ఉత్సవర్లకు తిరుమంజనం, గ్రామోత్సవం నిర్వహిస్తారు. ఈ ఐదురోజులు జరిగే ఉత్సవాలను పంచ పర్వోత్సవాలు అంటారు. "స్వాతి" నక్షత్రంనాడు నవనారసింహ మూలమూర్తులకు నవకలశ స్నపన తిరుమంజనం నిర్వహించి, అర్చనలుచేసి మహానైవేద్యాన్ని ఆరగింపజేస్తారు. ఈ ఉత్సవాలనే మాసోత్సవాలంటారు.

## వార్షికోత్సవాలు

అహోబిలేశుడు ఉత్సవాల దేవుడు. సంవత్సరంలోని ప్రతిమాసమూ అహోబిలేశుని ఆలయాలలో ఏదోఒక ఉత్సవం జరుగుతూనే ఉంటుంది. ఏ ఏ మాసాలలో ఏ ఏ ఉత్సవాలు నిర్వహింపబడుతాయో ఈ శీర్షికలో వివరంగా తెలుసుకుందాం.

**1. చైత్రమాసం:** నూతన తెలుగు సంవత్సరం 'ఉగాది' సందర్భంగా ఉగాది ఉత్సవాన్ని నిర్వహిస్తారు. సాయంకాలం పంచాంగ శ్రవణం ఆదాయ వ్యయాలు, రాజాధినవనాయకుల వివరాలను సంవత్సరఫలాలను వివరిస్తారు.

1. చైత్రశుద్ధ నవమినాడు శ్రీరామనవమిఉత్సవం.
2. పావన నరసింహస్వామివారి ఉత్సవాలు (పాములేటివారాలు).
3. ఆరుద్ర నక్షత్రంనాడు భగవద్ రామానుజులవారి జయంతి (10రోజులు)

**2. వైశాఖ మాసం:** నరసింహస్వామివారి జన్మనక్షత్రమైన "స్వాతి" నక్షత్రానికి పదిరోజుల ముందునుండి "నృసింహజయంతి" ఉత్సవాలు వైభవంగా నిర్వహిస్తారు. విశాఖనక్షత్రంనాడు నమ్మాళ్వారుల జయంతి ఉత్సవాన్ని నిర్వహిస్తారు. చివరి రోజైన స్వాతినక్షత్రం రోజున నరసింహహోమం,

అష్టోత్తర శత(108) కలశాలతో తిరుమంజనం నిర్వహిస్తారు. రాత్రి పుష్పపల్లకి ఉత్సవం అంగరంగ వైభవంగా అశేషజనవాహినిమధ్య నిర్వహిస్తారు. ఈ సందర్భంగా పదిరోజులపాటు అన్ని ఆలయాలలో మూలమూర్తులకు విశేష అలంకారాలను నిర్వహిస్తారు. ప్రతిరోజు దిగువ అహోబిలంలో ప్రహ్లాదవరదస్వామివారికి గ్రామోత్సవాన్ని నిర్వహిస్తారు.

**3. జ్యేష్ఠమాసం:** ఈ మాసంలో ప్రధానంగా జ్యేష్ఠానక్షత్రం మొదలు స్వామివారి జన్మనక్షత్రమైన స్వాతినక్షత్రం వరకు స్వామివారికి జ్యేష్ఠాభిషేకాలను నిర్వహిస్తారు. స్వాతి నక్షత్రం రోజున 108 కలాశాలతో అభిషేకాన్ని నిర్వహిస్తారు. ఈ రోజునే పెరియాళ్వార్‌గా పేరొందిన విష్ణుచిత్తులవారికి స్వామివారు గరుడవాహనంపై దర్శనమిచ్చినట్లు చెబుతారు. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని సాయంత్రం స్వామివారికి గరుడవాహన సేవను నిర్వహిస్తారు.

**4. ఆషాఢమాసం :** ఈ మాసంలో గోదాదేవి జన్మనక్షత్రమయిన పూర్వఫల్గుణి రోజున గోదాకల్యాణాన్ని నిర్వహిస్తారు.

**5. శ్రావణమాసం :*** ఈ మాసంలో చెంచులక్ష్మీ అమ్మవారికి, అమృతవల్లి తాయార్ వారికి ప్రతిశుక్రవారం విశేషపూజలు నిర్వహిస్తారు. రెండవ శుక్రవారం శ్రీవరలక్ష్మీవ్రతాన్ని అత్యంత వైభవంగా నిర్వహిస్తారు. రాత్రికి ఊంజల్ సేవను నిర్వహిస్తారు.

* ప్రతి శనివారం భక్తులు విశేషంగా పూజలు నిర్వహిస్తారు. రాత్రికి ఆలయ ప్రాకారం చుట్టూ గ్రామోత్సవాన్ని నిర్వహిస్తారు.

* శ్రావణ బహుళాష్టమి రోహిణీనక్షత్రం రోజున శ్రీకృష్ణజన్మాష్టమి సందర్భంగా విశేష పూజలతోపాటు ఉట్టి ఉత్సవాన్ని నిర్వహిస్తారు. ఈ వేడుకలు 2 రోజులపాటు కొనసాగుతాయి.



**6. భాద్రపదమాసం :** * శ్రీ మదహోబిలమఠం ప్రథమ పీఠాధిపతులైన ఆదివన్ శఠకోపయతీంద్ర మహాదేశికులవారి జన్మనక్షత్రమైన జ్యేష్ఠానక్షత్రానికి 10 రోజులు ముందు నుండి జ్యేష్ఠానక్షత్రం వరకు వైభవంగా ఆరాధనోత్సవాలు నిర్వహిస్తారు.

* శ్రవణానక్షత్రంనందు వేదాంత దేశికుల జయంతిని నిర్వహిస్తారు.

**7. ఆశ్వయుజమాసం :** * ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి మొదలు దశమివరకు నవరాత్రి ఉత్సవాలను అంగరంగ వైభవంగా నిర్వహిస్తారు. ప్రతిరోజు స్వామివారికి అమ్మవారికి అద్దాల మండపంలో ఉత్సవాన్ని నిర్వహించి భక్తులకు దర్శనభాగ్యాన్ని కల్పిస్తారు. విజయదశమిరోజున ఉభయదేవేరులతో కూడిన స్వామివారికి, అభిషేకాన్ని నిర్వహిస్తారు. తదనంతరం సాయంకాలం శమీవృక్షదర్శనం పార్వేట ఉత్సవాంగంగా జరుగుతుంది.

* స్వామివారిసేవలో ఏడాది పొడవునా తెలిసి తెలియక జరిగిన అపరాధాలకు ప్రాయశ్చిత్తంగా విజయదశమినాటినుండి 3 రోజులు ఎగువ అహోబిలంలోనూ, 5 రోజులు దిగువ అహోబిలంలోనూ ప్రాయశ్చిత్తహోమాన్ని, “పవిత్రోత్సవాలు”ను 2 రోజులు అంకురార్పణతో కలిపి 10రోజులపాటు ఆగమ పండితుల ఆధ్వర్యంలో నిర్వహిస్తారు.

* నరకచతుర్దశి సందర్భంగా దీపావళినాడు తెల్లవారుజామున స్వామివారికి “తిరుమంజనం”-నూతన వస్త్ర సమర్పణ. అలంకారాలు నిర్వహిస్తారు. రాత్రి గ్రామోత్సవాన్ని నిర్వహిస్తారు.

**8. కార్తీక మాసం :** * మాసాంతంవరకు విశేష దీపాలంకరణ. రాజగోపురం, విమానాలకు విద్యుద్దీపాలంకరణ, కార్తీకపౌర్ణమినాడు కార్తీక దీపోత్సవం, నిర్వహిస్తారు. రాత్రి స్వామివారికి గ్రామోత్సవం జరుగుతుంది.

* ఈ మాసంలో ఒకరోజు వనభోజనం నిర్వహిస్తారు.

* తిరుమంగై ఆళ్వార్ జయంతిని "కృత్తికా" నక్షత్రంనందు "కరియన్ జయంతి" గా నిర్వహిస్తారు.

**9. మార్గశీర్షమాసం :** * "మాసానాం మార్గశీర్షోహం" అని గీతాచార్యుడు పేర్కొన్నట్లుగా వైష్ణవులకు మార్గశీర్షమాసం అతి ముఖ్యమైనది పవిత్రమైనది.

* మాసారంభం నుండి మాసాంతందాకా ఎగువ-దిగువ-అహోబిలాలలో ఉషఃకాలంనందు ధనుర్మాసపూజలను నిర్వహిస్తారు.

* గోదాదేవి స్వామివారిని స్తుతించిన తిరుప్పావైలోని 30 పాశురాలలో ఒక్కోరోజు ఒక్కోపాశురాన్ని పాడుతూ 30 రోజులు స్వామివారిని ఆరాధిస్తారు. ధనుర్మాసం చివరిరోజు గోదాకల్యాణం నిర్వహించి 108 పాత్రలలో క్షీరాన్నాన్ని నివేదిస్తారు.

* 10రోజులు "పగలుపత్తు" దివ్యప్రబంధ గానంచేస్తారు.

* 10వ రోజున తిరుమంగై ఆళ్వారులకు స్వామివారు మోహినీ అవతారంలో దర్శనమిచ్చినట్లుగా ఉత్సవాన్ని నిర్వహిస్తారు.

* 11వ రోజునుండి 20వ రోజువరకు "అధ్యయనోత్సవాలను" నిర్వహిస్తారు. ఈ సందర్భంగా చతుర్వేద పారాయణాలను నిర్వహిస్తారు.

* 20వ రోజు నమ్మాళ్వారుల పరమపదోత్సవం.

* మూలానక్షత్రంనందు హనుమజ్జయంతి ఉత్సవాన్ని నిర్వహిస్తారు.

* ఈ మాసంలోనే "ముక్కోటి ఏకాదశి" వైకుంఠ ఏకాదశి సందర్భంగా శ్రీహరి ఉత్తరద్వార దర్శనాన్ని (వైకుంఠద్వార దర్శనం) నిర్వహించి భక్తులకు దర్శన భాగ్యాన్ని కల్పిస్తారు.

**8. పుష్యమాసం :** ఈ మాసంలో సంక్రాంతి ఉత్సవాలను నిర్వహిస్తారు.



**9. మాఘమాసం :** * భోగినాడు గోదాదేవికి, స్వామివారికి "భోగికల్యాణం" నిర్వహిస్తారు.

* సంక్రాంతినాడు స్వామివారికి తిరుమంజనం, విశేషపూజలు నిర్వహించి గ్రామోత్సవాన్ని నిర్వహిస్తారు.

* కనుమ పండుగనాడు 2 బస్తాల బియ్యం బేడలు" పొంగలి చేసి స్వామివారి ఎదుట కుంభంపోసి ఆరగింపు చేసి మహామంగళహారతిని సమర్పిస్తారు.

**పారువేట :** సంక్రాంతి ఉత్సవాలు ముగిసిన మర్నాడే ఉత్సవమూర్తులైన ప్రహ్లాదవరద స్వామివారు ఉభయదేవేరులతో కలిసి పార్వేట ఉత్సవానికి బయల్దేర్తారు. 45రోజులపాటు జరిగే ఈ పార్వేట ఉత్సవంలో భాగంగా స్వామివార్లు 33 గ్రామాలను సందర్శించి భక్తులను అనుగ్రహిస్తారు.

ఈ పార్వేట ఉత్సవాన్ని గురించి ప్రత్యేక శీర్షిక క్రింద క్షుణ్ణంగా తెలుసుకుందాం.

**10. ఫాల్గుణమాసం :** ఫాల్గుణశుద్ధ పంచమి మొదలు పౌర్ణమి వరకు స్వామివారికి బ్రహ్మోత్సవాలను అత్యంత వైభవంగా నిర్వహిస్తారు. ఎగువ, దిగువ అహోబిలాల్లో 10 రోజులపాటు జరిగే ఈ ఉత్సవాలను సాక్షాత్తు బ్రహ్మదేవుడే ముందుండి నిర్వహిస్తాడని ప్రతీతి. ఈ సందర్భంగా ఎగువ అహోబిలంలోని శ్రీదేవి భూదేవి చెంచులక్ష్మీసమేత జ్వాలానృసింహ స్వామివారికి, దిగువ అహోబిలంలోకి శ్రీ,భూ అమృతవల్లీ నాయికా సమేత ప్రహ్లాదవరదస్వామివారికి ప్రతిరోజు ఉదయాస్తమానం విశేషపూజలు. తిరుమంజనం. వివిధ వాహనసేవలు అంగరంగ వైభవంగా నిర్వహింప బడతాయి.

స్వామివార్ల తిరుక్కల్యాణం రోజున తిరుమల తిరుపతి దేవస్థానములవారు పట్టుపీతాంబర వస్త్రాలను సమర్పించడం ఆనవాయితి.

స్వామివార్ల బ్రహ్మోత్సవ విశేషాలను "బ్రహ్మోత్సవ వైభవం" శీర్షిక క్రింద ప్రత్యేకంగా తెలుసుకుందాం.

* బ్రహ్మోత్సవాలు మొదలు నరసింహజయంతి వరకు పావన నరసింహస్వామి వారాలు నిర్వహింపబడతాయి. ఈ ఉత్సవాలతో అహోబిలేశుని సంవత్సరోత్సవాలు సంపూర్తి అవుతాయి.

## పారువేట ఉత్సవం

ఈ బ్రహ్మాండంలోని ఏ నృసింహక్షేత్రాలలోనూ లేనటువంటి, కేవలం అహోబిల నారసింహస్వామివారికి మాత్రమే నిర్వహించే విశేష ఉత్సవం పారువేట ఉత్సవం. ఈ ఉత్సవాన్ని గురించి మొట్టమొదటిసారిగా క్రీ.శ. 1542వ నాటి శాసనం తెలియజేస్తూంది.

ప్రతి సంవత్సరం ఉత్తరాయణ పుణ్యకాల మహాసంక్రాంతి మరునాడు దిగువ అహోబిల ఉత్సవమూర్తులైన శ్రీ, భూ, అమృతవల్లీ నాయికా సమేత ప్రహ్లాద వరదస్వామివారు పారువేటఉత్సవానికి ఊరేగింపుగా బయలుదేరి అహోబిలం చుట్టుప్రక్కల 5 మండలాలలోని 32 గ్రామాలను దాదాపు 45 రోజులలో సందర్శించి ఆ యా గ్రామాల భక్తులచే పూజా కార్యక్రమాలను, నైవేద్యాలను అందుకొని తిరిగి అహోబిలం చేరుకుంటారు.

అహోబిల లక్ష్మీనృసింహస్వామివారి పారువేట ఉత్సవాల కోసం ఆ చుట్టుప్రక్కల గ్రామాలలో పండుగవాతావరణ నెలకొంటుంది. ఆ యా గ్రామాలు వదిలి బ్రతుకుతెరువుకు పట్టణాలకు వలస వెళ్ళినవారంతా స్వామివారి గ్రామసందర్శనవేళకు స్వగ్రామాలకు చేరుకుంటారు. స్వామివారి పారువేటఉత్సవం గ్రామాలలో పెద్ద పండుగగా జరుపుకుంటారు. ఆ యా గ్రామాల లోగిళ్ళు బంధుమిత్రులతో ఇంటి ముందు రంగవల్లులతో శోభాయమానంగా ఉంటాయి. స్వామివారు ఆ యా గ్రామాలకు చేరుకొని



గ్రామస్తుల పూజా కార్యక్రమాలను, వివిధరకాల సాత్వికాహారాన్ని నైవేద్యంగా తీసుకొని మరోగ్రామానికి వెళుతూంటారు. స్వామివారి పాదధూళి సోకే అదృష్టాన్ని పొందే ఆ గ్రామాలు.

| | |
|---|---|
| 1. బాచేపల్లి | 2. కొండమపల్లి |
| 3. కృష్ణాపురం (రామతీర్థం) | 4. కోటకందుకూరు |
| 5. మట్టిపల్లి | 6. యాదవాడ |
| 7. ఆలమూరు | 8. తిమ్మనపల్లి |
| 9. నరసాపురం | 10. ముత్తలూరు |
| 11. నల్లవాగుపల్లి | 12. బాచాపురం |
| 13. నాగిరెడ్డిపల్లి | 14. పడకండ్ల |
| 15. ఆళ్ళగడ్డ | 16. యస్.లింగందిన్నె |
| 17. సరవరాయపల్లి | 18. ఎం.వి.నగర్ |
| 19. చింతకుంట | 20. దేవరాయపురం |
| 21. గూబగుండం | 22. జంబలదిన్నె |
| 23. మందలూరు | 24. నక్కలదిన్నె |
| 25. చందలూరు | 26. తిప్పారెడ్డిపల్లి |
| 27. చిలకలూరు | 28. టి.లింగందిన్నె |
| 29. నాగులవరం | 30. తువ్వపల్లె |
| 31. రుద్రవరం | 32. దిగువ అహోబిలం |

ఈ గ్రామాలన్ని స్వామివారు సంచరించిన మీదట పారువేట ఉత్సవం ముగించుకొని తిరిగి దిగువ అహోబిలం ఆలయాన్ని చేరుకోవడంతో పారువేట ఉత్సవం ముగుస్తుంది.

## అహోబిలేశుని బ్రహ్మోత్సవ వైభవం

అఖండ భూమండలంలో వున్న దివ్యమైన నాలుగు నరసింహ క్షేత్రాల్లో అహోబిలం అత్యంత ప్రశస్తమైనది. లోకకంటకుడైన హిరణ్యకశిపుని బారినుండి తన భక్తుడైన ప్రహ్లాదుని కాపాడేందుకు, "సత్యం విధాతు నిజభృత్యభాషితం" అని భాగవతకారులు చెప్పినట్లు నిజభక్తుడైన బ్రహ్మదేవుడు హిరణ్యకశిపునికి ఇచ్చిన వరాలను నిజం చేస్తూ స్తంభంనుండి నరమృగశరీరంతో శ్రీహరి నరసింహునిగా అవతరించిన ప్రాంతమే "అహోబిలం". అదే "అహోబలం"!

అహోబిల నారసింహుడు భక్తులపాలిట కొంగుబంగారం. స్వామివారి అవతార కారణం భక్తరక్షణ. అహోబిల నరసింహస్వామివారికి పాంచరాత్ర ఆగమానుసారం షట్కాల అర్చనలు, నిత్యోత్సవాలు, వారోత్సవాలు, పక్షోత్సవాలు, మాసోత్సవాలు, వార్షికోత్సవాలు, ఇలా దాదాపు ఏడాది మొత్తం ఏదోఒక ఉత్సవం జరుగుతూనే ఉంటుంది.

ఇలా ఏడాది పొడుగునా ఎన్ని ఉత్సవాలు జరిగినా ఏడాదికొక్కమారు 10రోజులపాటు జరిగే బ్రహ్మోత్సవాల వైభవమే వేరు. అహోబిల ఉత్సవాలలోనే అత్యంత్య ప్రాధాన్యాన్ని సంతరించుకున్న ఉత్సవాలు బ్రహ్మోత్సవాలు.

కృతయుగంలో నరసింహమూర్తిగా అవతరించిన స్వామివారు హిరణ్యకశిపసంహారం చేసిన తర్వాత కూడా కోపజ్వాలతో తిరుగుతుండగా బ్రహ్మరుద్ర దేవేంద్రాది దేవతలు స్వామివారిని శాంతించమని స్తుతించినా శాంతించ లేదు. అప్పుడు దేవతల కోరికపై మహాలక్ష్మీదేవి చెంచులక్ష్మిగా అవతరించి స్వామివారిని శాంతింపజేశారట. అప్పుడు బ్రహ్మదేవుడు తన తల్లితండ్రులైన లక్ష్మీనృసింహస్వామివార్లను స్తుతిస్తూ...

**"ధ్వజ సమారోపణముదొల్లదగుమహోత్స**
**వంబు సేయంగ నభిలాషవరలె నాకు**



**నేతదుత్సమునకు నీ వియ్యకొనుము**
**కమలవాసినితో గూడి కమలనాభ."**

"హే జగత్కల్యాణచక్రవర్తి ధ్వజారోహణ పూర్వకంగా తమకు మహోత్సవం చేయాలని నాకు కోరిక కలిగింది. ఆ ఉత్సవానికి తమరు అంగీకరించి మహాలక్ష్మితోకూడి పాల్గొనవలసినది" అని ప్రార్థించాడు. ఆ ప్రార్థనను లక్ష్మీనృసింహులు అంగీకరించారట. విధాత సంతోషంతో అంగరంగవైభవంగా 10 రోజులపాటు ఎగువ, దిగువ అహోబిలాలలో ఉత్సవాలను నిర్వహించాడట అదే బ్రహ్మోత్సవం.

పూర్వం అహోబిలేశునికి 8 బ్రహ్మోత్సవాలు 196 రోజులపాటు నిర్వహింపబడేవని ఆలయంలోని శాసనాల ఆధారంగా తెలుస్తున్నది. ఇవి కాలక్రమేణ ప్రస్తుతం ఏడాదికి ఒక్కసారిమాత్రమే ఫాల్గుణమాసంలో స్వామివారు పార్వేట ఉత్సవం ముగించుకుని రాగానే వార్షికబ్రహ్మోత్సవాలు 10 రోజులు నిర్వహింపబడుతున్నాయి.

## బ్రహ్మోత్సవం అంటే....

* **"ఋతగ్ం సత్యం పరబ్రహ్మ,**
**ఏకమేవాఽ ద్వితీయం బ్రహ్మ"**

"నారాయణం పరబ్రహ్మ" అను వేదవాక్యాలననుసరించి నారాయణ శబ్దవాచ్యుడే పరబ్రహ్మ. ఆ పరబ్రహ్మకు నిర్వహింపబడుతున్న మహోత్సవాలే బ్రహ్మోత్సవాలు.

* సృష్టికర్త అయిన బ్రహ్మదేవుని యాజమాన్యంలో ప్రారంభించబడిన ఉత్సవాలు కనుక బ్రహ్మోత్సవాలు అనిపేరు.

* సృష్టికర్త అయిన బ్రహ్మ అంతర్ధానరూపంలో ముందుండి స్వామివారికి ఉత్సవాలను నిర్వహిస్తారు. కనుకనే బ్రహ్మోత్సవాలు అయ్యాయి. బ్రహ్మ నిరాకార, నిర్గుణ స్వరూపంతో ఈ ఉత్సవాల పర్యంతం ఉంటారు.

రథోత్సవంనాడు మాత్రం స్వయంగా బ్రహ్మదేవుడే స్వామివారి రథసారథ్యాన్ని వహించి పగ్గాలు చేబూని రథాన్ని నడుపుతూ అదృశ్యరూపంలో ఉంటాడు. ఉత్సవాలకు యాజమాన్యాన్ని వహిస్తాడు.

బ్రహ్మదేవుడు ప్రారంభించిన ఈ 10రోజుల బ్రహ్మోత్సవాలను కాలక్రమేణ ఎందరో రాజులు, మరెందరో రారాజులు, మహామండలేశ్వరులు తమ తమ విజయపరంపరలకు కృతజ్ఞతగా ఈ బ్రహ్మోత్సవాలను నిర్వహిస్తూవచ్చారు. ఇలా నిర్వహించిన బ్రహ్మోత్సవాలు ప్రతియేట 8 బ్రహ్మోత్సవాలు జరిగేవి. ప్రస్తుతం ఫాల్గుణ శుద్ధపంచమి మొదలు ఫాల్గుణ బహుళ పాడ్యమివరకు ఒక్కసారి మాత్రమే 10రోజులపాటు శ్రీలక్ష్మీ నృసింహస్వామివారి వార్షిక బ్రహ్మోత్సవాలు జరుగుతున్నాయి.

బ్రహ్మోత్సవాలు అంకురార్పణ, ధ్వజారోహణలతో ప్రారంభమై, ధ్వజావరోహణతో సమాప్తమయ్యే పదినాళ్ళవేడుకలు. మొట్టమొదట ఎగువ అహోబిలంలో ఈ బ్రహ్మోత్సవాల అంకురార్పణ ధ్వజారోహణ, వాహనసేవలు ప్రారంభంకాగా మరునాడు దిగువ అహోబిలంలో ప్రారంభంకావడం ఆనవాయితీ. ముగింపుకూడా అంతే. అంటే ఎగువ, దిగువ, అహోబిల బ్రహ్మోత్సవాలకు ఒక్కరోజు తేడా ఉంటుంది.

**1. కోయిల్ ఆళ్వార్ తిరుమంజనం :** బ్రహ్మోత్సవాల ప్రారంభానికి ముందు ఒక శుభముహూర్తాన్ని నిర్ణయించి ఆలయాన్ని తప్పక శుద్ధిచేస్తారు. ఎగువ-దిగువ అహోబిలాలలోని ఆలయాలను గర్భాలయాలను ముఖ్యంగా సుగంధ ద్రవ్యాలతో శుద్ధిచేసే కార్యక్రమమే కోయిల్ ఆళ్వార్ తిరుమంజనం. ఈ కోయిల్ ఆళ్వార్ తిరుమంజనం ఒక్క బ్రహ్మోత్సవాలముందేకాక ఉగాది, వైకుంఠ ఏకాదశి పర్వదినాల ముందుకూడా నిర్వహింపబడుతుంది. ఇలా ఆలయాన్నంతా సర్వేసర్వత్రా నీటితో కడిగి శుద్ధిచేసి హరిద్రాచూర్ణ పచ్చకర్పూరాది పరిమళద్రవ్యాలను గోడలకుపూసి శుద్ధిచేసిన తర్వాత ఆలయాన్ని రంగురంగుల విద్యుత్ దీపాలతోను, పూలతోను అద్భుతంగా



అలంకరిస్తారు, మామిడాకుల తోరణాలతోను, అరటిచెట్లుతోను, అందంగా అలంకరిస్తారు.

**2. అంకురార్పణం :** ఫాల్గుణశుద్ధ పంచమినాడు ఉదయం స్వామివార్లకు విశేషపూజా కార్యక్రమాలను నిర్వహించి బ్రహ్మోత్సవాల నిర్వహణకు అనుమతిని తీసుకుంటారు అర్చకస్వాములు. ఈనాటినుండి శ్రీమదహోబిలమఠం పీఠాధిపతులు స్వయంగా తామే ఎదురుగాఉండి కార్యక్రమాన్ని సమీక్షిస్తారు.

స్వామివారి సర్వసైన్యాధ్యక్షులైన శ్రీవిష్వక్సేనులవారు అందంగా ముస్తాబై తిరుచ్చిపై అధిరోహించి ఛత్రచామర మంగళవాయిద్యాలతో ఉత్సవంగా ఊరేగుతూ బ్రహ్మోత్సవ నిర్వహణకు చేసిన ఏర్పాట్లను పరిశీలిస్తారు. తదనంతరం విష్వక్సేన మండపాన్ని చేరుకొని పూజలు స్వీకరించి, ఈ మండపానికి దగ్గరలోనే ఉన్న 'మృత్సంగ్రహణ మండపాన్ని' చేరుకుంటారు. అర్చకులు భూమిపూజా ఇత్యాది విశేషపూజాదికాలు నిర్వహించి అక్కడినుండి మృత్సంగ్రహణం చేసుకొని ప్రదక్షిణంగా ఆలయప్రవేశం చేస్తారు. ఇక ఆ రాత్రే బ్రహ్మోత్సవాలకు నవధాన్యాలతో అంకురార్పణ కార్యక్రమాన్ని నిర్వహిస్తారు. యాగశాలలో విష్వక్సేనులవారిని వేంచేయింపచేసి వేదమంత్రోచ్చారణల మధ్య విష్వక్సేనారాధన, పుణ్యాహవాచనం కార్యక్రమాలను నిర్వహిస్తాడు. సుందరంగా అలంకరించిన హోమగుండాలలో అగ్ని ప్రతిష్ఠాపనచేసి, వేదపండితులు వేదమంత్రాలు ఉచ్చరిస్తూండగా మట్టితో చేసిన పాలికలను శుద్ధిచేసి, వాటిలో నవధాన్యాలను వేసి మృత్యంగ్రహణంలో తీసుకొచ్చిన మృత్తికను వాటిపై వేసి కప్పి, నీటినిపోసి అంకురింపజేస్తారు. ఇదే అంకరారోపణ కార్యక్రమం.

**3. ధ్వజారోహణం :** మర్నాడు ఉదయం శుభముహూర్తాన పాంచరాత్ర ఆగమ విహితంగా గరుడకేతన ప్రతిష్ఠ, కంకణధారణ, ఆలయ ఆవరణలోనూ, ఆలయంచుట్టూ, అష్టదిక్కులలోనూ బలిహరణ కార్యక్రమాన్ని

నిర్వహిస్తారు. తదనంతరం ఉభయదేవేరులతో కలిసి అమృతవల్లీనాయికా సమేత ప్రహ్లాదవరదస్వామి (ఎగువ అహోబిలంలో చెంచులక్ష్మీనాయికా సమేత జ్వాలానరసింహస్వామి)వారు సర్వాలంకార శోభితులై ధ్వజస్తంభంవద్దకు చేరుకుంటారు. ఈ సందర్భంలో ఆలయ పరివార దేవతలు, అష్టదిక్పాలకులు ఆహ్వానింపబడతారు. విష్వక్సేనాది దేవతలు అంకురార్పణ మండపాన్ని చేరుకుంటారు.

తదుపరి ఉభయదేవేరులతో కూడిన స్వామివారి సమక్షంలో వేదమంత్రోచ్చారణలమధ్య మంగళవాద్యాలు మ్రోగుతుండగా అర్చక స్వాములు గరుడకేతనాన్ని పూజించి ధ్వజస్తంభంపై గరుడ ధ్వజారోహణ కార్యక్రమాన్ని నిర్వహించి స్వామివారి బ్రహ్మోత్సవాలకు సకలదేవతలను రావలసినదిగా ఆహ్వానాన్ని పంపుతారు. ఈ సందర్భంగా స్వామివారికి నివేదించే వెన్‌పొంగలిని, అమృతకలశం ప్రసాదాన్ని స్వీకరిస్తే సంతానభాగ్యానికి నోచుకోని స్త్రీలు తప్పక సంతానవతులు అవుతారు.

**భేరీపూజ :** ధ్వజారోహణంనాటి సాయంకాలం స్వామివారికి భేరీపూజ నిర్వహిస్తారు. స్వామివారిని అమ్మవార్లను కొలువుదీర్చి లయతాళబద్ధంగా భేరీనాదం చేస్తారు. అన్ని తాళాలను రాగాలనూ స్వామివారికి నాదస్వరంపై వినిపిస్తూ మంగళవాద్యాలతోపాటు విశేషంగా భేరీనాదం చేస్తారు.

ఆనాటి రాత్రినుండే స్వామివార్లకు వాహన సేవలు నిర్వహింపబడతాయి. ఎగువ అహోబిలంలో స్వామివారికి ఫాల్గుణ శుద్ధషష్ఠి మొదలు ప్రతిరోజు ఉదయం విశేష తిరుచిఉత్సవం మధ్యాహ్నం తిరుమంజనం రాత్రి వివిధవాహన సేవలు నిర్వహింపబడగా, దిగువ అహోబిలంలో ఫాల్గుణ శుద్ధసప్తమి మొదలు ప్రతిరోజు ఉదయం మరియు రాత్రి వివిధ వాహనసేవలు మధ్యాహ్నం తిరుమంజనం నిర్వహింపబడతాయి.







## ఎగువ-దిగువ అహోబిలాలలో నిర్వహించే బ్రహ్మోత్సవ వాహన సేవల వివరాలు

### ఎగువ అహోబిలం

| | ఉదయం | మధ్యాహ్నం | రాత్రి |
|---|---|---|---|
| 1) ఫాల్గుణశుద్ధ పంచమి | విశేషపూజ | 3గం॥లకు | అంకురార్పణం |
| 2) ఫాల్గుణశుద్ధ షష్ఠి | ధ్వజారోహణం | తిరుమంజనం | సా॥ భేరీపూజ (రాత్రి) సింహవాహనం |
| 3) ఫాల్గుణశుద్ధ సప్తమి | తిరుచ్చిఉత్సవం | తిరుమంజనం | సూర్యప్రభవాహనం |
| 4) ఫాల్గుణశుద్ధ అష్టమి | తిరుచ్చిఉత్సవం | తిరుమంజనం | హనుమంతవాహనం |
| 5) ఫాల్గుణశుద్ధ నవమి | తిరుచ్చిఉత్సవం | తిరుమంజనం | చంద్రప్రభవాహనం |
| 6) ఫాల్గుణశుద్ధ దశమి | తిరుచ్చిఉత్సవం | తిరుమంజనం | శేషవాహనం |
| 7) ఫాల్గుణశుద్ధ ఏకాదశి | తిరుచ్చిఉత్సవం | తిరుమంజనం | అశ్వవాహనం |
| 8) ఫాల్గుణశుద్ధ ద్వాదశి | తిరుచ్చిఉత్సవం | చూర్ణాభిషేకం | సా॥తిరుక్కల్యాణం |
| 9) ఫాల్గుణశుద్ధ త్రయోదశి | తిరుచిఉత్సవం | తిరుమంజనం | గజవాహనోత్సవం |
| 10) ఫాల్గుణశుద్ధ చతుర్దశి | **ఉ॥6.45ని. తేరు (దివ్యమంగళరథోత్సవం)** | తిరుమంజనం | పొన్నచెట్టువాహనం |
| 11) ఫాల్గుణశుద్ధ పౌర్ణమి | ఉ॥9.గం॥ తిరుమంజనం | సా॥ద్వాదశారాధనం, పుష్పయాగం | గరుడోత్సవం అనంతరం ధ్వజావరోహణం |

### దిగువ అహోబిలం

| | ఉదయం | మధ్యాహ్నం | రాత్రి |
|---|---|---|---|
| 1) ఫాల్గుణశుద్ధ పంచమి | విశేషపూజ | 3గం॥ | శ్రీసెల్వార్ కూత్తుఉత్సవం |
| 2) ఫాల్గుణశుద్ధ షష్ఠి | విశేషపూజ | | అంకురార్పణం |
| 3) ఫాల్గుణశుద్ధ సప్తమి | ధ్వజారోహణం | తిరుమంజనం (సా॥ భేరీపూజ) | సింహవాహనం |
| 4) ఫాల్గుణశుద్ధ అష్టమి | హంసవాహనం | తిరుమంజనం | సూర్యప్రభవాహనం |
| 5) ఫాల్గుణశుద్ధ నవమి | యోగనృసింహ గరుడ విమానం | తిరుమంజనం | హనుమంతవాహనం |
| 6) ఫాల్గుణశుద్ధ దశమి | శేషవాహనం | తిరుమంజనం | చంద్రప్రభవాహనం |
| 7) ఫాల్గుణశుద్ధ ఏకాదశి | మోహినీఅలంకారం | తిరుమంజనం | యాళివాహనం (శరభవాహనం) |
| 8) ఫాల్గుణశుద్ధ ద్వాదశి | వేణుగోపాలస్వామి అలంకారం | తిరుమంజనం (చూర్ణాభిషేకం) | పొన్నచెట్టువాహనం |
| 9) ఫాల్గుణశుద్ధ త్రయోదశి | అభిషేకం | సా॥ తిరుక్కల్యాణం (తి.తి.దే వస్త్రసమర్పణ) | గజవాహనం |
| 10) ఫాల్గుణశుద్ధ చతుర్దశి | కాళింగమర్దనోత్సవం | సా॥ తొట్టి తిరుమంజనం | అశ్వవాహనం |
| 11) ఫాల్గుణశుద్ధ పౌర్ణమి | రథోత్సవం | | వీథి ఉత్సవం |
| 12) ఫాల్గుణబహుళ పాడ్యమి | తీర్థవారి చక్రస్నానం | సా॥ ద్వాదశారాధనం | గరుడవాహనోత్సవం అనంతరం ధ్వజావరోహణం |

## వాహనసేవలు

స్వామివారు బ్రహ్మోత్సవాలలో అధిరోహించే ఒక్కొక్క వాహనానికి ఒక్కో చరిత్ర, ఒక్కో ఐతిహ్యం ఉన్నాయి. అంతేకాక స్వామివారు ఏ వాహనంపై అధిరోహించినా ఆ వాహనానికి సంబంధించిన ఒక సందేశం ఉంటుంది.

పదకవితా పితామహుడు తాళ్ళపాక అన్నమాచార్యులు తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామికి, అహోబల నారసింహస్వామికి అభేదాన్ని పాటించారు. కనుకనే తిరుమల శ్రీనివాసుని వాహనసేవలపై వ్రాసిన కీర్తనలే అహోబల నారసింహుని వాహనసేవలకు అన్వయం చేసుకుందాం. కీర్తనలతో స్వామివారిని కీర్తించి తరిద్దాం.

**ఎట్టు నేరిచితివయ్య యిన్ని వాహనములెక్క**
**గట్టిగా నిందుకే హరి కదు మెచ్చేమయ్యా**

**గరుడుని మీద నెక్కి గమనించితివి నాఁడు**
**అరుదైన పారిజాతహరణానకు**
**గరిమతో రథమెక్కి కదలితి వల్లనాఁడు**
**సొరిది బ్రాహ్మణపడుచుల నుద్ధరించను**

**చక్కఁగాఁగుబేరుని పుష్పక మెక్కి కదలితి**
**మక్కువ సీతాదేవి మరలించను**
**తక్కక వాయుజు నెక్కి దాడి వెట్టితివి నాఁడు**
**చొక్కపు వానరుల పొఁజులు చూడను**

**కొట్టఁగొన నీవు రాతి గుఱ్ఱము నెక్కి తోలితి**
**పట్టియెడ నధర్మము నడచఁగను**
**మెట్టుక శ్రీ వేంకటాద్రి మీదఁబల్లకి యెక్కితి**
**విట్టె యిందిరఁగూడి యేఁగుఁబెండ్లి యేఁగను**

అని అన్నమాచార్యులు స్వామివారి వాహనసేవలను కొనియాడారు.



## సింహవాహనము

ధ్వజారోహణంనాటి రాత్రి స్వామివారు "సింహవాహనంపై" అధిరోహిస్తారు.

**అహోబలే గారుడశైలమధ్యే కృపావశాత్ కల్పిత సన్నిధానం**
**లక్ష్మ్యా స్సమాలింగిత వామభాగం లక్ష్మీనృసింహా శరణమహం ప్రపద్యే॥**
**నారాయణాయ పరిపూర్ణ గుణార్ణవాయ విశ్వోదయ స్థితిలయో నియతిప్రదాయ**
**జ్ఞానప్రదాయ విభుదాసుర సౌఖ్య దుఃఖ సత్కారణాయ వితతాయ నమోనమస్తే॥**

అన్నట్లు

శ్రీమన్నారాయణుడు నిర్గుణ స్వరూపుడు అంటే పరిపూర్ణ గుణములు కలవాడని అర్థం. అలాగే ఈ సకల విశ్వానికి ఒక స్థితిని కల్పించేవాడు జ్ఞానాన్ని ప్రసాదించేవాడు సుఖ దుఃఖాలకు అతడే కారకుడు అటువంటి శ్రీహరికి మనం నమస్కరిద్దాం.

శ్రీమన్నారాయణుడు భక్తవశుడు భక్తసులభుడు అందుకే జగన్నాటకమాడి తన భక్తులను అనుగ్రహించుటకు వేదాద్రి గరుడాద్రిల నడుమన అహోబిలంలో నారసింహునిగా వెలిశాడు. దేవదేవోత్తముడు దేవతా సార్వభౌముడు అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుడు వేదవేద్యుడు పురాణ పురుషోత్తముడు దివ్యమంగళమనోజ్ఞమూర్తి అయిన ఆ శ్రీభూమి నీళాసమేత ప్రహ్లాదవరునికి జరుగుతున్న బ్రహ్మోత్సవాలలో భాగంగా తొలినాడైన ఈనాడు స్వామివారికి సింహవాహనోత్సవం జరుగుతున్నది. స్వామివారు మృగరాజైన సింహంపై ఆసీనులై దర్శనమిస్తూ భక్తులను అనుగ్రహిస్తూ మాడవీధులలో విహరిస్తున్నారు.

ఒక్కసారి అటుచూడండి. వివిధ వర్ణరాగరంజిత పుష్పమాలికలతో, రత్నఖచిత వజ్రవైఢూర్యాధి ఆభరణాలను ధరించి ఉభయదేవేరులతో విద్యుద్దీపకాంతులమధ్య దేదీప్య మానంగా వెలిగిపోతూ తన భక్తులకు

అభయాన్నిస్తూ సింహవాహనంపై తిరుమాడ వీధులలో విహరిస్తున్నాడు ప్రహ్లాదవరదుడు. ఆ స్వామివారికి ఒక్క సింహమే కాదు సకల జీవరాశులు వాహనాలయ్యే భాగ్యాన్ని ప్రసాదించమని ప్రార్థిస్తాయట. ఆ పరాత్పరునికి ఒక్క పేరేమిటి ఒక్క రూపమేమిటి. సకల జీవరాశులలోను ఆయనే, సకల చరాచర సృష్టిలోను ఆయనే కనిపిస్తాడు.

**"పరమాత్మనే శతతమేక రూపిణే దశరూపిణే శత సహస్రరూపిణే**
**అవికారిణే స్ఫుటమనంత రూపిణే సుఖచిత్సమస్త తనవే నమో నమః॥"**

సకల జంతువులలోనూ సింహానికి ఒక ప్రత్యేకత ఉన్నది. సింహం మృగరాజు. అరణ్యంలోని సకల జంతుజాలాన్ని తన అధీనంలోనికి తెచ్చుకుంటుంది. మృగరాజుగా భాసిస్తుంది. ఎవరూ సింహాన్ని మృగరాజుగా నిర్ణయించవలసిన పనిలేదు. తనే స్వయంగా మృగరాజవుతుంది. ఇదే విషయాన్ని చెబుతూ...

**నాభిషేకః న సంస్కారః సింహస్య క్రియతే మృగైః**
**విక్రమార్జిత రాజ్యస్య స్వయమేవ మృగేంద్రతా॥** అంటారు.

అలాగే ఆ శ్రీహరికూడా తన అవక్ర విక్రమ పరాక్రమాలచేత తనే దేవాది దేవునిగా సర్వోత్తమునిగా ప్రకటించుకున్నాడు. అందుకే భగవద్గీతలో "మృగాణాం చ మృగేంద్రో హం" అంటాడు. అంతేకాదు యోగశాస్త్రం ప్రకారం సింహం వహనశక్తికి ప్రతీక. సింహం బలానికి ప్రతీక. అందుకే భీముడు సింహబలుడైనాడు. ఎంతటి బలవంతులైనాకూడా స్వామి అనుగ్రహం లేకపోతే బలహీనులవుతారు. స్వామికి సింహంపట్ల అపార కరుణ ఉన్నది. అంతేకాదు దుష్టశిక్షణ శిష్టరక్షణకై స్వామివారు ధరించిన దశావతారాలలో నరసింహావతారం నాల్గవది.

**"మత్స్యఃకూర్మో వరాహశ్చ నారసింహశ్చ వామనః**
**రామో రామశ్చ కృష్ణశ్చ బౌద్ధశ్చకల్కి రేవ చ"**



అని దశావతారాలను పేర్కొంటారు. సోమకాసురుని సంహరించి వేదాలను రక్షించేందుకు స్వామి మత్స్యావతారాన్ని ధరించాడు. అమృత భాండాన్ని రప్పించి దేవతలను రక్షించేందుకు క్షీరసాగర మథనంలో మందరపర్వతాన్ని తన వీపుపై మోస్తూ కూర్మావతారాన్ని స్వామి ధరించాడు. దుష్ట హిరణ్యాక్షుని సంహారంచేసి భూదేవిని రక్షించేందుకు వరాహావతారాన్ని ధరించాడు స్వామి. ఇక శ్రీవారి నాల్గవ అవతారమే నృసింహావతారం. శాపవశాత్తు శ్రీహరి ద్వేషిగా జన్మించి శ్రీహరికి అత్యంత ప్రీతిపాత్రమైన యజ్ఞయాగాది క్రతువులను వాటిని నిర్వహిస్తున్న హరిభక్తులైన మునులను, ఋషులను, భక్తజనాలను బాధించి, పీడించి, నిర్బంధిస్తు పాపం మూటకట్టుకున్నాడు హిరణ్యకశిపుడు. ప్రకృతి విరుద్ధాలైన వరాలను బ్రహ్మదేవునిచేత పొంది అధర్మానికి, అన్యాయానికి, అరాచకానికి, అక్రమానికి, పాల్పడ్డాడు. "హరినామస్మరణ మానను" అని మొండికేసిన తన కుమారుడు చిన్ని ప్రహ్లాదుని అనేక విధాలైన బాధలకు గురిచేశాడు హిరణ్యకశిపుడు. ప్రహ్లాదుడు ఎంత చెప్పినా హరిద్వేషం మానలేదు. ఆ శ్రీహరిని నాశనం చేసేవరకు ఊరుకోనని శ్రీహరి ఎక్కడున్నాడని అడుగగా ప్రహ్లాదుని మాటలను నిజంచేస్తూ నిజభక్తుడైన విధాత హిరణ్యకశిపునికి ఇచ్చిన వరాన్ననుసరించి అందుకు తగినట్లుగా సభామధ్యంలో స్తంభంనుండి స్వామి నర మృగశరీరంతో నృసింహునిగా అవతరించాడు.. ఇదే విషయాన్ని భాగవతంలో వేదవ్యాస మహర్షి ఈక్రింది విధంగా వర్ణించారు.

**"సత్యం విధాతు నిజభృత్యభాషితం। వ్యాప్తంచ భూతేష్వఖిలేషు చాత్మనః**
**అదృశ్యతాత్యద్భుత రూపముద్వహన్। స్తంభే సభాయాం నమృగం న మానుషం॥**
**ససత్వమేవం పరితోవిశిశ్యన్ స్తంభస్య మధ్యాదనునిర్జిహానమ్**
**నాయం మృగో నాపి నరో విచిత్ర మహో కిమేత్ నృమృగేంద్రరూపం॥"**

తన భక్తుడైన ప్రహ్లాదుని రక్షణకై స్వామి బ్రహ్మసృష్టికి విరుద్ధరూపంతో సింహం ముఖం మానవ దేహంతో సభామధ్యలో స్తంభంనుండి ఆవిర్భవించి హిరణ్యకశిపుడిని సంహరించాడు శ్రీహరి.

ఈ బ్రహ్మోత్సవాలలో స్వామివారు ఉదయం సాయంత్రం ఒక్కొక్క వాహనాలలో ఊరేగుతూ భక్తులను అనుగ్రహిస్తున్నారు. స్వామివారికి వాహనంగా రావడానికి హనుమ, గరుడ, శేషులే కాదు సూర్య చంద్రులు, కల్పవృక్షం సింహ, గజ, హంస, తరగాదులు కూడా సిద్ధమై ధన్యతనొందుతున్నాయి. స్వామి వారు ఈనాడు సింహవాహనంపై ఆసీనులై ఉరేగుతూ సకల ప్రజలను, సకల జీవరాశిని, సకల చరాచర సృష్టిని అనుగ్రహిస్తున్నారు. స్వామి వారి దివ్య మంగళ స్వరూపాన్ని ఒక్కసారి మనం దర్శిస్తే...

**"దర్శింప గంటి మందస్మిత స్ఫుట దీప్తి లలిత భవన్ముఖోల్లాస గరిమ**
**సేవింపగంటి నీ శృంగార భరిత భావిత దివ్యమంగళ విగ్రహంబు**
**బొడగంటి నే నీదు భూరివిక్రమ లసత్ పంచాయుధ సమేత బాహుసమితి**
**గనుగొంటి భువన పావన దేవతార్చన యుష్మత్పదాంభోజ యుగ్మకంబు**

స్వామివారి అవతారాలన్నింటికంటే అత్యంత ఉగ్రతతో కూడుకున్న అవతారం నృసింహావతారం. నృసింహావతారం సద్యోఅవతారం. అంటే రామావతారంలో కౌసల్యా దశరథులకు, కృష్ణావతారంలో దేవకివసుదేవులకు శిశువుగా జన్మించిన విధంగా కాకుండా ఉన్నట్టుండి యథాతథంగా ఉద్భవించడం. నిజ భక్తుడైన ప్రహ్లాదుడు స్తంభంలో ఉన్నాడని చెప్పగానే స్వామి అదే స్తంభంలో సాక్షాత్కరించాడు. అలా అవతరించిన స్వామి ఎలా ఉన్నాడనే విషయాన్ని వేదవ్యాసులవారు భాగవతంలో చాలా చక్కగా వర్ణించారు.

**"కరాల దంష్ట్రం కరవాల చంచలం । క్షురాంత జిహ్వం భ్రుకుటీ ముఖోల్బణం**
**స్తంభోర్ధ్వ కర్ణం గిరికందరాద్భుతం వ్యాత్తస్యనాసం హనుభేదభీషణమ్**
**దివిస్పృశత్కయ మదీర్ఘ పీవర గ్రీవోరువక్షః స్థలమల్పమధ్యమమ్**
**చంద్రాంశు గౌరైశ్చురితం తనూరుహైర్విశ్వ గ్భుజానీక శతైర్నఖాయుధమ్**
**దురాసదం సర్వ నిజేత రాయుధప్రవేకవిద్రావిత దైత్యదానవమ్ ॥**

**- భాగవత సప్తమ స్కంధం**



నృసింహస్వామి దుష్టులను ఎంతగా శిక్షిస్తాడో భక్తులను అంతగానే అనుగ్రహిస్తాడు. నృసింహమూర్తిని ఒకసారి మనం సందర్శిస్తే స్వామి ముఖం మాత్రం సింహం, దేహం మనుష్యదేహం. అంటే ముఖాన్ని చూపి భయపెట్టినా మనసుమాత్రం నవనీతం. సింహం తను ఉదయం నుండి చేసిన పనులన్నిటిని సాయంత్రం మళ్ళీ ఒకసారి గుర్తుకు తెచ్చుకుంటుంది. దీనినే మనం 'సింహావలోకనం' అంటాం. అలాగే స్వామి కూడా తన ఏ ఏ భక్తులకు ఏమేమి ఇవ్వాలని నిరంతరం ఆలోచిస్తూనే ఉంటాడట ప్రసాదిస్తూనే ఉంటాడట. కాబట్టి స్వామి మనసును మనం భక్తితో గెలవాలి. ఇందుకు నిదర్శనం ప్రహ్లాదుడు. ఎన్ని కష్టాలు వచ్చిన ప్రహ్లాదుడు మాత్రం నిరంతరం హరినామస్మరణ, హరిభక్తిమాత్రం మానలేదు. అందుకే స్వామి ప్రహ్లాదున్ని అనుగ్రహించాడు.

**"ప్రహ్లాదాహ్లాదకం లక్ష్మీనృసింహం భక్త వత్సలం**
**దైత్య మత్తేభ దమనం శ్రీనివాసం భజేనిశమ్ ।**

శ్రీహరి శత సహస్రరూపాలలో ఉన్నవాడు. ఏ రూపంలో ఉన్నా శ్రీహరిని మనం ధ్యానంచేస్తే ఏం కలుగుతుందంటే

**నమస్తే వ్యాఘ్రరూపాయ సర్వదుఃఖ నివారిణే**
**నమస్తే వానర రూపాయ సర్వశత్రువినాశినే**
**నమస్తే వరాహరూపాయ సర్వ సంపత్ ప్రదాయినే**
**నమస్తే గజరూపాయ సకలైశ్వర్య కారిణే**
**నమస్తే అశ్వ వక్త్రాయ సర్వవిద్యా ప్రదాయినే**
**నమస్తే గరుడరూపాయ దుష్ట పన్నగ హారిణే**
**నమస్తే భల్లూక వక్త్రాయ శత్రుస్తంభన కారిణే** అంటూ ఏ ఏ రూపంలో హరిని స్మరిస్తే ఏమేమి కలుగుతాయో మనకు పురాణాలు చెబుతున్నాయి.

నృహింహస్వామికి తిరుమలకు అనన్య సంబంధం ఉన్నది. తిరుమల ఆలయంలో యోగనృసింహస్వామి కొలువుదీరి ఉన్నాడు. అలాగే కాలిబాటలో కూడా లక్ష్మీనృసింహుడు కొలువుదీరి ఉన్నాడు. అంతేకాదు శ్రీనివాసుడు పద్మావతీ పరిణయోత్సవవేళ వచ్చిన దేవతలకు సమర్పించు విందుభోజనాన్ని ముందుగా అహోబిల నృసింహునికి నివేదన చేయుమని ఆజ్ఞాపించాడట. అంటే మనం కూడా మనం భుజించే ఆహారం మొదటగా పరమాత్మునికి నివేదన చేసి తినాలని తనే స్వయంగా ఆచరించి చూపాడు శ్రీవేంకటగిరినాథుడు.

ఇక నృసింహావతారంలో ఉన్న స్వామి ఎలాంటి వాడంటే మృత్యువుకే మృత్యువువంటి వాడట ఈ విషయాన్ని ఋజువు చేస్తూంది ఈ శ్లోకం.

**"ఉగ్రం వీరం మహావిష్ణుం జ్వలంతం సర్వతోముఖం**
**నృసింహం భీషణం భద్రం మృత్యు మృత్యుం నమామ్యహం".** అంటారు.

సింహం శౌర్యానికి ప్రతీక. సింహం దర్పానికి ప్రతీక. సింహం రాజసానికి ప్రతీక అందుకే రాజసింహం అయ్యింది. అటువంటి రాజసింహాన్నే తన వాహనంగా మలచుకున్న రాజాధిరాజు, దేవదేవుడు సర్వం సహాచక్రవర్తి చతుర్దశ భువనాధీశుడు మన అహోబల నారసింహుడు.

"నారసింహ నామస్మరణ ప్రాముఖ్యతను గురించి చెబుతూ..

**నరసింహ తే దివ్య నామమంత్రేణైవ దురిత జాలానీహ దూరయేచ్చ**
**నరసింహ తే దివ్య నామమంత్రేణైవ దీర్ఘరోగానాపి నాశయేశ్చ**
**నరసింహ తే దివ్య నామమంత్రేణైవ శత్రుసంఘానాపి సంహరేచ్చ**
**నరసింహ తే దివ్య నామమంత్రేణైవ యమకింకరానపి ధావయేచ్చ**

**తవతు నామ మంత్రబలేన భవతి దేవ**
**దివ్య వైకుంఠ పదమపి సులభమేవ...**



కనుక నరసింహనామ మంత్రబలంచేత ఇన్నింటిని సిద్ధించుకోవచ్చు. సింహవాహనంపై విహరిస్తున్న నరసింహస్వామివారిని గూర్చి ఈ కీర్తనలో అన్నమయ్య ఎంత చక్కగా కీర్తించాడో ఒక్కసారి చూద్దామా...

**అహోబలేశ్వరుడు అరికులదమనుడు**
**మహా మహిమలను మలసీ వాడె॥**

**కదలు కన్నులును కరాళవదనము**
**గుదిగొను భయదపు కోరలును**
**అదరు మీసములు అలరగ నవ్వుచు**
**వుదుటుతోడ కొలువున్నాడు వాడే॥**

**అతిసిత నఖములు అనంత భుజములు**
**వితత పరాక్రమ వేషమును**
**అతుల దీర్ఘజిహ్వాయు కడుమెరయగ**
**మితిలేని కరుణ మెరసీ వాడే॥**

**సందడి సొమ్ములు శంఖ చక్రములు**
**పొందుగ దివిజులు పొగడగను**
**ఇందిరందొడ్డపై నిడి శ్రీవేంకట**
**మందు నిందు కడు నలరీ వాడే॥**

సింహంక్రూరత్వానికి, క్రూర స్వభావానికి ప్రతీక. అటువంటి సింహాన్ని అదిమిపట్టి సింహవాహనంపై విహరిస్తున్న నృసింహస్వామివారిని దర్శిస్తే క్రూరస్వభావం తొలగి సాత్విక స్వభావం సిద్ధిస్తుంది. శత్రుభయం, అకాల మృత్యుభయం, రోగజరాభయాలు, భూత, ప్రేత, పిశాచపీడలు, తొలగి స్వామివారి అనుగ్రహం సిద్ధిస్తుంది.

## హంసవాహనం

ప్రహ్లాదవరద స్వామివారు బ్రహ్మోత్సవాలలో రెండవరోజు ఉదయం హంసవాహనాన్ని అధిరోహిస్తారు.

'హంస' అనే పదానికి అనేక అర్థాలున్నాయి. హంస సృష్టికర్త అయిన బ్రహ్మదేవునికి వాహనంగా ప్రసిద్ధం. పరమాత్మతో సంయోగం చెందిన మహనీయులను "పరమహంస" అని వ్యవహరిస్తారు. సదా గమనశీలుడైన సూర్యభగవానుని కూడా "హంస"గా వ్యవహరిస్తారు.

**"ధ్యేయస్సదా సవితృమండల మధ్యవర్తీ**
**నారాయణః సరసిజాసన సన్నివిష్టః"** అని చెప్పినట్లు శ్రీమన్నారాయణుడు హంసశబ్దవాచ్యుడై సూర్యునిలో నివసిస్తున్నాడు. అందుకే మనం సూర్యభగవానున్ని సూర్యనారాయణుడిగా ఆరాధిస్తున్నాం.

హంసవాహనాన్ని అధిరోహించి విహరిస్తున్న నృసింహస్వామివారు సూర్యనారాయణునికి ప్రతీక.

"గుంభనమున దుగ్ధజీవన విభాగ విధాన నిరూఢ నిపుణీజనిత మహాయశోవిభవసారము" అను గుణము కలది హంస. అంటే పాలు, నీరు వేరుచేయుటయందు నేర్పరితనం కలిగిన కీర్తిసంపద కలది హంస. పాలునీరు కలిపి వుంచితే పాలను మాత్రం గ్రహించి నీటిని వదిలేస్తుంది. హంస పాలను నీటిని వేరుచేసినట్లు మనం గుణావగుణాలలో గుణాలను స్వీకరించి అవగుణాలను వదిలివేయాలి. లౌకిక విషయాలను వదిలి పారమార్థిక విషయాలను పొందాలని భక్తులను ప్రేరేపిస్తున్నాడు స్వామి. అటువంటి హంసపై హంసనామక పరామాత్ముడు అహోబలనారసింహుడు" విహరిస్తున్నాడు.

హంస మానససరోవరంలో విహరిస్తుంది. పరమాత్మ భక్తుల మానస సరోవరంలో విహరిస్తూ ఆనందాన్ని ప్రసాదిస్తాడు. "హంసచేతి పాలునీళ్ళ



నట్లాయె బ్రతుకు" అనే కీర్తనలో అన్నమాచార్యులవారు ఈ తత్త్వాన్ని కీర్తించారు. హంస వాహనంలోని పరమార్థం ఇదే. ఆత్మానాత్మ వివేకం గలవారికి భగవదనుగ్రహం సంపూర్ణంగా కలుగుతుంది. బ్రహ్మదేవునికి శ్రీహరి హంసరూపంలోనే వేదాలను ఉపదేశించారట.

అదిగో ప్రహ్లాదవరదుడు ఏకాంతంగా వజ్రముకుటాన్ని ధరించి నానావిధాలైన ఆభరణాలను ధరించి శ్వేతాంబరములను ధరించి చక్కటి పుష్పమాలికలతో అలంకరింపబడి హంసవాహనంపై తిరువీధులలో విహరిస్తూ తన భక్తులను అనుగ్రహిస్తున్నాడు.

హంసవాహనంపై విహరిస్తున్న స్వామివారిని గురించి అన్నమాచార్యులవారు వ్రాసిన ఈ కీర్తనలో ఇదే భావం గోచరిస్తుంది.

**దిబ్బలు వెట్టుచు దేలిన దిదివో**
**ఉబ్బు నీటిపై నొక హంసా**

**అనువున గమల విహారమె నెలవై**
**ఒనరి యున్నదిదె ఒక హంస**
**మనియెడిజీవులమానససరసుల**
**వునికి నున్నదిదె వొక హంస**

**పాలు నీరు వేర్పఱచి పాలలో**
**నోల లాడె నిదె వొక హంస**
**పాలు వడిన యీ పరమహంసముల**
**ఓలి నున్న దిదె వొక హంస**

**తడవి రోమ రంధ్రంబుల గ్రుడ్ల**
**నుడుగక పొదిగీ నొక హంసా**
**కడు వేడుక వేంకటగిరి మీందట**
**నొడలు వెంచె నిదె యొక హంస**

"సోఽహం" భావం కలిగిన భక్తులలో అహంభావం తొలగించి "దాసోఽహం" అనే భావాన్ని కలిగించడానికే నరసింహస్వామివారు తిరువీధులలో హంసవాహనంపై విహరిస్తున్నారు. హంసవాహనోత్సవంలోని పరమార్థం ఇదే.

## సూర్యప్రభ వాహనం

బ్రహ్మోత్సవాలలో ప్రహ్లాదవరదస్వామివారు సూర్యప్రభవాహనంపై తేజోవిరాజితుడై దర్శనమిస్తున్నాడు. సూర్యుడు తేజస్సంపన్నుడు, సకలరోగ నివారకుడు. చైతన్యప్రదాత, లోకాన్ని ఆవరించిన తిమిరాలను తొలగించి తేజస్సును చైతన్యాన్ని ప్రసాదిస్తాడు. తన కిరణాలచే నీటిని ఆవిరిపరచి మేఘాలను ఏర్పరచి వర్షాన్ని, వర్షాలవల్ల ఫలసాయాన్ని ప్రసాదిస్తాడు. అంతేకాక చంద్రునికి వెన్నెల కాంతులను కూడా ప్రసాదిస్తాడు. అట్టి సూర్యప్రభను అధిరోహించిన ప్రహ్లాదవరదుడు సవిత్రుమండల మధ్యవర్తిగా వెలుగొందుతున్నాడు.

అందుకే ప్రతినిత్యం ఉదయాన్నే భారతీయులు సూర్యోపాసన చేసే పద్ధతి అలవడింది. గాయత్రీ మంత్రంతో దేదీప్యమానుడైన సూర్య నారాయణుని శ్రేష్ఠాతిశ్రేష్ఠమైన తేజస్సును ఆరాధిస్తాం. అదే తేజస్సు మన బుద్ధులకు ప్రేరణను కలిగిస్తుంది. సూర్యుడు సప్తాశ్వరథారూఢుడై అవిశ్రాంతంగా ప్రతినిత్యం విహరిస్తూ తన తేజస్సుతో లోకాన్ని చైతన్యవంతం చేస్తున్నాడు. సూర్యుడు కర్మసాక్షి, ప్రత్యక్షదైవం. సూర్యప్రభల నడుమ ప్రహ్లాదవరదుడు ఆసీనుడై వెలుగులీనుతున్నాడు. "ఆరోగ్యం భాస్కరా దిచ్ఛేత్" అని వేదవాక్యం.

అదిగో కోటి సూర్యప్రభులను వెదజల్లుతూ సవిత్రమండల మధ్యవర్తి అయిన శ్రీమన్నారాయణుడు ప్రహ్లాదవదరునిగా ఏకాంతంగా ఎట్టటి



వస్త్రాలను ధరించి భక్తుల అనేకానేక కోరికలను తీరుస్తూ సూర్య ప్రభావాహనంపై తిరువీధులలో విహరిస్తున్నాడు. ఒక్కసారి ఆ సూర్యమండల మధ్యవర్తి అయిన ఆ ప్రహ్లాదవరదుని మనసారా చూచి తరించండి.

సూర్యప్రభవాహనంపై విహరిస్తున్న స్వామివారిని అన్నమాచార్యులు ఈ క్రింది కీర్తనలో చక్కగా వర్ణించారు.

**విపరీతము లివి వినరాదు**
**పుపమ లెల్ల మీ వొద్దనె కలిగె**

**వువిద వదన చంద్రోదయ వేళను**
**రవియగు సూర్యప్రభ నీవేఁగగ**
**యివల నవల మీ యిద్దరి వలననే**
**దివమును రాతిరి దెలియఁగ గలిగె**

**అంగన తురుము మహర్నిశివేళను**
**రంగగు సూర్యప్రభ నీవేఁగఁగ**
**సంగడి వెలుఁగుచు సరిఁజీకటియును**
**చెంగట మీ యందే చెప్పగఁగలిగె**

**కాంతమోవి చుక్కల నిండువేళ**
**రంతుల సూర్యప్రభ నీవేఁగఁగ**
**యింతట శ్రీ వేంకటేశ్వర మీ యందే**
**కాంతులు ఁగళలును ఁగలయుట గలిగె.**

సూర్యోపాసనవల్ల ఆరోగ్యం, విద్య, ఐశ్వర్యం, కవిత్వం, సంతానం మొదలైన ఫలాలు లభిస్తాయి. యజుర్వేదంలోని చాక్షుషోపనిషత్ ప్రకారం సూర్యోపాసనవల్ల కంటి జబ్బులు తొలగిపోతాయి.

సూర్యప్రభ వాహనంపై విహరిస్తున్న నృసింహస్వామివారి దర్శనభాగ్యంవల్ల భక్తకోటికి ఆయురారోగ్య ఐశ్వర్యాలు, స్వామివారి కృపాకటాక్షాలు పరిపూర్ణంగా సిద్ధిస్తాయి.

"సూర్యప్రభవాహనారూఢా...అహోబిల నారసింహ..గోవిందా... గోవింద.

## హనుమంతవాహనం

బ్రహ్మోత్సవాలలో భాగంగా స్వామివారు తిరువీధులలో హనుమంత వాహనంపై విహరిస్తున్నారు. శ్రీ వైకుంఠంలో వేంచేసిన శ్రీమన్నారాయణుడు పర, వ్యూహ, విభవ, అంతర్యామి రూపాలో విహరిస్తుంటాడు. పరరూపమంటే పరమపదంలో బ్రహ్మాది దేవతలకుసైతం దుర్గమమైన పరమపదంలో చెరించే స్వామి. వ్యూహమంటే ఆమోద సమ్మోద ప్రమోద వైకుంఠాఖ్యాది లోకాలలో విష్ణు, మహావిష్ణు, సదావిష్ణు, వ్యాపినారాయణుడిగా చతుర్విధ భేధంతో విహరించే స్వామి. విభవమంటే దశావతారాల్లో దుష్టశిక్షణార్థం ఆ యా కాలాల్లో ఘట్టాల్లో అవతరించి దుష్టశిక్షణ గావించి తిరిగి వైకుంఠాన్ని చేరే స్వామి విభవమూర్తి. నాల్గవది అంతర్యామితత్త్వం తన సృష్టి అయిన సకల చరాచర జీవరాశుల్లో అంతర్యామిగా జీవాత్మగా ప్రకాశించే స్వామి.

ఈ చతుర్మూర్తులను దర్శించి తరించడం మహాయోగులకు, ఋషులకు, మునులకు తపస్సంపన్నులకు మాత్రమే సాధ్యం. ఎటువంటి యోగశక్తి, ఆధ్యాత్మిక భావనలేని పామరులైన మానవులను ఉద్ధరించేందుకు ప్రకృతిసిద్ధంగా లభించిన భౌతిక ఇంద్రియాలతో చూడగలిగే, తాకగలిగే మూర్తిగా, అర్చావతార స్వరూప విగ్రహస్వరూపంగా స్వామి వేంచేశారు. రామావతారం, కృష్ణావతారాలు ఇట్టి అవతారాలే.



**కృతేతు నారసింహ శ్చ త్రేతాయాం రఘునందనః**
**ద్వాపరే వాసుదేవ శ్చ కలౌ వేంకటనాయకః**

కృతయుగంలో నరసింహస్వామి, త్రేతాయుగంలో శ్రీరామచంద్రుడు, ద్వాపరయుగంలో శ్రీకృష్ణుడు, కలియుగంలో వేంకటేశ్వరస్వామి ఒక్కరే. శ్రీమహావిష్ణువు అవతారాలే. అందుకే స్వామివారికి సుప్రభాత సేవను నిర్వహిస్తూ...

**"కౌసల్యా సుప్రజారామ పూర్వా సంధ్యా ప్రవర్తతే**
**ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికం"** అంటూ శ్రీరామచంద్రుని పేరుతోనే స్వామివారికి నిద్రమేల్కొలుపు సేవను నిర్వహించడం జరుగుతుంది. "లోక కల్యాణంకొరకే కృతయుగంలో నారసింహునిగా, త్రేతాయుగంలో శ్రీరామచంద్రునిగా అవతరించాను. ఈ విషయాన్ని జ్ఞప్తికి తీసుకొచ్చే నిమిత్తమే నేను హనుమంతుని భుజస్కంధాలను అధిరోహించాను" అని తెలియజేస్తున్నట్లుగా ఆ అహోబిలేశుడు హనుమద్వాహనంపై విహరిస్తున్నాడు.

హనుమంతుడు దాసభక్తికి ప్రతీక. భక్తులారా మీరు హనుమంతుని వలె దాసభక్తి మార్గాన్ని అనుసరించి నాకు దాసులై అభీష్టసిద్ధిని పొందండి అంటూ అహోబిలేశుడు హనుమద్వాహనంపై నుండి సందేశాన్నిస్తున్నాడు.

రామరావణయుద్ధ సందర్భంలో శ్రీరామచంద్రుడు హనుమంతుని భుజస్కందాలను అధిరోహించి యుద్ధంచేశాడు. భగవంతునికంటే భక్తుడే బలవంతుడని హనుమంతుడు ఋజువుచేశాడు. అంతేకాక నిరంతరం స్వామివారి సేవకు సిద్ధంగా ఉంటూ, అహోబిలేశుని క్షేత్రాన్ని రక్షిస్తూ క్షేత్రపాలకుడై యున్నాడు. ప్రతిరోజు స్వామివారి ఆలయం రక్షణ బాధ్యతను స్వీకరించి స్వామివారి శయనోత్సవానంతరం ఆలయం బీగాలను తనవద్ద ఉంచుకొని రక్షిస్తూ "బీగాల ఆంజనేయస్వామి"గా అహోబిలక్షేత్రంలో భక్తుల

పూజలందుకుంటున్నాడు. ప్రతిరోజు ఉదయం సాయంత్రం స్వామివారి ఆరగింపు సేవానంతరం తాను ఆరగింపు సేవలను అందుకుంటున్నాడు.

హనుమంతవాహనంపై విహరిస్తున్న స్వామివారిని అన్నమాచార్యులు ఈ క్రింది కీర్తనలో చక్కగా వర్ణించారు.

**ఓ పవనాత్మజ ఓ ఘనుఁడ**
**బాపు బాపనఁగఁబరగితిగా**

**వోహనుమంతుఁడ వుదయాచల ని**
**ర్వాహక నిజసర్వ ప్రబల**
**దేహము మోఁచిన తెగువకు నిటువలె**
**సాహసమిటువలె ఁజూటితిగా**

**వో రవి గ్రహణ వో దనుజాంతక**
**మారులేక మతి మలసితిగా**
**దారుణపు వినతాతనయాదులు**
**గారవింప నిటు గలిగితిగా**

**వో దశముఖహర వో వేంకటపతి**
**పాదసరోరుహపాలకుఁడా**
**యీ దేహముతో నిన్ని లోకములు**
**నీ దేహమెక్క నిలిచితిగా**

రాముడు భక్తాగ్రగణ్యుడైన హనుమంతునికి ఆత్మతత్త్వాన్ని బోధించినట్లు ప్రాచీన వాఙ్మయం నుండి అవగతమవుతుంది. శ్రీవైష్ణవ సంప్రదాయంలో గరుడుని పెరియ తిరువడిగా, హనుమంతుని సిరియ తిరువడిగా కీర్తిస్తారు. గురుశిష్యులైన శ్రీరామ హనుమంతులు తత్త్వవివేచన కావించిన మహనీయులు. కనుక వాహ్య, వాహక రూపంలో ఈ ఇరువురినీ చూచినవారికి వేదాంత తత్త్వం అవగతమవుతుంది.



అంజనీసుతుడైన ఆంజనేయుని వాహనంగా చేసుకున్న స్వామివారిని దర్శించడంవల్ల భూత, ప్రేత, పిశాచ బాధలు తొలగి, సద్విద్య, సత్సాంగత్యం లభిస్తాయని పురాణాలు చెబుతున్నాయి.

## శేషవాహనము

హనుమద్వాహనోత్సవం జరిగిన మర్నాడు ఉదయం ప్రహ్లాదవరద స్వామివారు ఉభయదేవేరులతో కలిసి శేషవాహనంపై విహరిస్తున్నారు.

ఆదిశేషుడు శ్రీహరికి మిక్కిలి సన్నిహితుడు. రామావతారంలో లక్ష్మణుడిగా, ద్వాపరయుగంలో బలరాముడిగా శ్రీమహావిష్ణువుకు మిక్కిలి సన్నిహితునిగా మెలిగినవాడు ఆదిశేషుడు. శ్రీవైకుంఠపురంలోని నిత్యసూరులలో శేషుడే ఆద్యుడు. సమస్త భూభాగాన్ని తన శిరస్సుపై వహిస్తున్నవాడు ఆదిశేషుడే. శ్రీ, భూ, నీళాసమేతులైన ప్రహ్లాదవరద స్వామివారు తొమ్మిదిపడగల ఆదిశేషునిపై మనకు దర్శనమిస్తున్నారు.

కలియుగంలో ఆదిశేషుడు శేషాచలంగామారి శిరస్సున కలియుగ ప్రత్యక్షదైవమైన శ్రీవేంకటేశ్వరస్వామివారిని, నడుముభాగాన అహోబిల నారసింహస్వామివారిని, తోకభాగాన శ్రీశైల మల్లికార్జునుని స్వయంవ్యక్త అర్చామూర్తులుగా నిలుపుకున్నాడు.

ఆదిశేషుడు అనంతకాలానికి ప్రతీక. అంతేకాక పరమపదంలో ఆ శ్రీమహావిష్ణుమూర్తికి,

**“నివాస శయ్యాసన పాదుకాంశుకో**
**పధాన వర్షాతప వారణాదిభిః**
**శరీరభేదైస్తవ శేషితాం గతైః**
**యథోచితం శేష ఇతీర్యతే జనైః**

ఆదిశేషుడు నివాసంగా, శయ్యగా, ఆసనంగా, పాదుకలుగా, ఉత్తరీయంగా, తలగడగా, ఎండవానల నుండి రక్షించే ఛత్రంగా, పాదపీఠంగా, సేవకుడిగా

శరీరభేదం కలిగి ఆ శ్రీహరికి శేషత్వ పాత్రుడైనాడు. స్వామి శేషి మిగతా లోకమంతా శేషం. ఈ శేష, శేషి సంబంధాన్ని తెలిపేదే స్వామివారి శేషవాహనం.

అదిగో శేషవాహనంపై స్వామివారు ఉభయదేవేరులతో కలిసి సుదర్శన పాంచజన్య నందక కౌమోదకి. శార్ఙాది పంచాయుధాలతో ఒక కాలును మడిచి మరో కాలును ముందుకు ప్రహారంచేసి అభయహస్తంతో పరమపదంలో వేంచేసివుండే తిరుక్కోల రూపంలో దర్శనమిస్తున్నారు ఒక్కసారి ఆ స్వామివారిని దర్శించండి.

శేషవాహనం దాస్యభక్తికి ప్రతీక. ఆ భక్తితో పశుత్వం తొలగి మానవత్వం దానినుండి దైవత్వం ఆపై పరమపదం సిద్ధిస్తాయి. ఈ సందేశాన్ని అందించేందుకే ఆ అహోబిలేశుడు తిరుమాడ వీధులలో శేషవాహనంపై విహరిస్తున్నాడు. విశేష జ్ఞానబలంకలవాడు, తన ఫణిమణి కాంతులచే దివ్య వైకుంఠ విమానాన్ని ప్రకాశింపజేస్తున్నాడు ఆదిశేషుడు.

ఆదిదేవునికి వాహనంగా మారిన ఆ ఆదిశేషుని ఘనతను గురించి అన్నమాచార్యులు ఈ క్రింది కీర్తనలో చక్కగా వర్ణించారు.

**వీఁడుగదే శేషుఁడు శ్రీ వేంకటాద్రి శేషుఁడు**
**వేఁడుక గరుడనితో ఁబెన్నుద్దైన శేషుఁడు**

**వేయి పడిగెల తోడ వెలిసిన శేషుఁడు**
**చాయమేని తళుకు వజ్రాల శేషుఁడు**
**మాయని శిరసులపై మాణికాల శేషుఁడు**
**యేయెడ హరికి నీడై యేఁగేటి శేషుఁడు**

**పట్టపు వాహనమైన బంగారు శేషుఁడు**
**చుట్టుచుట్టుకొనిన మించుల శేషుఁడు**
**నట్టుకొన్న రెండు వేలు నాలుకల శేషుఁడు**
**నెట్టిన హరిఁబొగడ నేరుపరి శేషుఁడు**

**కదిసి పనులకెల్లఁగాచుకున్న శేషుఁడు**
**మొదల దేవతలెల్లా మొక్కే శేషుఁడు**
**అదె శ్రీ వేంకటపతి కలమేలుమంగకును**
**పదరక యే పొద్దూ పానుపైన శేషుఁడు**

విషోదగ్నుడైన ఆదిశేషుని అదిరోహించిన ఆదిదేవుడు విషతుల్యమైన మానవుని కిల్బిషాన్ని కూడా తొలగిస్తున్నాడు. శేషవాహనంపై విహరిస్తున్న ఆ నరహరిని దర్శిస్తే సర్పభయం, విషభయం తొలగిపోతాయి.

## చంద్రప్రభ వాహనం

నవగ్రహాలలో అధిష్ఠాన స్థానం చంద్రుడిది. బ్రహ్మోత్సవాలలో భాగంగా ప్రహ్లాదవరద స్వామివారు ఉభయ దేవేరులతో చంద్రప్రభవాహనంపై ఆసీనులై భక్తులకు దర్శనమిస్తూ అనుగ్రహిస్తున్నారు.

చంద్రుడు అనేక ఔషధాలకు, వనస్పతులకు అధిష్ఠానదైవం. క్షీరసాగర మథన సమయంలో శ్రీమహాలక్ష్మికి తోబుట్టువుగా జన్మించినవాడు చంద్రుడు. అందుకే శ్రీమహాలక్ష్మి అష్టోత్తరంలో "చంద్రసహోదరీం" అని స్తుతిస్తారు. ఇదే అష్టోత్తరంలో "చంద్రశీతలాం" అని కూడా వస్తుంది. అట్టి మహాలక్ష్మి తోబుట్టువైన చంద్రునిపై అధిరోహించి స్వామివారు శ్రీదేవి భూదేవి సమేతులై విహరిస్తూ భక్తజనులను అనుగ్రహిస్తున్నాడు. శుక్లపక్ష చంద్రునిపై ధవళవర్ణ పుష్పాలతో అలంకరింపబడి దర్శనమివ్వడం చాలా విశేషమైన విషయం.

శ్రీమహావిష్ణువుకు చంద్రసూర్యులు ఇరువురులో రెండునేత్రాలు. నిశాకరుడు, నెలతేడు భగవత్ స్వరూపుడు. గీతాచార్యుడైన శ్రీకృష్ణ

పరమాత్ముడు భగవద్గీతలో "నక్షత్రాణాం అహం శశి" అని పేర్కొన్నాడు. అంటే నక్షత్రాలలో చంద్రుడిని నేనే అంటాడు.

"పుష్ణామి చోషధీః సర్వే సోమోభూత్వా రసాత్మకాః" అని పురుషోత్తమ ప్రాప్తియోగంలో పేర్కొన్నాడు. అనగా పరమాత్ముడు రసస్వరూపుడైన చంద్రుడిగా వుంటూ ఓషధులను పోషిస్తున్నాడు. ఓషధులు లేకపోతే మనకు జీవనమే లేదు. అంటే చంద్రుడూ మనకు పోషకుడే. "యథా ప్రహ్లాదనాత్ చంద్రః" అంటే ప్రహ్లాదాన్ని (ఆనందమును) కలిగించేవాడు. చంద్రుడు కనుకనే ఆ ప్రహ్లాదవరదుడు ప్రహ్లాదంను కలిగించే చంద్రునిపై ఆసీనుడై ఆహ్లాదాన్ని కల్పిస్తున్నాడు.

చంద్రోత్పత్తి భగవంతుని మనసునందే జరిగిందని "చంద్రమా మనసో జాతః" అని వేదాలు వివరిస్తున్నాయి. చంద్రోదయం కాగానే కలువలు వికసిస్తాయి. అలాగే చంద్రప్రభవాహనంపై విహరిస్తున్న స్వామివారిని చూడగానే భక్తుల మానసాంబోధులు ఉప్పొంగుతాయి. భక్తుల నేత్రోత్పలాలు వికసిస్తాయి. భక్తుల మనసులలో ఆనందరసం ప్రవిస్తుంది. ప్రహ్లాదాన్ని ఆహ్లాదాన్ని, ఆనందాన్ని కలిగించేవాడు చంద్రుడు. అటువంటి చంద్రునిపై విహరిస్తున్నారు ప్రహ్లాదవరదస్వామివారు.

ఉభయ దేవేరులతో కలిసి చంద్రప్రభావాహనంపై విహరిస్తున్న స్వామివారిని దర్శిస్తే ఆరోగ్యం, ఐశ్వర్యం, సిద్ధించడంతోపాటు ఆధ్యాత్మిక, ఆధి భౌతిక, ఆధి దైవిక తాపాలనే త్రివిధ తాపాలనుండి విముక్తులౌతారు.

## మోహినీ అలంకారం

స్వామివారి అలంకారాలన్నింటిలోని అత్యంత విశేషమైన అలంకారం జగన్మోహినీ అలంకారం. క్షీరసాగర మథన సమయంలో ఆవిర్భవించిన అమృతాన్ని లోక కల్యాణార్థం సాత్వికులైన దేవతలకు మాత్రమే అందించి తామసులైన రాక్షసులకు అందనీయకుండా మోహంలో పారవేసేందుకు



శ్రీహరి ధరించిన అవతారమే జగన్మోహినీ అవతారం. క్షీరసాగర మథనంలో లక్ష్మీదేవితోపాటు ఆవిర్భవించిన సూర్యచంద్రులు, ఐరావతం అనే గజం, ఉచ్చైశ్రవమనే అశ్వం, కల్పవృక్షం మున్నగువాటిని అన్నిటిని స్వామివారు వాహనాలగా స్వీకరించారు. అంతేకాకుండా సృష్టిలో ఉత్తమోత్తమాలైన వాటిని అన్నిటిని స్వామివారు తన సేవలో తరించేట్లుగా అనుగ్రహించాడు.

భౌతిక విషయాలపట్ల ఉండే మోహాన్ని తొలగించి అమృతమయమైన జ్ఞానాన్ని ప్రసాదించే ఒక అమృతమూర్తిగా మోహినీ అవతారంలో స్వామివారు భక్తులకు దర్శనమిస్తూ వారి మోహాన్ని పటాపంచలు చేస్తున్నారు. సంవత్సరంలో ఒక్కరోజు మాత్రమే స్వామివారు ఇలా స్త్రీరూపంలో భక్తులకు దర్శనమిచ్చి అనుగ్రహిస్తారు.

కమనీయమైన శ్రీకాంతుని రూపం జగత్సమ్మోహకం. "పుంసాం మోహనరూపాయ" అని వేదాలు పేర్కొన్నట్లుగా శ్రీహరి ఏ రూపం ఎత్తినా పురుషులను కూడా సమ్మోహితులను చేస్తాడు.

నరహరి మోహినీరూపాన్ని ఒక్కసారి దర్శించండి. పూలతో కూడిన వాలుజడతో, ముక్కున రత్నాల ముక్కెరతో, వజ్రవైఢూర్యాలతో కూడిన చెవికమ్మలు, చేతులకు వంకీలు, గాజులు, నడుముకు వడ్డాణము, మంగళకరమైన మాంగల్యము, కాలి అందియలు, కంకణాలతో రంగురంగుల ఈ లోకాన్ని రంగుల పుట్టచీరగా మలచి ధరించినస్వామి ఎంతో విలాసవంతంగా, చేత శుకమును ధరించి శిరసుపై చూడామణితో ఆపాదమస్తకం సర్వాభరణ భూషితుడైన నరహరి మోహినీ అవతారంలో శృంగార రసాధి దేవతగా భక్తులను అనుగ్రహిస్తున్నాడు.

సర్వజగత్తు మాయామోహానికి లొంగవలసినదే. మాయామోహకుడు, సర్వజగద్రక్షకుడు, జగన్నాటక సూత్రధారి ఆ శ్రీహరియే. అందుకే

మాయామోహాలలోపడి కొట్టుమిట్టాడుతున్న తన భక్తులను కాపాడేందుకే ఈ మోహినీఅవతారం. స్వామివారు ఈ బ్రహ్మోత్సవాలలో మోహినీ రూపాన్ని ధరించి భక్తులను అనుగ్రహిస్తూ తనకు ప్రపన్నులైన భక్తులను ఈ మాయామోహాలనుండి సులభంగా దాటిస్తున్నాడు.

మోహినీ రూపంలో తిరుమాడవీధులలో విహరిస్తున్న నరసింహ స్వామివారిని దర్శించినవారు లౌకిక విషయాసక్తతను వీడి దివ్యమైన శ్రీహరి అనుగ్రహం పొందుతారని పురాణాలు చెబుతున్నాయి.

## యాళివాహనోత్సవం

శ్రీ వైష్ణవ సంప్రదాయంలోని మరే ఇతర ఆలయాలలోనూ లేనటువంటి కేవలం ఒక్క అహోబిలేశునికే జరిగే వాహనసేవ యాళివాహనోత్సవం లేదా శరభవాహనోత్సవం. శరభం శైవ సంప్రదాయానికి చెందిన వాహనం.

హిరణ్యకశిప వధ అనంతరం ఇంకా ఉగ్రరూపం వీడని స్వామివారిని శాంతింపజేసేందుకు బ్రహ్మేంద్రాది దేవతలందరూ ప్రయత్నించి విఫలులైనారట. అప్పుడు ఆతని కోపాన్ని శాంతింపజేసేందుకు మహేశ్వరుడు నరసింహస్వామితో తలపడి ఆతని కోపం తీరేలా యుద్ధంచేసి చేసి ఓడిపోయాడట. తాను ఓడి తన వాహనమైన శరభాన్ని స్వామివారికి వాహనంగా సమర్పించుకున్నాడట. స్వామి శాంతించకపోవడంతో స్వామివారి ఎదుటనే కూర్చుని శాంతించమని ప్రార్థనచేశాడట. అయినా శాంతించకపోయేప్పటికి ఎవరి రక్షణ కొరకైతే స్వామి ఈ ఉగ్రరూపాన్ని ధరించాడో వారే స్వామిని శాంతింపజేయాలని సంకల్పించి ప్రహ్లాదునికి విన్నవించగా ప్రహ్లాదుడు ఒక్కసారిగా స్వామివారి రెండుపాదాలను గట్టిగా పట్టుకొని శాంతించమని స్తుతించాడట. ప్రహ్లాదుని ప్రార్థనమేరకు స్వామి శాంతించి ప్రహ్లాదవరదుడైనాడని నృసింహపురాణం చెబుతూంది. ఇందుకు ప్రతీకగా ఎగువ అహోబిలంలోని స్వామివారి గర్భాలయంప్రక్కనే ఒక చిన్న



గుహలో ఉగ్రనరసింహస్వామి, ప్రక్కనే ప్రహ్లాదుడు ఎదురుగా లింగరూపంలో పరమేశ్వరుడు మనకు కనిపిస్తారు.

ప్రహ్లాదవరదుని విజయానికి సంకేతంగా పరమేశ్వరుడు సమర్పించుకున్న శరభవాహనం మోహినీ అవతారం తదనంతరం జరగడం ఆనవాయితీగా వస్తున్నది.

అదిగో జియర్‌స్వామివారు పరివారంతోసహా ద్రవిడవేదమును వల్లిస్తుండగా ప్రహ్లాదవరదుడు శరభవాహనంపై ఏకాంతరామునిగా, ధనుర్బాణపాణియైన కోదండరామునిగా అలంకరింపబడి తన భక్తులను అనుగ్రహిస్తూ తిరుమాడవీధులలో విహరిస్తున్నాడు. ఆహా ఆ స్వామివారిని ఒక్కసారి దర్శించండి.

**"నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు మహాశుగంబులన్**
**విల్లును దాల్చువాఁడు గడు విప్పుగువక్షమువాఁడు మేలుపైఁ**
**జల్లెడువాడు నిక్కిన భుజంబులవాఁడు యశంబు దిక్కులం**
**జల్లెడు వాడునైన రఘుసత్తముఁడీవుత మాకభీష్టముల్"** అని

పోతనామాత్యుడు భాగవతంలో వర్ణించినట్లుగా ఆ స్వామి నల్లనిమేనిఛాయతో పద్మలరేకులవంటి విప్పారిన నయనాలతో, గొప్పవైన విల్లమ్ములను చేతబట్టిన స్వామి, విశాలమైన వక్షఃస్థలాన్ని కలిగిన స్వామి, ఎత్తైన భుజములను కలిగిన స్వామి, సకల శుభాలను మనకు ప్రసాదిస్తూ రత్నఖచిత వజ్రవైఢూర్య మరకతమాణిక్య గోమేధికపుష్యరాగాది మణులను పొదిగిన ఆభరణాల నడుమ నల్లటి ఆకాశంలో మెరుపు తీగలా మెరిసిపోతూ శరభవాహనంపై మనకు రామావతారంలో దర్శనమిస్తున్నాడు ప్రహ్లాద వరదస్వామి.

స్వామివారిని శ్రీరామావతారంలో శరభవాహనంపై దర్శనమిస్తున్న స్వామివారిని దర్శిస్తే మృత్యుభయం, శత్రుభయం తొలగి ఆయురారోగ్యాలు సిద్ధిస్తాయి.

## వేణుగోపాలస్వామి అలంకారం

**కృష్ణాయ వాసుదేవాయ హరయే పరమాత్మనే**
**ప్రణతః క్లేశ నాశాయ గోవిందాయ నమోనమః**

ప్రహ్లాద వరదుడు రుక్మిణి సత్యభామా సమేతుడై గోపాలకృష్ణుని అవతారంలో వేణుగానం చేస్తూ, దర్శనమిస్తూ, భక్తులను అనుగ్రహిస్తున్నాడు. శరభవాహనంపై రామావతారంలో దర్శనమిచ్చిన ప్రహ్లాదవరదుడు గోసంరక్షణ బాధ్యతను నిర్వహిస్తున్నట్లుగా రుక్మిణీ సత్యభామలతో కలిసి వేణుగోపాలస్వామిగా దర్శనమిస్తున్నాడు. ఆనాడు తన వేణుగానంతో లోకాన్ని సమ్మోహింపజేసిన వేణుగోపాలుడు నేడు తన భక్తుల హృదయాలను సమ్మోహనపరుస్తూ వేణుగోపాలుడై దర్శనమిస్తున్నాడు.

ఆ దేవదేవుని ఒక్కసారి దర్శించండి.

**"నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు కృపారసంబు పైఁ**
**జల్లెడువాఁడు మౌళిపరిసర్పిత పింఛమువాఁడు నవ్వురా**
**జిల్లెడు మోమువాఁడొకడు"** అని పోతనామాత్యుడు భాగవతంలో వర్ణించినట్లుగా నీలమేఘశరీరుడు, విప్పారిన కలువరేకులవంటి కన్నులు కలవాడు, కృపారసమును అందరిపై వెదజల్లెడువాడు, నల్లటి కురులను చుట్టుముట్టి రంగురంగులు కలిగిన నెమలిపింఛమును శిరసున దాల్చినవాడు, నగుమోమువాడు, చేతకడియాలవాడు, వైజయంతికైమాలను ధరించినవాడు, వేణుగాన వినోదుడు అయిన ఆ రుక్మిణి, సత్యభామ సమేత వేణుగోపాలస్వామిని మనం దర్శిస్తున్నాం.

రుక్మిణి సత్యభామ సమేత వేణుగోపాలుని దర్శించుకున్నవారికి సకల పాపాలు తొలగి సత్ సంతానం ప్రాప్తిస్తుంది.



## పొన్నచెట్టువాహనం

బ్రహ్మోత్సవాలలో భాగంగా ఉదయం వేణుగోపాలస్వామి అలంకారంలో ఉభయదేవేరులతో భక్తులను అనుగ్రహించిన స్వామివారు రాత్రి కొంటెకృష్ణునిగా గోపికా వస్త్రాపహారియైన గోపీజనవల్లభునిగా పొన్నచెట్టువాహనంపై తిరుమాడ వీధులలో విహరిస్తూ భక్తులను అనుగ్రహిస్తున్నారు.

త్రేతాయుగంలో శ్రీరామచంద్రునిగా అవతరించిన శ్రీమహావిష్ణువుయొక్క ముగ్ధమనోహర మోహనరూపాన్ని చూసి ముగ్ధులైన మహర్షులు శ్రీరామచంద్రుని భర్తగా పొందుట ఎంత అదృష్టమో కదా! అని భావించారు. సర్వాంతర్యామి అయిన శ్రీహరి మహర్షుల మనోగతాన్ని గ్రహించి వారి మనోభీష్టం ద్వాపరయుగంలో తీరగలదని వరాన్నిచ్చాడు. ఆ మహర్షులే ద్వాపరయుగంలో 16 వేలమంది గోపికలుగా అవతరించారు.

ఒకనాడు కాత్యాయని వ్రతాచరణలో ఉన్న గోపికలు వ్రతభంగమని తెలిసికూడా యమునానదిలో వివస్త్రులై స్నానమాచరిస్తూ ఉండగా, వారికా వ్రతభంగ దోషాన్ని తొలగించడానికి శ్రీకృష్ణుడు ఒడ్డున విడిచిన వారి వస్త్రాలను అపహరించి ప్రక్కనే ఉన్న పొన్నచెట్టు నెక్కి కూర్చుంటాడు. తిరిగి గోపికల ప్రార్థనమేరకు, వారికి అశాశ్వతమైన శరీరంపైనున్న మక్కువను తొలగించదలచి వారిని రెండు చేతులూ పైకెత్తి జోడించి నమస్కరిస్తే వారి వస్త్రాలను ఇచ్చేస్తానని వారు వ్రతభంగం చేసినందుకు ఇది పరిహారమని తెలిపి గోపికలను వ్రతభంగ దోషంనుండి రక్షించాడు.

అదిగో ఆ కొంటె కృష్ణుని రూపంలోనే పొన్నచెట్టు వాహనాన్ని అధిరోహించి ప్రహ్లాదవరదుడు గోపికావస్త్రాపహారకుడై దర్శనమిస్తున్నాడు. గోపికలు అశాశ్వతమైన శరీరంపై మక్కువను విడిచి ఆ ప్రహ్లాదవరదుని శరణు వేడుతున్నారు.

భక్తుల గోవిందనామాల మధ్య ప్రహ్లాదవరదుడు తనను నమ్మివచ్చిన భక్తులను అనుగ్రహిస్తూ ఆలయ తిరుమాడావీధులలో విహరిస్తున్నారు. దేదీప్యమానంగా విద్యుద్దీపాలమధ్య వెలుగొందుతున్న ఆ స్వామివారిని దర్శించడం మన జన్మజన్మల పుణ్యఫలం.

బ్రహ్మోత్సవాలలో భాగంగా పొన్నచెట్టు వాహనంపై విహరిస్తున్న స్వామివారిని దర్శిస్తేచాలు. ఇహపర బంధాలనుండి విముక్తి కలిగి మోక్షం సిద్ధిస్తుంది.

## తిరుక్కల్యాణం

అహోబలేశుని బ్రహ్మోత్సవాలలో భాగంగా తొమ్మిదవనాటి సాయంకాలం ప్రహ్లాదవరదుడైన శ్రీ లక్ష్మీనరసింహునితో, అమృతవల్లి అమ్మవారి కల్యాణంతోపాటు, ఎగువ అహోబిలంలో జ్వాలానృసింహస్వామి చెంచులక్ష్మీ అమ్మవారల కల్యాణోత్సవ కార్యక్రమం అంగరంగ వైభవంగా నిర్వహిస్తారు. ఈ తిరుక్కల్యాణానికి తిరుమల తిరుపతి దేవస్థానంవారు స్వామివారికి–అమ్మవారికి నూతన పట్టువస్త్రాలను సమర్పిస్తారు.

తిరుక్కల్యాణంలోని మరోవిశేషం ఏమిటంటే పద్మశాలీయులు అమృతవల్లీతాయార్‌ను తమ ఇంటి ఆడపడుచుగా భావించి సారెను సమర్పించి కన్యాదానకార్యక్రమంలో పాల్గొంటారు. అలాగే ఎగువ అహోబిలంలో చెంచులక్ష్మీ జ్వాలానృసింహస్వామికల్యాణోత్సవంలో చెంచులు లక్ష్మీదేవిని తమ ఇంటి ఆడపడుచుగా భావించి సారె నందిస్తారు. స్వామివారిని తమ ఇంటి అల్లునిగా సంభావించి చెంచువారు పూలు, పుట్టతేనె మున్నగు మంగళ ద్రవ్యాలను సమర్పించుకోవడం అనాదిగా వస్తున్న సంప్రదాయం. మొత్తానికి ఎగువ, దిగువ అహోబలాలలో పద్మశాలీయసంఘంవారే ఉభయదారులుగా వ్యవహరిస్తూ తిరుక్కల్యాణాన్ని నిర్వహింపజేస్తారు.



తిరుక్కల్యాణంలో భాగంగా స్వామివారిని అమ్మవారిని సర్వాభరణాలను అలంకరించి కల్యాణమండపానికి వేంచేయింపజేసి పెండ్లి పీటలపై ఆసీనులను చేస్తారు. తదుపరి అర్చకస్వాములు ఋత్విక్కులు/హరిద్రా కుంకుమాది మంగళద్రవ్యాలను చేతపట్టి వేదమంత్రాలను పఠిస్తూ లోక కల్యాణంకొరకు బ్రహ్మోత్సవాలలో భాగంగా అమృతవల్లీ ప్రహ్లాదవరద నరసింహ స్వామివారి కల్యాణోత్సవాన్ని నిర్వహించేందుకు అనుమతినివ్వమని దేవాది దేవుని ప్రార్థిస్తారు.

తదుపరి చేత దర్భతో చేసిన కూర్చుని చేతపట్టి చక్కగా అలంకరించిన కలశంపై ఉంచి గంధ పుష్పాక్షతలను వేస్తూ, వరుణాది దేవతలను ఆవాహనం చేస్తూ కలశారాధన కార్యక్రమాన్ని, లోక క్షేమాన్ని ఆకాంక్షిస్తూ పుణ్యాహవచన కార్యక్రమాన్ని నిర్వహిస్తారు.

తదుపరి 5 పాలికలలో ధాన్యాన్ని నింపి పవిత్రమైన మృత్తికను వాటిపై వేస్తూ "సద్యః అంకురార్పణ" కార్యక్రమాన్ని వేదమంత్రోచ్చారణల మధ్య జరుపుతారు. తదుపరి స్వామివారికి అమ్మవారికి ధ్యాన ఆవాహనాది షోడశ ఉపచారపూజను నిర్వహిస్తారు. తదుపరి స్వామివారికి అమ్మవారికి కంకణబంధన కార్యక్రమాన్ని నిర్వహిస్తారు.

కల్యాణోత్సవాన్ని నిర్వహింపజేస్తున్న భక్తులతో సంకల్పం చేయించి అగ్ని ప్రతిష్ఠాపన కార్యక్రమాన్ని నిర్వహిస్తారు.

తదుపరి వరుడైన ప్రహ్లాదవరదుని వంశంలోని వెనుకటి 3 తరాలవరకు, వారి గోత్రనామాలను, వధువు అమృతవల్లీ అమ్మవారి వంశంలోని వెనుకటి 3 తరాలను వారి గోత్రనామాలను పేర్కొంటూ "ప్రవరోచ్చారణ" చేస్తూ మహాసంకల్పాన్ని నిర్వహిస్తారు. తదుపరి తిరుమల తిరుపతి దేవస్థానములవారు శ్రీ పద్మావతీ శ్రీనివాసుల పరంగా సమర్పించిన పట్టువస్త్రాలను స్వామివారికి అమ్మవారికి సమర్పిస్తారు.

తదుపరి కన్యాదాతలచే కన్యాదాన సంకల్పంచేయించి స్వామివారి పాదాల చెంతన పూర్ణఫలంను సమర్పిస్తారు. ఆ తర్వాత కార్యక్రమం "మాంగల్యపూజ". పవిత్ర సువర్ణ మాంగల్యాన్ని శుద్ధోదకంతోనూ, పాలతోను, అభిషేకించి శ్రీవారి పాదాలచెంతన ఉంచి పసుపు, కుంకుమ, గంధం, పుష్పాలు, ధూపం, హారతి సమర్పించి శ్రీ సూక్తం పఠిస్తూ పూజిస్తారు. తదుపరి మాంగల్యంను ఒక కొబ్బరికాయపై ఉంచి కల్యాణోత్సవాన్ని నిర్వహింపజేస్తున్న భక్తులచే నమస్కరింపజేసి అర్చకస్వాములు శ్రీవారి కరకమలాలకు స్పర్శింపజేసిన మాంగల్యాన్ని అమ్మవారికి అలంకరింపజేస్తారు. మంగళహారతులు సమర్పిస్తారు.

**పాడరే సోబనాలు పడతులాలా**
**వేడుక లిద్దరికిని వెలసె చూడరే ॥**

**కొండలే పీటలుగా కూచున్నారెదురుబడి**
**అండనే నారసింహుడు ఆదిలక్ష్మియు**
**వెండి పైడి నిండుకొన్న వేదాద్రి గరుడాద్రుల**
**పెండిలాడే రిద్దురును ప్రియమున చూడరే ॥**

**భవనాశి జలముల పాయక తోడనీళ్ళాడిరి**
**ఇవలా నవలా తాము ఏటిదరుల**
**జవళి మంచి పూవుల సరిసేసలు వెట్టుచు**
**తవిలి సుముహూర్తాన తప్పక చూచేరు ॥**

**పొందుగ కనకావతి భోగావతి నదుల**
**సందడి వసంతముగా చల్లులాడుచు**
**అందమై శ్రీవేంకటాద్రి అహోబలాన ఒక**
**చందమున కూడి కూడి సరసము లాడేరు ॥**



తదుపరి హోమగుండం వద్ద నాగవేలి కార్యక్రమాన్ని నిర్వహించి స్వామివారి పక్షాన అగ్ని ప్రమాణం చేస్తూ చేత పేలాలను పట్టుకొని మూడుసార్లు అగ్ని ప్రదక్షిణం చేస్తూ పేలాలను ఆహుతులుగా సమర్పిస్తారు.

ఆ తర్వాత వారణమాయిరం కార్యక్రమాన్ని నిర్వహిస్తారు. అర్చకులలో కన్యాదాతవైపునుంచి ఒకరు, స్వామివారివైపునుంచి ఒకరు ఒక వస్త్రాన్ని స్వామివారి ముందు పరిచి 4 టెంకాయలను ఒకరికొకరు దొర్లిస్తుండగా తక్కిన పండితులు గోదాపాశురాలలో ఒకటైన తమిళ ప్రబంధం "వారుణమాయిరం"ను పఠిస్తూంటారు. ఈ కార్యక్రమం ముగిసిన పిమ్మట స్వామివారికి వేసిన పుష్పమాలను అమ్మవారికి, అమ్మవారికి వేసిన పుష్పమాలను స్వామివారికి మార్చివేస్తూ 3సార్లు మాలాపరివర్తనం కార్యక్రమాన్ని నిర్వహిస్తారు.

తదుపరి స్వామివారిని అమ్మవారినీ ఒకే సింహాసనంపై ప్రక్కప్రక్కన కూర్చోబెట్టి నివేదనలు సమర్పించినమీదట అక్షతారోపణ కార్యక్రమాన్ని నిర్వహించి మంగళహారతులు సమర్పిస్తారు.

తదుపరి అర్చకవరేణ్యులకు శఠారిని సమర్పిస్తారు.

ఆ తర్వాత జరిగే స్వస్తివాచన కార్యక్రమంలో చతుర్వేదాలను, సంగీతాది మంగళవాద్యాలను స్వామివారికి వినిపింపజేసి మహామంగళ హారతులను, కుంభహారతిని సమర్పించడంతో అమృతవల్లీ ప్రహ్లాదవరదుల కల్యాణోత్సవ కార్యక్రమం పరిసమాప్తి అవుతుంది.

ఈ కల్యాణోత్సవ కార్యక్రమాన్ని వీక్షించిన భక్తులందరికీ సకల శుభాలు కలుగుతాయి.

లక్ష్మీనృసింహవరద గోవిందా...గోవింద.

అమృతవల్లీ నాయికాసమేత ప్రహ్లాదవరదస్వామి గోవిందా...గోవింద.

## గజవాహనం

స్వామివారి తిరుక్కల్యాణం జరిగిననాటి రాత్రి స్వామివారు ఏకాంతంగా సకలాభరణభూషితులై గజవాహనంపై విహరిస్తారు. శ్వేతగజంపై స్వామివారు ఒకరినే వేంచేయింపజేసి జరిపే ఈ ఉత్సవం కనులపండుగగా ఉంటుంది. ఈ గజం ఐరావతమనే దివ్యగజం. లౌకికమైన ఏనుగుకు రెండు దంతాలుంటాయి. కానీ ఈ గజానికి 4 దంతాలుంటాయి. ఈ శ్వేతగజం క్షీరసాగరమథనంలో మహాలక్ష్మి అమ్మవారికి తోబుట్టువుగా జన్మించినది. దేవేంద్రుని కొలువులో ఉండే ఈ దివ్యగజాన్ని అధిరోహించి స్వామివారు ఉత్సవంగా వేంచేస్తున్నారు.

గజములలో ఉత్తమమైన శ్వేతగజాన్ని అధిరోహించిన "సృష్టిలో ఉత్తమోత్తమమైనది నేనే"నంటూ స్వామివారు విహరిస్తుండడం విశేషం. కామ, క్రోధ, మోహ, లోభ, మద, మాత్సర్యాలనే అరిషడ్వర్గాలు మత్తగజంలా మానవుని సమ్మోహపరుస్తుంటాయి. అటువంటి మదగజాన్ని అణచిపెట్టి నా సేవలో తరించండి అంటూ స్వామివారు రాజమన్నార్‌గా గజవాహనంపై వేంచేస్తున్నారు.

"గజాంతం ఐశ్వర్యం" అన్నట్లుగా సంపన్నుల ఇంటి ముంగిట పూర్వం గజరాజులు నిలిచి ఉండేవి. ఐశ్వర్యాధిదేవత మహాలక్ష్మి కాబట్టి ఆమెసేవలో తరిస్తున్న గజేంద్రుడు నేడు స్వామివారికి వాహనమయ్యాడు. రాజుల పట్టాభిషేక సమయాల్లో పట్టపుటేనుగుపై విహరించేవారు. రాజాధిరాజు, దేవాదిదేవుడైన ఆ ప్రహ్లాదువరదుడు వివాహమహోత్సవంలో భాగంగా గజవాహనారూఢుడై తిరువీధులలో విహరిస్తున్నారు.

భాగవతమహాపురాణంలో ఆర్తత్రాణపరాయణుడైన శ్రీమహావిష్ణుమూర్తి మొసలిబారినుండి గజేంద్రుని రక్షించిన "గజేంద్ర మోక్షం" గాథ ప్రశస్తమైనది. మొసలిబారిన పడిన గజేంద్రుడు తప్పించుకొనే ప్రయత్నం చేసి, ఇక చేతకాక



**"లావొక్కింతయులేదు, ధైర్యము విలోలంబయ్యెఁబ్రాణంబులున్**
**ఠావుల్ దప్పెను, మూర్ఛవచ్చెఁ, దనువున్ డస్సెన్, శ్రమంబయ్యెడిన్**
**నీవేతప్ప నితఃపరంబెఱుఁగ, మన్నింపందగున్ దీనునిన్**
**రావే యీశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా!**

అని ప్రార్థించగా శ్రీమహావిష్ణుమూర్తి గజేంద్రుని మొరవిని అప్పటిదాక సరసాలాడుతున్న లక్ష్మీదేవికి చెప్పకుండా, శంఖచక్రాయుధాలు ధరించకుండా ఏ పరివారాన్ని పిలవకుండా, వాహనమైన గరుత్మంతునికూడా పిలవకుండా, మోముపై పడిన ముంగురులను సైతం సవరించుకోకుండా, చివరకు లక్ష్మీదేవితో సరసాలాడేవేళ అతని భుజకీర్తులకు తగులుకున్న లక్ష్మీదేవి పవిట కొంగునైనా వదలకుండా గజేంద్రుని రక్షణార్థం బయలుదేరి వెళ్ళాడు. లక్ష్మీదేవితోపాటు, శంఖచక్రాలు పరివారం, గరుత్మంతుడు సకలదేవతలు ఒకరెంబడి ఒకరు శ్రీమహావిష్ణువును అనుసరించగా శ్రీహరి తన చక్రాయుధంతో మొసలి శిరస్సును ఖండించి గజేంద్రుని రక్షించి చివరకు మోక్షాన్ని ప్రసాదించాడు.

బహుశా అందుకు ప్రతీకగానే గజేంద్రుడు నేడు స్వామివారికి వాహనమయ్యాడా అన్నట్లు స్వామివారి గజవాహనోత్సవ దృశ్యం దర్శనమిస్తూంది. గజేంద్ర మోక్షగాథ శరణాగతిని నొక్కివక్కాణిస్తున్నది. "నిన్ను నమ్మి నీపై విశ్వాసము నిలుపుకున్నవాడ – ఇక వేరే ఉపాయమేమిటికి" అని అన్నమయ్య స్తుతించిన చందంగా శరణాగతిలో సడలని విశ్వాసం ముఖ్యమైనది. శరణాగతి ప్రక్రియలో గజేంద్రునికి ఉన్నస్థానం విశేషమైనది. "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేక శరణంవ్రజ" అన్న గీతాచార్యుని వాక్యానికి నిలువెత్తు నిదర్శనం గజేంద్రుని గాథ.

గజేంద్రుడు ఐహిక బంధాలనుండి విముక్తుడై స్వామివారిని తనపై నిలుపుకున్నట్లుగా మనం భగవంతుని మన హృదయపీఠంపై నిరంతరం నిలిపి శరణాగతిని పొందాలని ఈ గజవాహనసేవ ఉద్బోధిస్తూంది.

## కాళింగనర్తనోత్సవం

ప్రహ్లాదవరదుని గజవాహనసేవ జరిగిన మరునాటి ఉదయం స్వామివారు కాళింగనర్తనోత్సవ భంగిమలో ఉభయదేవేరులతో కలిసి విహరిస్తూ భక్తులకు దర్శనమిస్తారు.

అలనాడు యమునానదిలో విషాన్ని వెళ్ళగక్కి గోగణాల, గోపాలకుల, మరణానికి కారకుడైన కాళీయుని సంహారార్థం శ్రీహరి కృష్ణావతారంలో బాలకృష్ణుడై స్నేహితులతో ఆడుకుంటూ యమునానదిలో పడిన బంతిని తీసే నెపంతో ఒక ఉదుటన శ్రీకృష్ణుడు కాళింగుని మడుగులోకి దూకి కాళీయుని శిరస్సుపై నాట్యంచేస్తూ అతని అహంకారాన్ని అణిచివేసి తన పాదముద్రికలు నాగుల శిరస్సుపై ఉండేలా అనుగ్రహించాడు. ఆ ఘట్టాన్ని గుర్తుచేస్తూ స్వామివారు కాళీయుని శిరస్సుపై నర్తనచేస్తున్న భంగిమలో ఉభయదేవేరులతో కలిసి విహరిస్తున్నాడు. సర్వాలంకార భూషితుడైన స్వామివారు ఒక చేతిలో కాళీయుని తోకనుపట్టి అతని శిరస్సుపై తన వామపాదమునుంచి తాండవకృష్ణుని రూపంలో ఉభయదేవేరులతో కలిసి విహరిస్తున్నాడు.

కాళింగనర్తనోత్సవ భంగిమలోని స్వామివారిని దర్శిస్తే అరిషడ్వర్గాలనుండి దూరంగా ఉంటూ స్వామివారి అనుగ్రహానికి పాత్రులు కావచ్చును.

## తొట్టి తిరుమంజనం

కాళింగ నర్తనోత్సవంనాటి సాయంకాలం స్వామివారికి తొట్టి తిరుమంజన కార్యక్రమాన్ని నిర్వహిస్తారు.

స్వామివారిని సర్వాలంకారభూషితునిగా చేసి ఛత్ర, ఛామర, ధ్వజ, పతాకాది సకల రాజోపచారాలనుచేస్తూ ఆలయం ప్రాంగణంలో ఏర్పాటు చేసిన తొట్టివద్దకు వేదమంత్రోచ్చారణల నడుమ స్వామివారిని వేంచేయింపు



జేసి గంధ, పుష్ప, పున్నాగ, జాజి, పచ్చకర్పూరాది పరిమళ ద్రవ్యాలతో సమ్మిళితం చేసిన తొట్టిలోని నీటిలో స్వామివారికి తిరుమంజనం నిర్వహిస్తారు. ఇది అహోబిలంలో జరిగే విశేష ఉత్సవం.

తదుపరి ఆనాటి రాత్రి స్వామివారికి అశ్వవాహన ఉత్సవాన్ని నిర్వహిస్తారు.

## అశ్వవాహనోత్సవం

కాళింగనర్తనోత్సవంలో తాండవకృష్ణుని రూపంలో భక్తులను అనుగ్రహించిన స్వామివారు రాత్రి దివ్యాశ్వవాహనంపై విహరిస్తూ భక్తులను అనుగ్రహిస్తారు. ఈ దివ్యాశ్వంపేరు 'ఉచ్చైశ్రవం' ఇది దేవలోకపు రెక్కలున్న అశ్వం. క్షీరసాగర మథన సందర్భంలో ఐరావతం, కల్పవృక్షం, కామధేనువు, మహాలక్ష్మితోపాటుగా ఉద్భవించిన దివ్యాశ్వమిది. ఈ అశ్వం శ్వేతవర్ణాన్నికలిగి దేవేంద్రుని కొలువులో ఉంటూ పూజలందుకుంటుంది. ఈ అశ్వం వాయువేగ మనోవేగాల కన్న వేగంగా సకలలోకాలలోను పయనించగలదు.

ఇటువంటి అశ్వంపై స్వామివారు చేత చర్నాకోలతో, పంచాయుధాలను ధరించి తలపాగాకట్టి మాడవీధులలో విహరిస్తూ భక్తులకు కనువిందు చేస్తారు.

దుష్టశిక్షణ, శిష్టరక్షణలో కల్కి అవతారానికి విశిష్టతను స్థానముంది. ఇది ప్రతి మహాయుగంలోని, కలియుగాంతంలో స్వామివారు ధరించే అవతారం. ఈనాడు స్వామివారు రాజమన్నారులాగా రాజసం ఉట్టిపడేలా రజోగుణప్రధానంగా ఒక చక్రవర్తిలాగా వచ్చి దుష్టులను తన దివ్యాయుధాలతో సంహరించి తిరిగి ధర్మసంస్థాపనచేస్తూ కృతయుగాన్ని నెలకొల్పే ఈ కల్కి అవతారంలో దర్శనమిస్తున్నారు.

అదిగో దివ్యమైన శ్వేతాశ్వంపై రాజమన్నార్‌లాగా దివ్యకాంతులతో వెలుగొందిపోతూ స్వామివారు భక్తులను అనుగ్రహిస్తున్నారు.

"అశ్వవాహనా గోవిందా.....గోవింద"

**నీవు తురంగము మీఁద నేర్పు మెరయ**
**వేవేలు రూపులై వెదచల్లితపుడు**

**పదిలముగ నిరువంక ఁబసిఁడి పింజల యంప**
**పొదల తరకసములొరపులు నెరపఁగా**
**గదయు శంఖంబు చక్రము ధనుః ఖడ్గములు**
**పదివేలు సూర్యబింబము లైనపుడు**

**సొరిది శేషుని పెద్దచుట్టు పెనుఁగేవడము**
**సిరి దొలఁక నొక చేతఁజిత్తగించి**
**దురమునకుఁదొడవైన ధూమకేతువు చేత**
**ఇరవైన బల్లెమై యేచెనందపుడు**

**కరకజడతో రమాకాంత జయలక్ష్మియై**
**తొరలి కౌఁగిట నిన్నుఁ దొడికి పట్టి**
**చరచెను వేంకటస్వామి నిను గెలువుమని**
**మెరుఁగు గుచ కుంభముల మిసిమితో నపుడు**

దివ్యమైన అశ్వవాహనంపై విహరిస్తున్న స్వామివారిని దర్శిస్తే భక్తులకు దివ్యమైన జ్ఞానాన్ని, నిర్మలమైన జ్ఞానాన్ని ప్రసాదిస్తాడు. ఆ దేవదేవుడు.

## రథోత్సవం

బ్రహ్మోత్సవాలలో భాగంగా అశ్వవాహనోత్సవం మరునాడు సూర్యోదయాన్నే శ్రీ భూ నీళాసమేత ప్రహ్లాదవరద స్వామివారి దివ్యమంగళ రథోత్సవం జరుగుతుంది. ఉభయ దేవేరులతో కూడిన ప్రహ్లాదవరదునికి అత్యంత విలువైన వజ్రాలను పొదిగిన ఆభరణాలను, వివిధవర్ణశోభితాలైన



పుష్పాలను, చక్కగా అలంకరించి భక్తుల గోవిందనామాల మధ్య ఆలయంనుండి తిరుచ్చిపై ఊరేగింపుచేస్తూ రథవీధిలోని మహోన్నతమైన దివ్యరథంలోనికి వేంచేయింపు చేసి ఉన్నత పీఠంపై ఆసీనులను గావిస్తారు. అంతకు మునుపే రథపూజా బలిహరణాలను నిర్వహించి దివ్యరథమును సర్వాంగ సుందరంగా అలంకరిస్తారు. స్వామివారు రథంలో ఆసీనులైన పిదప నివేదనను నిర్వహించి మంగళహారతులు సమర్పించి, రథానికి ముందుభాగంలో కుంభము (దిష్టి)ను నిర్వహించి అశేష భక్తజనుల గోవింద నామస్మరణలమధ్య నాలుగు శ్వేతాశ్వాలను పూన్చిన మహారథంను ముందుకు సాగనిస్తారు. ఈ ఉత్సవంలో అడుగడుగునా భక్తజనులు స్వామివారికి మంగళహారతులను సమర్పించుకుంటారు. ఆలయ వీధులన్నీ నారసింహనామం గోవిందనామాలు మారుమ్రోగుతుండగా స్వామివారి రథోత్సవం కనులపండుగగా జరుగుతూ ఉంటుంది.

గరుడ ధ్వజుడైన నరహరి 4 గుర్రాలను పూన్చిన దివ్యరథంలో ఆసీనుడై విహరిస్తూ భక్తులను అనుగ్రహిస్తుంటాడు. ప్రసిద్ధ ఆలయాలలో స్వామివారి ఉత్సవవేళల్లో దివ్యరథంపై ఊరేగించడాన్ని ఆగమశాస్త్ర వివరిస్తూంది.

"రథస్తం కేశవం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే"

అని ఆర్షవాక్కులు రథంలో విహరిస్తున్న స్వామివారిని దర్శిస్తేచాలు మోక్షం లభిస్తుందని ఆగమశాస్త్రాలు చెబుతున్నాయి. రథవీధిలో స్వామివారు ఆసీనులైన రథానికి తాళ్ళనుకట్టి, భక్తులు, అధికారులు మఠాధికారులు గోవిందనామాల నడుమ ముందుకు లాగుతారు.

రథోత్సవ ప్రాశస్త్యానికి కఠోపనిషత్తు ఆధ్యాత్మిక అర్థాన్ని చెబుతూ శరీరానికి ఆత్మకు ఉన్న సంబంధంగా రథరూపకల్పనను చక్కగా వివరించింది.

**ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ తు**
**బేద్ధింతు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవచ**
**ఇంద్రియాణి హయానాహుర్విషయాం స్తేషు గోచరాన్"**

ఆత్మ రథికుడు, శరీరం రథం, బుద్ధి సారథి, మనసు పగ్గం, ఇంద్రియాలు గుర్రాలు, విషయాలే వీధులు. ఈ విధంగా వివరించడంలో స్థూలశరీరం, సూక్ష్మశరీరం వేరని ఆత్మ ఈ రెంటికి భిన్నమని ఆత్మానాత్మ వివేకం కలుగుతుంది. దేవాదిదేవుడైన ప్రహ్లాదవరదుడు రథంలో తిరుమాడావీధులలో ఊరేగుతుండగా భక్తజనులు, భజనలు చేస్తూ, చెక్కభజనలు, కోలాటాలు, గరగాటలు, ఆడుతూ ఆనందోత్సాహాలతో నృత్యాలు చేస్తూ ముందుకు సాగుతున్నారు. అదిగో ప్రహ్లాదవరదుని దివ్యమంగళ రథం ముందుకు కదులుతూంది.

**ప్రహ్లాద వరద గోవిందా...గోవింద**
**అహోబలనారసింహా...గోవింద**
**నవనారసింహా! భక్తవరదా...గోవింద**

స్వామివారి రథోత్సవం తిరిగి యథాస్థానానికి చేరుకోగానే సాయంత్రంవరకు స్వామివారిని రథంలోనే ఆసీనులను చేసి సాయంకాలం రథమండపంలో తిరుమంజనం నిర్వహిస్తారు. సాయంత్రం ఉభయ దేవేరులతోకూడిన స్వామివారిని తిరుచిపై వేంచేయింపజేసి ఉత్సవంగా ప్రధానాలయానికి చేర్చి స్వస్తివాచనం వినిపింపజేస్తారు.

**ఆడరమ్మ పాడరమ్మ అంగనలు చూడరమ్మ**
**వేడుక పరుషలెల్ల వీధి నుండరమ్మ॥**

**అల్లదివో ఓగుసూతుల ఔభళేశు పెద్దకోన**
**వెల్లిపాల నీటి జాలు వెడలే సోన**



**చల్లని మాకులనీడ సంగడి మేడలవాడ**
**ఎల్లగాగ నరసింహు డేగీ నింతితోడ॥**

**సింగారపు మండపాల సింహాల మునిమందులు**
**అంగపు తెల్లగోపురము అదె మిన్నంద**
**చెంగట నాళువార్లు చేరి పన్నిద్దరు గొల్వ**
**సంగతి తా కొలువిచ్చీ జయనరసింహము॥**

**కందువ శ్రీవేంకటేశు కల్యాణముల వేది**
**అందమై భూమికెల్ల ఆదికినాది**
**మందల పాలకొండ మలకు నట్టనడుమ**
**విందగు దాసులతోడ విహరించీ దేవుడు॥**

## తీర్థవారి - చక్రస్నానం

ఉభయదేవేరి సహిత ప్రహ్లాదవరదస్వామివారి బ్రహ్మోత్సవాలలో భాగంగా రథోత్సవం అయిన మరుసటిరోజు అనగా 12వ రోజు ఉదయం ప్రహ్లాదవరద స్వామివారు ఉభయదేవేరులతో కలిసి తిరుచిపై ఉత్సవంగా ఊరేగుతూ చక్రత్తాళ్వార్ సమేతంగా పుష్కరిణి ప్రాంతానికి చేరుకుంటారు. శ్రీమదహోబలమఠం పీఠాధిపతుల సమక్షంలో వేదపండితులు వేదపారాయణం చేస్తుండగా శాస్త్రోక్తంగా స్వామివారికి అమ్మవార్లకు చక్రత్తాళ్వారులకు శుద్ధోదకంతోనూ, హరిద్రోదకంతోనూ, నారికేళోదకంతోనూ, క్షీరంతోనూ అభిషేకం నిర్వహిస్తారు. తదనంతరం శ్రీగంధోదకంతో అభిషేకించి తులసీమాలాంకృతులనుచేసి ధూపదీపాలను సమర్పించి చక్రత్తాళ్వారులతో సహా అర్చకస్వాములు పుష్కరిణిలో చక్రస్నానాన్ని (తీర్థవారిని) నిర్వహిస్తారు. ఈ కార్యక్రమానికి అసంఖ్యాకంగా భక్తులు హాజరవుతారు. తీర్థవారిలో పాల్గొన్నవారికి సకల రోగాలు,

శత్రుపీడలు నివారణమవుతాయి. తదనంతరం స్వామి, అమ్మవార్లను చక్రత్తాళ్వారులను ప్రధానాలయానికి చేర్చి పూజాకార్యక్రమాలను నిర్వహిస్తారు.

చక్రత్తాళ్వారులను అన్నమాచార్యులవారు ఈ క్రింది కీర్తనలో ఎంత గొప్పగా కీర్తించారో చూడండి.

**చక్రమా హరి చక్రమా**
**వక్రమైన దనుజుల వక్కలించు వో॥**

**చుట్టిచుట్టి పాతాళము చొచ్చి హిరణ్యాక్షుని**
**చట్టలు చీరిన ఓ చక్రమా**
**పట్టిన శ్రీహరిచేత పాయక ఈ జగములు**
**ఒట్టుకొని కావగదవొ ఓ చక్రమా॥**

**పానుకొని దనుజుల బలుకిరీట మణుల**
**సానలుతీరిన ఓ చక్రమా**
**నానా జీవముల ప్రాణములు గాచి ధర్మ**
**మూని నిలుపఁగదవో ఓ చక్రమా॥**

**వెరచి బ్రహ్మాదులు వేదమంత్రముల నీ**
**వురుట్లు కొనియాడే రో చక్రమా**
**అరిమురి తిరువేంకటాద్రీశు వీధుల**
**ఒరవుల మెరయుదువో ఓ చక్రమా॥**

## ద్వాదశారాధనం - పుష్పయాగం

బ్రహ్మోత్సవాలలో 12వ రోజు సాయంకాలం స్వామివారిని అమ్మవార్లను కొలువు మండపంలో కొలువుదీర్చి ద్వాదశారాధనం నిర్వహిస్తారు. ఇందులో భాగంగా తొలిగా శుద్ధోదక స్నానం, తదుపరి



గోక్షీరాభిషేకం, శుద్ధజలాభిషేకం, నిర్వహించి ధూపదీప కర్పూర నీరాజనాలను సమర్పిస్తారు. తదనంతరం, దధి, మధు, నారికేళజలం, హరిద్రాచూర్ణాలతో అభిషేకం నిర్వహిస్తారు. చివరగా చందనాన్ని సమర్పించి తులసీమాలను ధరింపజేసి నక్షత్రహారతిని ఇస్తారు. పిదప సహస్రధారాభిషేకాన్ని నిర్వహిస్తారు.

ఈ అభిషేకాన్ని అర్చకస్వాములు నిర్వహిస్తుండగా వేదపండితులు పురుషసూక్తం, శ్రీసూక్తం, భూసూక్తాలను పఠిస్తుంటారు. ఈ అభిషేకం, వేదమంత్ర పఠనం పూర్తికాగానే ద్రవిడవేదమైన నీరాట్టంను ప్రారంభిస్తారు. తదుపరి నివేదనలు సమర్పిస్తారు.

స్వామివారికి నిర్వహిస్తున్న స్నపన తిరుమంజనంను గురించి ఈ క్రింది కీర్తనలో అన్నమాచార్యులవారు బహుచక్కగా వర్ణించారు.

**అప్పుడు మజ్జనమాడీ నంగనఁగూడి**
**కుప్పలుఁదెప్పలుగా గుమ్మరించరో**

**బంగారు కొప్పెరల పన్నీరు నించి**
**రంగైన పచ్చకప్పురపు ధూళొత్తి**
**చెంగట cగస్తూరి ధూళి చికిలి గాలించి**
**పొంగారు cదట్టు పుణుcగు పోయరో గిన్నెలను**
**పటికంపుcగాగుల పరిమళాలెల్లా**
**ఘటియించి కుంకుమతో cగడు మేదించి**
**అటు నిటు గొజ్జంగి నీరందందనించి**
**కుటిలకుంతలులుపైc గ్రుమ్మరించరో**

**బలుపింగాణుల cగదంబము గంధమును**
**కలపము గావించి గంబూరముతో**

**వెలయ మజ్జనమాడీ వేంకటాద్రి విభుండు**
**చెలగి యింతులు చేరి సేస చల్లరో**

తదనంతరం స్వామివారికి అమ్మవార్లకు నూతన పట్టువస్త్రాలను, స్వర్ణాభరణాలను అలంకరింపజేసి వివిధ వర్ణరాజరంజిత పుష్పాలతో పుష్పయాగం నిర్వహిస్తారు.

బ్రహ్మోత్సవాలలో తెలిసీ, తెలియక జరిగిన లోపాలకు ప్రాయశ్చిత్తంగా నిర్వహించే కార్యక్రమమే పుష్పయాగం.

**"ధ్వజారోహణ తీర్థాంతం ప్రాయశ్చిత్తం తు యద్భవేత్।**
**తస్య దోషవిఘాతార్థం పుష్పయాగం చ కారయేత్॥** అని కపింజల సంహిత పుష్పయాగాన్ని గూర్చి వివరిస్తుంది. అనగా ధ్వజారోహణం మొదలు తీర్థవారి వరకు జరిపే కార్యక్రమాలలో తెలిసీ, తెలియక జరిగిన లోపాలను, దోషాలను నివారించడం కొరకు పుష్పయాగం చేయాలి అని అర్థం.

జాజి, విరజాజి, కరవీర, మల్లె, మొల్ల, సంపంగి, మొగలి, మందార, కనకాంబర, గులాబి, చేమంతి, మరవక, దవన, మున్నగు వివిధరకాల పుష్పాలతో స్వామి అమ్మవార్లకు అర్చన చేస్తుండగా వేదపండితులు మొదటగా చతుర్వేదాలను పరాయణం చేస్తారు. తదుపరి దశశాంతులను, శ్రీ లక్ష్మీ నృసింహ సహస్రనామావళి, తిరువాయిమొజిని వేదపండితులు పఠిస్తుండగా అర్చకులు 20 సార్లు సుగంధాలను విరజిమ్మే రంగురంగుల పుష్పజాతులతో పుష్పారాధన నిర్వహిస్తారు.

వివిధ వర్ణాలలో సుగంధ భరిత పుష్పాలతో పూజలందుకుంటున్న దేవాదిదేవుడు, గరుడాద్రివాసుడు, భక్తులపాలిట కొంగుబంగారమైన నవనారసింహుని అఖండ పూర్ణతనూ, ఆద్యంత రాహిత్యాన్నీ, పురుషోత్తమత్వాన్ని, ఆర్తరక్షకత్వాన్ని, తమ తమ శక్త్యానుసారం భక్తులు,



ఋత్విక్కులు, వేదపండితులు, కొనియాడుతుండగా, భక్తసులభుడు, భక్తవత్సలుడు, అయిన ఆ ప్రహ్లాదవరదుని వైభవాన్ని చూసేందుకు వేయికళ్ళయినా సరిపోవు.

ఈ పుష్పయాగంలో స్వామివారిమూర్తుల శ్రీచరణాలు మొదలు హృదయంవరకు, పూలలో మునిగేలా పుష్పారాధన చేస్తారు. ఇలా పుష్పాలు శ్రీహరి హృదయంవరకురాగానే, ధూపదీపాలను మంగళ నీరాజనాలను సమర్పించి ఆ పూలన్నిటిని స్వామివారి పాదాలవరకు సవరిస్తారు. తిరిగిమళ్ళీ పుష్పార్చన ప్రారంభిస్తారు. తిరిగి హృదయంవరకు వచ్చేంతవరకు పుష్పార్చన జరుగుతుంది పిదప ధూప, దీప, మంగళ నీరాజనాలను సమర్పించి తిరిగి ఆ పూలను పాదాలవరకు సవరిస్తారు. ఇలా 20సార్లు పుష్పార్చన కనులపండుగగా జరుగుతుంది. ఆ తర్వాత స్వామివారికి అమ్మవార్లకు నివేదన, మంగళహారతులను సమర్పించి తిరుచిపై ఆసీనులను చేసి రాజలాంఛనాలతో ఆలయానికి ప్రదక్షిణగా ఊరేగిస్తూ ప్రధానాలయానికి స్వామివారిని చేర్చడంతో పుష్పయాగం కార్యక్రమం పూర్తి అవుతుంది.

పుష్పయాగాన్ని నిర్వహించడం ద్వారా సర్వజన బాధాకరములైన అతివృష్టి, అనావృష్టి, దుర్భిక్షం, భూకంపం, యుద్ధభయం సామూహిక రోగదుర్మణాలు మొదలైన సామాజిక ఉపద్రవాలు తొలగి దేశప్రజలు సుఖసంతోషాలతో విరాజిల్లుతారని ఆగమశాస్త్రాలు పేర్కొంటున్నాయి.

పుష్పయాగంనాటిరాత్రి స్వామి తనకు అత్యంత ప్రీతిపాత్రుడైన గరుడాళ్వారులపై ఆసీనులై తిరుమాడా వీధులలో విహరిస్తాడు.

## గరుడోత్సవం

బ్రహ్మోత్సవాలలో చిట్టచివరగా స్వామివారు అత్యంత ప్రాధాన్యత కలిగిన గరుడవాహనాన్ని ఎక్కి విహరిస్తారు. వైష్ణవాలయాలలో గరుడ వాహనసేవ ఉత్తమోత్తమమైనది. గరుత్మంతుడు, వినతాసుతుడు

పరమస్వరూపుడు, జ్ఞానస్వరూపుడు. "వేదాత్మా విహగేశ్వరః" అను సూక్తిని అనుసరించి గరుత్మంతుడు వేదస్వరూపుడు. సామాది వేదములకు ప్రతిరూపాలైన అంగ ప్రత్యంగాలు కలవాడు.

శ్రీ వైకుంఠంలోని నిత్యసూరులలో అగ్రగణ్యుడు, అత్యంత ప్రియమైన వాహనము గరుత్మంతుడు. అలాగే ప్రతి వైష్ణవాలయాల్లోను శ్రీవారికి అభిముఖంగా అంజలి ఘటిస్తూ స్వామివారి ఆజ్ఞకోసం సర్వకాల సర్వావస్థలలో నిరీక్షించే భక్తాగ్రేసరుడు గరుత్మంతుడు. స్వామివారికి గరుత్మంతునిపై అమితమైన అభిమానం అందుకే గరుడధ్వజాన్ని తన ధ్వజంగా నిర్ణయించుకున్నారు.

**దాసో మిత్రం తాళవృంతం వితానం**
**పీఠం వాసో వాహనం చ ధ్వజశ్చ**
**ఏవం భూత్వాఽనేకదా సర్వదా సః**
**శ్రీశం శ్రీమాన్ సేవతే వైనతేయః**

వినతాసుతుడైన వైనతేయుడు దాసునిగా, సఖునిగా, వీవెనగా, ఛత్రంగా, ఆసనంగా, ఆవాసంగా ధ్వజంగా అనేక విధాలుగా శ్రీహరిని సేవిస్తున్నాడు. అందుకే బ్రహ్మోత్సవాలను గరుడ ధ్వజాన్ని ఎగరవేయడంతో ప్రారంభించి, గరుడ ధ్వజం దించివేయడంతో పరిసమాప్తమవుతాయి. గరుత్మంతుడు ధ్వజస్తంభంపై నిలిచి సకలదేవతలను బ్రహ్మోత్సవాలకు ఆహ్వానిస్తూంటాడు. ఉత్సవాలు ముగిసే వరకు పర్యవేక్షిస్తుంటాడు.

అదిగో ప్రహ్లాద వరదుడు పంచాయుధధారియై సర్వాలంకార శోభితుడై, వజ్రముకుటధారియై వివిధ వర్ణపుష్పరాగ రంజితుడై గరుత్మంతుని మూపురంపై ఆసీనుడై తన దివ్యదర్శనాన్ని ప్రసాదిస్తున్నాడు. స్వామివారికి తనపట్ల ఎనలేని వాత్సల్యం కనుకనే గరుత్మంతుడు అత్యంత భక్తిశ్రద్ధలతో అరుణారుణ పల్లవములవంటి స్వామివారిపాదాలను తన చేతులందు ఉంచి



బ్రహ్మోత్సవాలలో భక్తులను అనుగ్రహించి అలసి సొలసిన స్వామివారికి మలయమారుతంవంటి గాలిని వీచేందుకు చామరమును చేతధరించి గరత్మంతుడు శ్రీహరిని తన భుజస్కందాలపై కూర్చోబెట్టుకొని తిరువీధులలో విహరిస్తున్నాడు.

108 వైష్ణవ దివ్యదేశాలలోనూ గరుడవాహన సేవకు ఒక విశేషస్థానం ఉంది. తిరు= దివ్యమైన, పడి= స్థలం, తిరుప్పడి > తిరుపతి= దివ్యస్థలం ఈ 108 దివ్యదేశాలను 108 తిరుపతులుగా వ్యవహరిస్తారు. అందుకే ఎగువ, దిగువ అహోబిలాలను ఎగువ తిరుపతి, దిగువ తిరుపతి అని పిలుస్తారు. తిరుమలలో గరుడవాహనోత్సవానికి ఎంతటి ప్రాముఖ్యముందో అహోబల గరుడవాహనోత్సవానికి అంతటి ప్రాధాన్యం ఉంది.

తన తల్లియైన వినత దాస్యాన్ని నిర్మూలించేందుకు దేవలోకంనుండి అమృతాన్ని తెచ్చిన మహనీయుడు వైనతేయుడు. అంతేకాదు "ఛందోమయేన గరుడేన సముహ్యమానః" అని భాగవతంలో చెప్పిన విధంగా ఆ జగత్కల్యాణ చక్రవర్తి గరుత్మంతునిపై విహరిస్తున్నాడు. ఈ గరుడ గమనుడిని దర్శించి తరించేందుకు సుదూర ప్రాంతాలనుండి సైతం భక్తులు వేలాదిగా తరలివస్తారు.

గరుడవాహనంపై విహరిస్తున్న శ్రీహరిని అన్నమాచార్యులవారు ఈ కీర్తనలో అద్భుతంగా స్తుతిస్తారు.

**ఇటు గరుడని నీ వెక్కినను**
**పటపట దిక్కులు బగ్గనఁబగిలె**

**ఎగసినగరుడని యేపున 'ధా' యని**
**జిగి దొలఁక చబుకు చేసినను**
**నిగమాంతంబులు నిగమసంఘములు**
**గగనము జగములు గడగడ వడఁకె**

**బిరుసుగ గరుడని పేరెము దోలుచు**
**బెరసి నీవు గోపించినను**
**సరస నఖిలములు జర్జరితములై**
**తిరుపున నలుగడ దిరదిరఁదిరిగె**

**పల్లించిన నీపసిఁడి గరుడనిని**
**కెల్లున నీ వెక్కినయపుడు**
**ఝల్లనె రాక్షస సమితి నీమహిమ**
**వెల్లి మునుఁగుదురు వేంకటరమణా॥**

స్వామివారికి వాహనంగా ఉన్న గరుత్మంతుని సందర్శనవల్ల ఆయురారోగ్యాలు సిద్ధిస్తాయి. గరుత్మంతునిపై విహరిస్తున్న స్వామివారిని దర్శించడంవల్ల పరమపదం సిద్ధిస్తుంది. జ్ఞానవైరాగ్యాలు పొందగోరే భక్తులు. జ్ఞానవైరాగ్యాలనే రెండు రెక్కలున్న గరుత్మంతునిపై విహరిస్తున్న స్వామిని దర్శించడంవల్ల జ్ఞానవైరాగ్యాలు సిద్ధిస్తాయి. అభీష్టాలు నెరవేరుతాయి.

## ధ్వజావరోహణం

గరుడవాహన సేవానంతరం స్వామివారు ధ్వజస్తంభంవద్దకు చేరుకుంటారు. అక్కడ ఋత్విక్కులు వేదపండితుల మంత్రోచ్చారణల నడుమ పీఠాధిపతుల సమక్షంలో తిరిగి ధ్వజస్తంబానికి పూజాది కైంకర్యాలను నిర్వహించి నివేదన, మంగళహారతులు సమర్పించి బ్రహ్మోత్సవాలకు వచ్చిన దేవతలందరికి కృతజ్ఞతలు తెల్పుతూ ఇక తమ తమ లోకాలకు వెళ్ళవలసినదిగా ప్రార్థిస్తూ "బ్రహ్మోత్సవాలు ముగిశాయి" అనేందుకు సంకేతంగా ధ్వజావరోహణ కార్యక్రమాన్ని నిర్వహిస్తారు. పిదప స్వామివారిని అమ్మవార్లను ప్రధానాలయానికి చేర్చి ఏకాంత సేవను నిర్వహిస్తారు.

**జయజయ నృసింహ సర్వేశ**
**భయహర వీర ప్రహ్లాదవరద॥**



**మిహిర శశినయన మృగనరవేష**
**బహిరంతస్థల పరిపూర్ణ**
**అహినాయక సింహాసన రాజిత**
**బహుళ గుణగణ ప్రహ్లాదవరద॥**

**చటుల పరాక్రమ సమఘనవిరహిత**
**నిటలనేత్ర మౌని ప్రణుత**
**కుటిలదైత్యతతి కుక్షి విదారణ**
**పటు వజ్రనఖ ప్రహ్లాదవరద॥**

**శ్రీవనితా సంశ్రిత వామాంక**
**భావజకోటి ప్రతిమాన**
**శ్రీ వేంకటగిరిశిఖరనివాస**
**పావనచరిత ప్రహ్లాదవరద॥**

ఇంతటితో అహోబిలేశుని బ్రహ్మోత్సవాలు ముగుస్తాయి. అంగరంగ వైభవంగా జరిగే ఈ బ్రహ్మోత్సవాలను తిలకించేందుకు ఆంధ్ర, కర్ణాటక, తమిళనాడు ప్రాంతాలనుండేకాక దేశం నలుమూలలనుండి అసంఖ్యాకంగా, భక్తజనులు విచ్చేసి స్వామివారిని దర్శించి చరితార్థులవుతారు. పునః దర్శనప్రాప్తికై స్వామివారిని కోరి, స్వామివారి అనుమతిని పొంది తిరిగి తమతమ స్వస్థలాలకు పయనమవుతారు.

## శ్రీ ప్రహ్లాద వరదస్వామి తెప్పోత్సవం

బ్రహ్మోత్సవాలు ముగిసిన మర్నాడు అలసట తీర్చుకొనేందుకు శ్రీ భూ నీళాసమేత ప్రహ్లాద వరదస్వామివారు జలవిహారం చేస్తారు. ఇదే తెప్పోత్సవం అనబడుతుంది.

ధ్వజావరోహణ అయిన మర్నాటినుండి మూడురోజులు సాయంకాలం ఉభయదేవేరులతో కూడి ప్రహ్లాదవరదస్వామివారు చక్కగా ముస్తాబై సన్నిధి

పుష్కరిణికి చేరుకుంటారు. అక్కడ అహోబలపీఠాధిపతుల సమక్షంలో వేదపండితులు వేదసారాయణం చేస్తుండగా అందంగా అలంకరింపబడిన తెప్పపైకి స్వామివారిని అమ్మవార్లను వేంచేపుజేసి మొదటిరోజు 3, రెండవరోజు 6, మూడవరోజు 9 ఆవర్తనాలు పుష్కరిణిజల్లాల్లో విహరింపజేస్తారు. తదుపరి నివేదనలుచేసి మంగళవాయిద్యాల నడుమ హారతిని సమర్పించి తిరిగి ప్రధానాలయానికి చేర్చి స్వస్తివాచనం నిర్వహించి ఏకాంతసేవను జరుపుతారు. ఈ విధంగా బ్రహ్మోత్సవాలు ముగిసిన మర్నాటినుండి 3 రోజులపాటు ప్రహ్లాదవరదుని జలవిహార ఉత్సవమైన తెప్పోత్సవం చక్కగా నిర్వహిస్తారు.

**॥మంగళం మహత్॥**







## అన్నమయ్య-అహోబలం

నందకాంశ సంభూతుడు, పదకవితా పితామహుడు అయిన తాళ్లపాక అన్నమాచార్యులువారు తిరుమల శ్రీనివాసునితోపాటు అహోబల నృసింహస్వామిని ఆరాధించారు. అన్నమాచార్యులు అహోబిలమఠం తొలి పీఠాధిపతి శ్రీశ్రీశ్రీ ఆదివన్ శఠకోపయతీంద్రమహాదేశికన్ వారివద్ద వైష్ణవ దీక్షను స్వీకరించడమేగాక అహోబలంలో కొంతకాలంపాటు సకల వేదాంత శాస్త్రాలను అధ్యయనం చేశారు. ఆ కాలంలో తాళ్లపాక కవుల విష్ణుభక్తి తత్పరతకు వైష్ణవమత ప్రచారానికి తిరుపతి వలెనే అహోబలంకూడా ప్రధానకేంద్రంగా భాసిల్లింది. తాళ్లపాక అన్నమాచార్యులు మరియు వారివంశీకులు అహోబల నృసింహస్వామివారికి, తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారికి అభేదాన్ని చాటుతూ "వేంకటనారసింహ" అని కీర్తిస్తూ అనేక సంకీర్తనలను రచించారు. కనుకనే అహోబలంలోకూడా తాళ్లపాకకవుల రచనలు చెక్కిన రాగిరేకులు లభ్యమయ్యాయి.

అన్నమాచార్యులవారు రచించిన శ్రీ నృసింహావతార కథా ఘట్టాలను నృసింహవిజయం అనేపేరుతో పదకొండు చరణాల పెద్దపాటలో వీనులవిందుగా గానంచేశారు.

**నాట**

**వినరయ్య నరసింహవిజయము జనులాల**<br>
**అనిశము సంపదలు నాయువు నొసఁగును ॥పల్లవి॥**

**మొదలఁ గొలువుకూటమున నుండి కశిపుడు**<br>
**చదివించెఁ బ్రహ్లాదుని శాస్త్రములు**<br>
**అదన నాతఁడు నారాయణుఁడే దైవమనె**<br>
**అదిరిపడి దైత్యుఁడు ఆతనిఁ జూపుమనె ॥విన॥**

అంతటఁ బ్రహ్లాదుఁడు అన్నిటా నున్నాఁడనియె
పంతమున దానవుఁడు బాలునిఁ జూచి
యెంతయుఁ గడకతోడ ఇందులోఁ జూపుమని
చెంతనున్న కంబము చేతఁగొని వేసె ॥విన॥

అఁటమీఁదట బ్రహ్మాండం బదరుచు
కుటిల భయంకర ఘోషముతో
చిట చిట చిటమని పెట పెట పెటమని
పట పట మనుచును బగిలెఁ గంబము ॥విన॥

కులగిరు లదరెను కుంభిని వడఁకెను
తలఁకిరి దైత్యులు తల్లడిలి
కలఁగెను జగములు కంపించె జగములు
ప్రళయకాలగతిఁ బాటిల్లెనపుడు ॥విన॥

ఘననారసింహుఁడదె కంబమునందు వెడలె
కనుపట్టె నదిగొ చక్రజ్వాలలు
మునుకొని వెడలెఁ గార్ముకముక్తశరములు
కనకకశిపునకుఁ గలఁగె గుండియలు ॥విన॥

అదరె నద్దేవుని కోపాగ్నులు బెడిదపు
మిడుఁగురులతోడుత మిన్నులు ముట్టె
పిడుగులు రాలేటి భీకరనఖరములు
గడుసురక్కసునికి గాలములై తగిలె ॥విన॥

తొడికిపట్టి విష్ణుఁడు తొడమీఁద నిడుకొని
కడుపు చించెను వాని గర్వమడఁగ



వెడలెఁ జిల్లున వాని వేఁడినెత్తురు నింగికి
పొడి పొడి యాయ శత్రుభూషణములెల్లను ॥విన॥

నెళ నెళన విరిచె నిక్కి వాని యెముకలు
పెళ పెళ నారిచి పెచ్చు పెరిగె హరి
జళిపించి పేగులు జంద్యాలుగా వేసుకొనె
తళుకుఁగోరలు తళ తళమని మెరచె ॥విన॥

పెటలించె నరములు పెరికి కుప్పలు వేసి
గుట గుటమని రొప్పె గోవిందుఁడు
చిటిలించి కండలు చెక్కలువారఁ జెండి
కుటిలదానవుఁ జూచి ఖోయని యార్చెను ॥విన॥

తెంచి శిరోజములు దిక్కులకు వాని
పంచప్రాణములు గొనెఁ బరమాత్ముఁడు
అంచెల నీరీతిని ప్రహ్లాదునిపగ నీఁగె
మించి దేవతలు మితిమీఱి జయవెట్టిరి ॥విన॥

అప్పుడిందిరా దేవి యంకమునఁ గూచుండె
వొప్పుగ శాంతమందె నహోబలేశుఁడు
తప్పక కోనేటిదండఁ దానై యిందును నందు
చిప్పిల వరము లిచ్చీ శ్రీవేంకటేశుఁడు ॥విన॥

ఈ నృసింహ విజయగాథను ప్రతినిత్యం పాడినా, విన్నా శత్రుభయం, అపమృత్యుభయం తొలగి సిరిసంపదలు ఆయురారోగ్యాలు సిద్ధిస్తాయని అన్నమాచార్యులవారు తెలియజేస్తారు.

అన్నమాచార్యులు శ్రీ నృసింహస్వామి భీకరస్వరూపంతో ఉద్భవించిన తీరును, హిరణ్యకశిపుని సంహరించిన రీతిని మరో పెద్ద సంకీర్తనలో అద్భుతంగా ఇలా వర్ణించాడు.

## సాళంగనాట

శరణని బ్రదుకరొ జనులాల
గరిమ మెరిసె నిదె కనకసింహము ॥పల్లవి॥

అహరహమునుఁ బ్రహ్లాదుఁడు దొరకొని
బహువిధముల హరిమహిమలు వొగడఁగ
కహ కహ హిరణ్యకశిపుఁడు నగి హరి
సహజ మేదియని చఱచెఁ గంభము ॥శర॥

అట మరి పెట పెటమని బేట్లెగసి
చిట చిట రవములఁ జిరుత పొగలెగసి
తట తట మనుచును తరలి వ్రయ్యలై
పట పట మనుచును పగిలెఁగంభము ॥శర॥

బెడిదపు చూపుల మిడుగురు లెగయఁగ
పుడమి యదర నూర్పులు చెలఁగ
గడ గడ వడఁకి దిక్తటము లల్లాడఁగ
వెడలెఁ గంభమున విజయసింహము ॥శర॥

నగవుల సుడివడె నభోంతరంబులు
పొగ లెగసెను పెనుబొమముళ్ల
పగటు నార్పులను పగిలెను గొండలు
వెగటున వెడలెను వీరసింహము ॥శర॥

తెఱచిన నోరఁబ్రతిధ్వను లెసఁగఁగ
కఱకు గతుల చుక్కలు చెదర
నెఱి హుంకృతులను నిఖిలము బెదరఁగ
వెఱచఱవఁగెరలె విమలసింహము ॥శర॥

పటు విహారముల బ్రహ్మాండముపగల
గుట గుట రవళి నాకులు వొగడ



నిటల నేత్రమున నెఱమంట లడర
పటుగతి మెరసెను భయదసింహము ॥శర॥

పెద పెద కోఱల పిడుగులు రాలఁగ
తుద నఖముల నెత్తురు దొరుగ
గుదిగొను కసరుల కులగిరులూఁటాడ
వుదయించెనదివో వుగ్రసింహము ॥శర॥

అట్టహాసమున నసురలు వారఁగ
ముట్టి వాయువులు మొగతిరుగ
దట్టములై జలధరములు ముసరఁగ
దిట్టయై వెడలె ధీరసింహము ॥శర॥

జలధులు గలఁగెను జడిసె లోకములు
తలఁకె సప్తపాతాళములు
వులికి పడదొడఁగె నూర్ధ్వలోకములు
కొలువున నిలిచెను ఘోరసింహము ॥శర॥

అచ్చట హిరణ్యు నదరంటఁబట్టి
యిచ్చులఁ దొడపై నిడిచించి
కుచ్చి వాని పేగులు జంధ్యములుగ
విచ్చి వేసుకొనె విష్ణుసింహము ॥శర॥

పొగడిరి దివిజులు భువనములు వెలనె
పగ యుడిగి చెలఁగెఁ బ్రహ్లాదుఁడు
మిగుల శాంతమున మించె శ్రీవేంకట-
నగమున నహోబలనారసింహము ॥శర॥

**(సంపు-8. సంకీర్తన-239)**

* * *



# శ్రీలక్ష్మీనృసింహ స్తోత్రకదంబం



జ్వాలానరసింహస్వామి



మోహినీ అలంకారం



## శ్రీ లక్ష్మీనృసింహ సహస్రనామావళి

ఓం హ్రీం శ్రీం ఐం క్రౌం
ఓం నారసింహాయ నమః
ఓం వజ్రదంష్ట్రాయ నమః
ఓం వజ్రిణే నమః
ఓం వజ్రదేహాయ నమః
ఓం వజ్రాయ నమః
ఓం వజ్రనఖాయ నమః
ఓం వాసుదేవాయ నమః
ఓం వంద్యాయ నమః
ఓం వరదాయ నమః
ఓం వరాత్మనే నమః
ఓం వరదాభయహస్తాయ నమః
ఓం వరాయ నమః
ఓం వరరూపిణే నమః
ఓం వరేణ్యాయ నమః
ఓం వరిష్ఠాయ నమః
ఓం శ్రీవరాయ నమః
ఓం ప్రహ్లాదవరదాయ నమః
ఓం ప్రత్యక్షవరదాయ నమః
ఓం పరాత్పరపరేశాయ నమః
ఓం పవిత్రాయ నమః
ఓం పినాకినే నమః
ఓం పావనాయ నమః
ఓం ప్రసన్నాయ నమః
ఓం పాశినే నమః
ఓం పాపహారిణే నమః
ఓం పురుష్టుతాయ నమః
ఓం పుణ్యాయ నమః
ఓం పురుహూతాయ నమః
ఓం తత్పురుషాయ నమః
ఓం పథ్యాయ నమః
ఓం పురాణపురుషాయ నమః
ఓం పురోధసే నమః
ఓం పూర్వజాయ నమః
ఓం పుష్కరాక్షాయ నమః
ఓం పుష్పహాసాయ నమః
ఓం హాసాయ నమః
ఓం మహాహాసాయ నమః
ఓం శార్ఙ్గిణే నమః
ఓం సింహాయ నమః
ఓం సింహరాజాయ నమః
ఓం జగద్వశ్యాయ నమః
ఓం అట్టహాసాయ నమః
ఓం రోషాయ నమః
ఓం జలవాసాయ నమః
ఓం భూతావాసాయ నమః
ఓం భాసాయ నమః
ఓం శ్రీనివాసాయ నమః
ఓం ఖడ్గినే నమః
ఓం ఖడ్గజిహ్వాయ నమః
ఓం సింహాయ నమః
ఓం ఖడ్గవాసాయ నమః
ఓం మూలాధివాసాయ నమః
ఓం ధర్మవాసాయ నమః

ఓం ధన్వినే నమః
ఓం ధనంజయాయ నమః
ఓం ధన్యాయ నమః
ఓం మృత్యుంజయాయ నమః
ఓం శుభంజయాయ నమః
ఓం సూత్రాయ నమః
ఓం శత్రుంజయాయ నమః
ఓం నిరంజనాయ నమః
ఓం నీరాయ నమః
ఓం నిర్గుణాయ నమః
ఓం గుణాయ నమః
ఓం నిష్ప్రపంచాయ నమః
ఓం నిర్వాణపదాయ నమః
ఓం నిబిడాయ నమః
ఓం నిరాలంబాయ నమః
ఓం నీలాయ నమః
ఓం నిష్కళాయ నమః
ఓం కళాయ నమః
ఓం నిమేషాయ నమః
ఓం నిబంధాయ నమః
ఓం నిమేషగమనాయ నమః
ఓం నిర్ద్వంద్వాయ నమః
ఓం నిరాశాయ నమః
ఓం నిశ్చయాయ నమః
ఓం నిరాయ నమః
ఓం నిర్మలాయ నమః
ఓం నిబంధాయ నమః
ఓం నిర్మోహాయ నమః
ఓం నిరాకృతయే నమః

ఓం నిత్యాయ నమః
ఓం సత్యాయ నమః
ఓం సత్కర్మనిరతాయ నమః
ఓం సత్యధ్వజాయ నమః
ఓం ముంజాయ నమః
ఓం ముంజకేశాయ నమః
ఓం కేశినే నమః
ఓం హరీశాయ నమః
ఓం శేషాయ నమః
ఓం గుడాకేశాయ నమః
ఓం సుకేశాయ నమః
ఓం ఊర్ధ్వకేశాయ నమః
ఓం కేశిసంహారకాయ నమః
ఓం జలేశాయ నమః
ఓం స్థలేశాయ నమః
ఓం పద్మేశాయ నమః
ఓం ఉగ్రరూపిణే నమః
ఓం కుశేశయాయ నమః
ఓం కులాయ నమః
ఓం కేశవాయ నమః
ఓం సూక్తికర్ణాయ నమః
ఓం సూక్తాయ నమః
ఓం రక్తజిహ్వాయ నమః
ఓం రాగిణే నమః
ఓం దీప్తరూపాయ నమః
ఓం దీప్తాయ నమః
ఓం ప్రదీప్తాయ నమః
ఓం ప్రలోభినే నమః
ఓం ప్రచ్ఛిన్నాయ నమః



ఓం ప్రబోధాయ నమః
ఓం ప్రభవే నమః
ఓం విభవే నమః
ఓం ప్రభంజనాయ నమః
ఓం పాంథాయ నమః
ఓం ప్రమాయాప్రమితాయ నమః
ఓం ప్రకాశాయ నమః
ఓం ప్రతాపాయ నమః
ఓం ప్రజ్వలాయ నమః
ఓం ఉజ్జ్వలాయ నమః
ఓం జ్వాలామాలాస్వరూపాయనమః
ఓం జ్వలజ్జిహ్వాయ నమః
ఓం జ్వాలినే నమః
ఓం మహాజ్వాలాయ నమః
ఓం కాలాయ నమః
ఓం కాలమూర్తిధరాయ నమః
ఓం కాలాంతకాయ నమః
ఓం కల్పాయ నమః
ఓం కృతే నమః
ఓం కాలచక్రాయ నమః
ఓం చక్రాయ నమః
ఓం వషట్చక్రాయ నమః
ఓం చక్రిణే నమః
ఓం అక్రూరాయ నమః
ఓం కృతాంతాయ నమః
ఓం విక్రమాయ నమః
ఓం క్రమాయ నమః
ఓం కృత్తినే నమః
ఓం కృత్తివాసాయ నమః

ఓం కృతఘ్నాయ నమః
ఓం కృతాత్మనే నమః
ఓం సంక్రమాయ నమః
ఓం క్రుద్ధాయ నమః
ఓం క్రాంతలోకత్రయాయ నమః
ఓం అరూపాయ నమః
ఓం స్వరూపాయ నమః
ఓం హరయే నమః
ఓం పరమాత్మనే నమః
ఓం అజయాయ నమః
ఓం ఆదిదేవాయ నమః
ఓం అక్షయాయ నమః
ఓం క్షయాయ నమః
ఓం అఘోరాయ నమః
ఓం సుఘోరాయ నమః
ఓం ఘోరఘోరతరాయ నమః
ఓం అఘోరవీర్యాయ నమః
ఓం లసద్ఘోరాయ నమః
ఓం ఘోరాధ్యక్షాయ నమః
ఓం దక్షాయ నమః
ఓం దక్షిణాయ నమః
ఓం ఆర్యాయ నమః
ఓం శంభవే నమః
ఓం అమోఘాయ నమః
ఓం గుణౌఘాయ నమః
ఓం అనఘాయ నమః
ఓం అఘహారిణే నమః
ఓం మేఘనాథాయ నమః
ఓం నాదాయ నమః

ఓం మేఘాత్మనే నమః
ఓం మేఘవాహనరూపాయ నమః
ఓం మేఘశ్యామాయ నమః
ఓం మాలినే నమః
ఓం వ్యాలయజ్ఞోపవీతాయ నమః
ఓం వ్యాఘ్రదేహాయ నమః
ఓం వ్యాఘ్రపాదాయ నమః
ఓం వ్యాఘ్రకర్మిణే నమః
ఓం వ్యాపకాయ నమః
ఓం వికటాస్యాయ నమః
ఓం వీరాయ నమః
ఓం విష్టరశ్రవసే నమః
ఓం వికీర్ణనఖదంష్ట్రాయ నమః
ఓం నఖదంష్ట్రాయుధాయ నమః
ఓం విష్వక్సేనాయ నమః
ఓం సేనాయ నమః
ఓం విహ్వాలాయ నమః
ఓం బలాయ నమః
ఓం విరూపాక్షాయ నమః
ఓం వీరాయ నమః
ఓం విశేషాక్షాయ నమః
ఓం సాక్షిణే నమః
ఓం వీతశోకాయ నమః
ఓం విధానాయ నమః
ఓం విధేయాయ నమః
ఓం విజయాయ నమః
ఓం జయాయ నమః
ఓం విబుధాయ నమః
ఓం విభావాయ నమః

ఓం విశ్వంభరాయ నమః
ఓం వీతరాగాయ నమః
ఓం విప్రాయ నమః
ఓం విటంకనయనాయ నమః
ఓం విపులాయ నమః
ఓం వినీతాయ నమః
ఓం విశ్వయోనయే నమః
ఓం చిదంబరాయ నమః
ఓం విత్తాయ నమః
ఓం విశ్రుతాయ నమః
ఓం వియోనయే నమః
ఓం విహ్వాలాయ నమః
ఓం వికల్పాయ నమః
ఓం కల్పాతీతాయ నమః
ఓం శిల్పినే నమః
ఓం కల్పనాయ నమః
ఓం స్వరూపాయ నమః
ఓం ఫణితల్పాయ నమః
ఓం తటిత్ప్రలాభాయ నమః
ఓం తార్యాయ నమః
ఓం తరుణాయ నమః
ఓం తరస్వినే నమః
ఓం తపనాయతరక్షాయ నమః
ఓం తాపత్రయహరాయ నమః
ఓం తారకాయ నమః
ఓం తమోఘ్నాయ నమః
ఓం తత్త్వాయ నమః
ఓం తపస్వినే నమః
ఓం తక్షకాయ నమః



ఓం తనుత్రాయ నమః
ఓం తటినే నమః
ఓం తరళాయ నమః
ఓం శతరూపాయ నమః
ఓం శాంతాయ నమః
ఓం శతధారాయ నమః
ఓం శతపత్రాయ నమః
ఓం తార్క్ష్యాయ స్థితాయ నమః
ఓం శతమూర్తయే నమః
ఓం శతక్రతుస్వరూపాయ నమః
ఓం శాశ్వతాయ నమః
ఓం శతాత్మనే నమః
ఓం సహస్రశిరసే నమః
ఓం సహస్రవదనాయ నమః
ఓం సహస్రాక్షాయ నమః
ఓం దేవాయ నమః
ఓం దిశశ్రోత్రాయ నమః
ఓం సహస్రజిహ్వాయ నమః
ఓం మహాజిహ్వాయ నమః
ఓం సహస్రనామధేయాయ నమః
ఓం సహస్రాక్షిధరాయ నమః
ఓం సహస్రబాహవే నమః
ఓం సహస్రచరణాయ నమః
ఓం సహస్రార్కప్రకాశాయ నమః
ఓం సహస్రాయుధధారిణే నమః
ఓం స్థూలాయ నమః
ఓం సూక్ష్మాయ నమః
ఓం సుసూక్ష్మాయ నమః
ఓం సుభిక్షాయ నమః

ఓం సురాధ్యక్షాయ నమః
ఓం శౌరిణే నమః
ఓం ధర్మాధ్యక్షాయ నమః
ఓం ధర్మాయ నమః
ఓం లోకాధ్యక్షాయ నమః
ఓం ప్రజాధ్యక్షాయ నమః
ఓం శిక్షాయ నమః
ఓం విపక్షక్షయమూర్తయే నమః
ఓం కాలాధ్యక్షాయ నమః
ఓం తీక్ష్ణాయ నమః
ఓం మూలాధ్యక్షాయ నమః
ఓం అధోక్షజాయ నమః
ఓం మిత్రాయ నమః
ఓం సుమిత్రవరుణాయ నమః
ఓం శత్రుఘ్నాయ నమః
ఓం అవిఘ్నాయ నమః
ఓం విఘ్నకోటిహరాయ నమః
ఓం రక్షోఘ్నాయ నమః
ఓం తమోఘ్నాయ నమః
ఓం భూతఘ్నాయ నమః
ఓం భూతపాలాయ నమః
ఓం భూతాయ నమః
ఓం భూతావాసాయ నమః
ఓం భూతినే నమః
ఓం భూతభేతాళఘాతాయ నమః
ఓం భూతాధిపతయే నమః
ఓం భూతగ్రహవినాశాయ నమః
ఓం భూతసంయమతే నమః
ఓం మహాభూతాయ నమః

ఓం భృగవే నమః
ఓం సర్వభూతాత్మనే నమః
ఓం సర్వారిష్టవినాశాయ నమః
ఓం సర్వసంపత్కరాయ నమః
ఓం సర్వాధారాయ సమః
ఓం శర్వాయ నమః
ఓం సర్వార్తిహరాయ నమః
ఓం సర్వదుఃఖప్రశాంతాయ నమః
ఓం సర్వసౌభాగ్యదాయినే నమః
ఓం సర్వజ్ఞాయ నమః
ఓం అనంతాయ నమః
ఓం సర్వశక్తిధరాయ నమః
ఓం సర్వైశ్వర్య ప్రదాత్రే నమః
ఓం సర్వకార్యవిధాయినే నమః
ఓం సర్వజ్వరవినాశాయ నమః
ఓం సర్వరోగాపహారిణే నమః
ఓం సర్వాభిచారహంత్రే నమః
ఓం సర్వైశ్వర్యవిధాయినే నమః
ఓం పింగాక్షాయ నమః
ఓం ఏకశృంగాయ నమః
ఓం ద్విశృంగాయ నమః
ఓం మరీచయే నమః
ఓం బహుశృంగాయ నమః
ఓం లింగాయ నమః
ఓం మహాశృంగాయ నమః
ఓం మాంగల్యాయ నమః
ఓం మనోజ్ఞాయ నమః
ఓం మంతవ్యాయ నమః
ఓం మహాత్మనే నమః

ఓం మహాదేవాయ దేవాయనమః
ఓం మాతృలింగధరాయ నమః
ఓంమహామాయాప్రసూతాయనమః
ఓం ప్రస్తుతాయ నమః
ఓం మాయినే నమః
ఓం జలశాయినే నమః
ఓం మహోదరాయ నమః
ఓం మందాయ నమః
ఓం మదదాయ నమః
ఓం మదాయ నమః
ఓం మధుకైటభహంత్రే నమః
ఓం మాధవాయ నమః
ఓం మురారయే నమః
ఓం మహావీర్యాయ నమః
ఓం ధైర్యాయ నమః
ఓం చిత్రవీర్యాయ నమః
ఓం చిత్రకూర్మాయ నమః
ఓం చిత్రాయ నమః
ఓం చిత్రభానవే నమః
ఓం మాయాతీతాయ నమః
ఓం మాయాయ నమః
ఓం మహావీరాయ నమః
ఓం మహాతేజాయ నమః
ఓం బీజాయ నమః
ఓం తేజోధామ్నే నమః
ఓం బీజినే నమః
ఓంతేజోమయనృసింహాయనమః
ఓం చిత్రభానవే నమః
ఓం మహాదంష్ట్రాయ నమః



ఓం తుష్టాయ నమః
ఓం పుష్టికరాయ నమః
ఓం శిపివిష్టాయ నమః
ఓం హృష్టాయ నమః
ఓం పుష్టాయ నమః
ఓం పరమేష్ఠినే నమః
ఓం విశిష్టాయ నమః
ఓం శిష్టాయ నమః
ఓం గరిష్ఠాయ నమః
ఓం ఇష్టదాయినే నమః
ఓం జ్యేష్ఠాయ నమః
ఓం శ్రేష్ఠాయ నమః
ఓం త్రిమూర్తివిద్యాయ నమః
ఓం త్రితత్త్వజ్ఞానినే నమః
ఓం అక్షోభ్యాయ నమః
ఓం అనిరుద్ధాయ నమః
ఓం అప్రమేయాయ నమః
ఓం భానవే నమః
ఓం అమృతాయ నమః
ఓం అనంతాయ నమః
ఓం అమితాయామితౌజసే నమః
ఓం అపమృత్యువినాశాయ నమః
ఓం అపస్మారవిఘాతినే నమః
ఓం అన్నదాయ నమః
ఓం అన్నరూపాయ నమః
ఓం అన్నాయ నమః
ఓం అన్నభుజే నమః
ఓం నాద్యాయ నమః
ఓం నిరవద్యాయ నమః

ఓం విద్యాయ నమః
ఓం అద్భుతకర్మణే నమః
ఓం సద్యోజాతాయ నమః
ఓం సంఘాయ నమః
ఓం వైద్యుతాయ నమః
ఓం అధ్వాతీతాయ నమః
ఓం సత్త్వాయ నమః
ఓం వాగతీతాయ నమః
ఓం వాగ్మినే నమః
ఓం వాగీశ్వరాయ నమః
ఓం గోపాయ నమః
ఓం గోహితాయ నమః
ఓం గవాం పతయే నమః
ఓం గంధర్వాయ నమః
ఓం గభీరాయ నమః
ఓం గర్జితాయ నమః
ఓం ఊర్జితాయ నమః
ఓం పర్జన్యాయ నమః
ఓం ప్రబుద్ధాయ నమః
ఓం ప్రధానపురుషాయ నమః
ఓం పద్మనాభాయ నమః
ఓం సునాభాయ నమః
ఓం పద్మనాభాయ నమః
ఓం మానినే నమః
ఓం పద్మనేత్రాయ నమః
ఓం పద్మాయ నమః
ఓం పద్మాయాః పతయే నమః
ఓం పద్మోదరాయ నమః
ఓం పూతాయ నమః

ఓం పద్మకల్పోద్భవాయ నమః
ఓం హృత్పద్మవాసాయ నమః
ఓం భూపద్మోద్ధరణాయ నమః
ఓం బ్రహ్మస్వరూపాయ నమః
ఓం బ్రహ్మరూపధరాయ నమః
ఓం బ్రహ్మణే నమః
ఓం బ్రహ్మరూపాయ నమః
ఓం పద్మనేత్రాయ నమః
ఓం బ్రహ్మదాయ బ్రాహ్మణాయ నమః
ఓం బ్రహ్మబ్రహ్మాత్మనే నమః
ఓం సుబ్రహ్మణ్యాయ నమః
ఓం దేవాయ నమః
ఓం బ్రహ్మణ్యాయ నమః
ఓం త్రివేదినే నమః
ఓం పరబ్రహ్మస్వరూపాయ నమః
ఓం పంచబ్రహ్మాత్మనే నమః
ఓం బ్రహ్మశిరసే నమః
ఓం అశ్వశిరసే నమః
ఓం అథర్వశిరసే నమః
ఓం నిత్యమశనిప్రమితాయ నమః
ఓం తీక్ష్ణదంష్ట్రాయ నమః
ఓం లోలాయ నమః
ఓం లలితాయ నమః
ఓం లావణ్యాయ నమః
ఓం లవిత్రాయ నమః
ఓం భాసకాయ నమః
ఓం లక్షణజ్ఞాయ నమః
ఓం లక్ష్యాయ నమః
ఓం లక్షణాయ నమః

ఓం లసద్దీప్తాయ నమః
ఓం లిప్తాయ నమః
ఓం విష్ణవే నమః
ఓం ప్రభవిష్ణవే నమః
ఓం వృష్ణిమూలాయ నమః
ఓం కృష్ణాయ నమః
ఓం మహావిష్ణవే నమః
ఓం మహాసింహాయ నమః
ఓం హారిణే నమః
ఓం వనమాలినే నమః
ఓం కిరీటినే నమః
ఓం కుండలినే నమః
ఓం సర్వాంగాయ నమః
ఓం సర్వతోముఖాయ నమః
ఓం సర్వతః పాణిపాదోదరాయ నమః
ఓం సర్వతోఽక్షి శిరోముఖాయ నమః
ఓం సర్వేశ్వరాయ నమః
ఓం సదాతుష్టాయ నమః
ఓం సమర్థాయ నమః
ఓం సమరప్రియాయ నమః
ఓంబహుయోజనవిస్తీర్ణాయ నమః
ఓం బహుయోజనమాయతాయ నమః
ఓం బహుయోజనహస్తాంఘ్రయే నమః
ఓం బహుయోజననాసికాయ నమః
ఓం మహారూపాయ నమః
ఓం మహాదంష్ట్రాయ నమః
ఓం మహాబలాయ నమః
ఓం మహాభుజాయ నమః
ఓం మహానాదాయ నమః



ఓం మహారౌద్రాయ నమః
ఓం మహాకాయాయ నమః
ఓం ఆనాభేర్బ్రహ్మణోరూపాయ నమః
ఓం ఆగలాద్వైష్ణవాయ నమః
ఓం అగ్రే సర్వతః శివాయ నమః
ఓం నారాయణ నారసింహాయ నమః
ఓం నారాయణ వీరసింహాయ నమః
ఓం నారాయణ క్రూరసింహాయ నమః
ఓం నారాయణ దివ్యసింహాయ నమః
ఓం నారాయణ వ్యాఘ్రసింహాయనమః
ఓం నారాయణ పుచ్ఛసింహాయ నమః
ఓం నారాయణ పూర్ణసింహాయ నమః
ఓం నారాయణ రౌద్రసింహాయ నమః
ఓం భీషణ భద్రసింహాయ నమః
ఓం విహ్వాల నేత్రసింహాయనమః
ఓం బృంహిత భూతసింహాయ నమః
ఓం నిర్మల చిత్రసింహాయ నమః
ఓం నిర్జితకాలసింహాయ నమః
ఓం కల్పితకల్పసింహాయ నమః
ఓం కామద కామసింహాయ నమః
ఓం భువనైకసింహాయ నమః
ఓం విష్ణవే నమః
ఓం భవిష్ణవే నమః
ఓం సహిష్ణవే నమః
ఓం భ్రాజిష్ణవే నమః
ఓం జిష్ణవే నమః
ఓం పృథివీమంతరిక్షాయ నమః
ఓం పర్వతారణ్యాయ నమః
ఓం కలాకాష్ఠావిలిప్తాయ నమః

ఓం ముహూర్తప్రహరాదికాయనమః
ఓం అహోరాత్రాయ నమః
ఓం త్రిసంధ్యాయ నమః
ఓం పక్షాయ నమః
ఓం మాసాయ నమః
ఓం ఋతవే నమః
ఓం వత్సరాయ నమః
ఓం యుగాదయే నమః యుగభేదాయ నమః
ఓం యుగాయ యుగసంధయే నమః
ఓం నిత్యాయ నమః
ఓం నైమిత్తికాయ నమః
ఓం దైవాయ నమః
ఓం మహాప్రళయాయ నమః
ఓం కరణాయ నమః
ఓం కారణాయ నమః
ఓం కర్త్రే నమః
ఓం భర్త్రే నమః
ఓం హర్త్రే నమః
ఓం ఈశ్వరాయ నమః
ఓం సత్కర్త్రే నమః
ఓం సత్కృతయే నమః
ఓం గోప్త్రే నమః
ఓం సచ్చిదానందవిగ్రహాయనమః
ఓం ప్రాణాయ నమః
ఓం ప్రాణినాం ప్రత్యగాత్మనే నమః
ఓం సర్వదేహినే నమః
ఓం సుజ్యోతిషే నమః
ఓం పరంజ్యోతిషే నమః

ఓం ఆత్మజ్యోతిషే నమః
ఓం సనాతనాయ నమః
ఓం జ్యోతిషే నమః
ఓం లోకస్వరూపాయ నమః
ఓం జ్యోతిషే నమః
ఓం జ్ఞేయాయ నమః
ఓం జ్యోతిషాం పతయే నమః
ఓం స్వాహాకారాయ నమః
ఓం స్వధాకారాయ నమః
ఓం వషట్కారాయ నమః
ఓం కృపాకరాయ నమః
ఓం హంతకారాయ నమః
ఓం నిరాకారాయ నమః
ఓం వేగాకారాయ నమః
ఓం శంకరాయ నమః
ఓం అకారాదిహకారాంతాయనమః
ఓం ఓంకారాయ నమః
ఓం లోకకారకాయ నమః
ఓం ఏకాత్మనే నమః
ఓం అనేకాత్మనే నమః
ఓం చతురాత్మనే నమః
ఓం చతుర్భుజాయ నమః
ఓం చతుర్మూర్తయే నమః
ఓం చతుర్దంష్ట్రాయ నమః
ఓం చతుర్వేదమయాయ నమః
ఓం ఉత్తమాయ నమః
ఓం లోకప్రియాయ నమః
ఓం లోకగురవే నమః
ఓం లోకేశాయ నమః

ఓం లోకనాయకాయ నమః
ఓం లోకసాక్షిణే నమః
ఓం లోకపతయే నమః
ఓం లోకాత్మనే నమః
ఓం లోకలోచనాయ నమః
ఓం లోకాధారాయ నమః
ఓం బృహల్లోకాయ నమః
ఓం లోకాలోకమయాయ నమః
ఓం విభవే నమః
ఓం లోకకర్త్రే నమః
ఓం విశ్వకర్త్రే నమః
ఓం కృతావర్తాయ నమః
ఓం కృతాగమాయ నమః
ఓం అనాదయే నమః
ఓం అనంతాయ నమః
ఓం అభూతాయ నమః
ఓం భూతవిగ్రహాయ నమః
ఓం స్తుతయే నమః
ఓం స్తుత్యాయ నమః
ఓం స్తవప్రీతాయ నమః
ఓం స్తోత్రే నమః
ఓం నియామకాయ నమః
ఓం గతయే నమః
ఓం మతయే నమః
ఓం పిత్రే నమః
ఓం మాత్రే నమః
ఓం గురవే నమః
ఓం సఖ్యే నమః
ఓం సుహృదశ్చాత్మరూపాయ నమః



ఓం మంత్రరూపాయ నమః
ఓం అస్త్రరూపాయ నమః
ఓం బహురూపాయ నమః
ఓం రూపాయ నమః
ఓం పంచరూపధరాయ నమః
ఓం భద్రరూపాయ నమః
ఓం రూఢాయ సనమః
ఓం యోగిరూపాయ నమః
ఓం యోగినే నమః
ఓం సమరూపాయ నమః
ఓం యోగాయ నమః
ఓం యోగపీఠస్థితాయ నమః
ఓం యోగగమ్యాయ నమః
ఓం సౌమ్యాయ నమః
ఓం ధ్యానగమ్యాయ నమః
ఓం ధ్యాయినే నమః
ఓం ధ్యేయగమ్యాయ నమః
ఓం ధామ్నే నమః
ఓం ధామాధిపతయే నమః
ఓం ధరాధరాయ నమః
ఓం ధర్మాయ నమః
ఓం ధారణాభిరతాయ నమః
ఓం ధాత్రే నమః
ఓం సంధాత్రే నమః
ఓం విధాత్రే నమః
ఓం ధరాయ నమః
ఓం దామోదరాయ నమః
ఓం దాంతాయ నమః
ఓం దానవాంతకరాయ నమః

ఓం సంసారవైద్యాయ నమః
ఓం భేషజాయ నమః
ఓం సీరధ్వజాయ నమః
ఓం శీతాయ నమః
ఓం వాతాయ నమః
ఓం ప్రమితాయ నమః
ఓం సారస్వతాయ నమః
ఓం సంసారనాశనాయ నమః
ఓం అక్షమాలినే నమః
ఓం అసిధర్మధరాయ నమః
ఓం షట్కర్మనిరతాయ నమః
ఓం వికర్మాయ నమః
ఓం సుకర్మాయ నమః
ఓం పరకర్మవిధాయినే నమః
ఓం సుశర్మణే నమః
ఓం మన్మథాయ నమః
ఓం వర్మణే నమః
ఓం వర్మిణే నమః
ఓం కరిచర్మవసనాయ నమః
ఓం కరాళవదనాయ నమః
ఓం కవయే నమః
ఓం పద్మగర్భాయ నమః
ఓం భూతగర్భాయ నమః
ఓం ఘృణానిధయే నమః
ఓం బ్రహ్మగర్భాయ నమః
ఓం గర్భాయ నమః
ఓం బృహద్గర్భాయ నమః
ఓం ధూర్జటయే నమః
ఓం విశ్వగర్భాయ నమః

